# కావ్యాలంకార సంగ్రహము

## నరసభూపాలీయము

రామరాజ భూషణ ప్రణీతము




వ్యాఖ్యాత :

"భాషాప్రవీణ"

డా॥ పోచనపెద్ది వేంకట మురళీకృష్ణ

ఎం. ఎ. ఎం. ఫిల్. పి.హెచ్ డి.

తెలుగు లెక్చరర్

ప్రభుత్వ జూనియర్ కళాశాల







రోహిణి పబ్లికేషన్స్

మెయిన్‌రోడ్, రాజమండ్రి-1

—

# కావ్యాలంకార సంగ్రహము

(నరసభూపాలీయము)

వ్యాఖ్యాత :

డా॥ శ్రీ పోచనపెద్ది వేంకట మురళీకృష్ణ, ఎం.ఏ., పి.హెచ్.డి



ప్రథమ ముద్రణ : ఏప్రిల్ 1998

మూల్యం : రూ. 65/-

ముద్రణ :

వంశీకృష్ణా ప్రింటర్స్

విజయవాడ - 2.

ప్రకాశకులు :

రోహిణీ పబ్లికేషన్స్

మెయిన్‌రోడ్, రాజమండ్రి - 1.

# పీఠిక

అలంకార శాస్త్రములకు ప్రయోజనము కలదా? అను సందేహమునకు "కావ్య ఫలములే కావ్యశాస్త్ర ఫలములు" అని విశ్వనాథుడు సమాధానము చెప్పెను. శాస్త్రము ఎరుగనివాడు గుణదోషములను ఏ విధముగా విభజించును? అంధునకు రూప భేద విజ్ఞానం కలుగనట్లే శాస్త్ర జ్ఞానం లేని వానికి గుణదోషములు తెలియవని దండి చెప్పెను. కావున కావ్యమందలి గుణదోషములను తెలుసుకొనుటకు అలంకార శాస్త్రములు ఆవశ్యకము.

లక్ష్యము ముందుగా ఆవిర్భవించి లక్షణములు తరువాత జనించుట సహజం. కొన్ని సమయములలో లక్షణమును అనుసరించి లక్ష్యములు నిర్మింపబడును. లక్ష్య, లక్షణములు పరస్పర సంబంధం కలిగి ఉండును. తెలుగు సాహిత్యంలో ఈ రీతిగనే లక్షణ గ్రంథములు ఆవిర్భవించినవి

16 వ॥ శ॥ పాలించిన అళియ రామరాజునకు అల్లుడైన నరసరాజునకు అంకితముగా మూర్తి కవి నరసభూపాలీయమును రచించెను. ప్రతాపరుద్రీయము నందు ప్రతాపరుద్రుడు నాయకుడు కాగా నరసభూపాలీయమునందు నరసరాజు నాయకుడు. ఈ విధంగా మూర్తి కవి లక్షణములు ప్రతాపరుద్రీయము నుండి గ్రహించి, లక్ష్యములు స్వతంత్రముగా కల్పించి, అలంకార శాస్త్ర రచనలో స్వతంత్రతను కల్పించెను. ప్రతాపరుద్రీయములోని నాటక ప్రకరణము అనువదించక పోవుటకు గల కారణములు గమనించదగినది.

ఈ లక్షణ గ్రంథమునకు "కావ్యాలంకార సంగ్రహము" అనునది కవి పెట్టిన పేరు కాగా "నరసభూపాలీయము" అనునది లోక వ్యవహార

నామము. సంస్కృతములో విద్యానాథుడు రచించిన "ప్రతాపరుద్ర యశోభూషణమునకు" తగిన నామం ప్రతాపరుద్రీయము. అదే విధంగా తెలుగు సాహిత్యమునందు ఏర్పడినది.

ఈ కవికి రామరాజు భూషణుడు, భట్టు మూర్తి అను నామములు వ్యవహారమున గలవు. రామరాజ భూషణుడు అనునది బిరుద నామము అనియు "భట్టుమూర్తి" అనునది నిజనామమనియు పరిశోధకుల అభిప్రాయము. ఈ అభిప్రాయమునకు వ్యతిరేకంగా రామరాజ భూషణుడు, భట్టుమూర్తి భిన్నకవులు అను అభిప్రాయం ప్రచారమున గలదు. ఈ కవి జన్మస్థలము "భట్టుపల్లె" అను గ్రామం. కృష్ణదేవరాయలు, "ప్రబంధక ముహారని" బిరుదు పొందిన వీరి పూర్వీకులకు భట్టుపల్లె దానం చేసిరి. ఈ భట్టుపల్లె బళ్ళారి మండలం పాలమండలమునకు సమీపమున ఉన్నదని కొందరు కడప మండలంలోని పులివెందల తాలూకాలో నున్నదని కొందరు వ్రాసియున్నట్లుగా వీరేశలింగం గారు రచించిరి. మూర్తికవి తండ్రి వేంకట రాయ భూషణుడనియు, రామరాజు భూషణుని తండ్రి సూరపరాజనియు ఆశ్వాసాంత గద్యముల వలన తెలియుచున్నది. ఈ విధముగా ఆశ్వాసాంత గద్యములు భిన్నముగా ఉండుటవలనను, కావ్యాలంకారము, వసుచరిత్ర, హరిశ్చంద్ర నలోపాఖ్యానము" శైలి భిన్నముగా ఉండుటవలన వీరిరువురు భిన్నకవులను అభిప్రాయం ఏర్పడినది. "వేంకట రాయ భూషణ" అనునది బిరుద నామమేగాని, వ్యక్తినామము కాదని "వజ్ఝల"వారి అభిప్రాయం. వసుచరిత్ర, హరిశ్చంద్ర నలోపాఖ్యానములు ప్రౌఢ వయస్సున కావ్యాలంకార సంగ్రహము బాల్యమున రచించి యుండ వచ్చునని కొందరి అభిప్రాయం. సమర్థుడైన కవి వస్తువునుబట్టి

శైలి ఎన్నుకొనును. ప్రబంధాదులైన వసుచరిత్ర, హరిశ్చంద్ర నలోపా ఖ్యానములకు వాడిన శైలి లక్షణ గ్రంథమైన కావ్యాలంకార సంగ్రహము నకు ఎట్లువాడును.

ఈ మూర్తి కవి అష్టదిగ్గజకవులలో ఒకడనియు,అల్లసాని పెద్దనామాత్యుడు ఈతని గురువనియు "ఆంధ్ర కౌముదీ" వివరణబట్టి తెలియు చున్నది. కాని, చారిత్రిక ఆధారములను పరిశీలించినచో మూర్తి కవి రాయల కాలమునాటి అష్టదిగ్గజ కవులలో ఒకడుగా ఉండుట పొసగదు. రాయల కాలము నాటికి, మూర్తి కవి బాలకవిగా ఉండి, 1541-64 సం॥ నడుమ కాలమున కృష్ణదేవరాయల అల్లుడయిన రామరాజు యొక్క ఆశ్రయమును పొందియుండవచ్చును.

రామరాజు, తిరుమల రాయలయొక్క ఆశ్రయము పొందుటకు పూర్వము మూర్తికవి వారి మేనల్లుడయిన నరసరాజును ఆశ్రయించి "కావ్యాలంకారసంగ్రహము" అంకితమిచ్చెను. నరసరాజు ఆశ్రయమున రామరాజు, తిరుమల రాయల యొక్క ఆశ్రయము, రామరాజుభూషణ బిరుదమును పొందెను మూర్తికవి 1510-1580, మధ్య కాలమున జీవించి యుండవచ్చును.

నరసభూపాలీయమునకు నాయకుడయిన నరసరాజు, రామరాజు, తిరుమలదేవరాయులకు మేనల్లుడు. నరసరాజు మాతామహుడయిన శ్రీరంగరాజునకు, కోనరాజు, తిమ్మరాజు, రామరాజు, తిరుమలరాజు, వేంకటపతి, అను ఆర్గురు కుమారులు. లక్కమాంబ, జోగమాంబ, కోనమాంబ అను ముగ్గురు కుమార్తెలు గలరు. వారిలో లక్కమాంబ కుమారుడయిన నరసరాజు కావ్యాలంకార సంగ్రహము కృతి పొందెను.

రామరాజు భూషణుని కవితా ప్రతిభను చవిచూడవలయునన్న, వసుచరిత్ర, హరిశ్చంద్రనలోపాఖ్యానములు చదువవలయును. లక్షణ గ్రంథమయినను, నరసభూపాలీయమున అనేక చమత్కారములు ప్రదర్శించెను, మూర్తికవి తనలోని కవితామహిమనుగూర్చి యిట్లు తెలిపెను.

సీ॥ బాణవేగంబును భవభూతి సుకుమార
తయు మాఘునౌచిత్యంబు దండిసమత
యలమయూరు సువర్ణకళవి చోరునియర్థ
సంగ్రహమ్ము మురారి శయ్య నేర్పు
సోమప్రసాదంబు సోమయాజుల నియ
మంబు భాస్కరుని సన్మార్గఘటన
శ్రీనాథుని పద ప్రసిద్ధధారాశుద్ధి
యమరేశ్వరుని సహస్ర ముఖ దృష్టి

తే॥ నీక కల దటుగాన ననేక వదన
సదన సంచార ఖేదంబునడలుపటిచి
భారతీదేవి నీ జిహ్వాబాదుకొనియె
మూర్తికవిచంద్ర! విఖ్యాత కీర్తి సాంద్ర.

ఇట్టి కవితాత్మ కలిగిన మూర్తికవి కావ్యాలంకార సంగ్రహము ప్రాచీన కాలము నుండి ప్రామాణిక గ్రంథముగా నుండి, ఆధునిక కాలమున పాఠ్యగ్రంథముగా ప్రచారము పొందినది.

బిట్రప్రోలు సంస్థాన పండితులగు శ్రీ వెల్లాలసదాశివశాస్త్రిగారు ద్వితీయ, తృతీయాశ్వాసములకు వ్యాఖ్యానము రచించిరి. పిదప 1863 సం॥ వి. కృష్ణమాచార్యులు, బి. సీతారామాచార్యులుగారు పరిష్కరించి, లఘుటీకతో ప్రచురించిరి. ఆటు తరువాత వావిళ్ళవారి ప్రోత్సాహముతో బులుసు వేంకటరమణయ్యగారి లఘుటీకతో కావ్యాలంకార సంగ్రహము ప్రచురించబడినది. సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారి వ్యాఖ్యానము కావ్యాలంకార సంగ్రహమునకు కరదీపిక. సుదీర్ఘమైన వారి వ్యాఖ్యానము లక్షణగ్రంథములోని లోతులను చూపించినవి.

ఈ వ్యాఖ్యానములలో కొన్ని చరిత్ర పుటలలో చేరిపోగా, మరి కొన్ని గ్రంథాలయముల గ్రంథులమధ్య నలిగి పోవుచున్నవి. ఆట్టి తరుణములో రోహిణి ప్రచురణ సంస్థ కావ్యాలంకార సంగ్రహమును ప్రచురింపబూనినది, నేటి పాఠకుల సౌకర్యమును, జిజ్ఞాసను దృష్టిలో పెట్టుకొని ఈ వ్యాఖ్యానము రచింపబడినది. పాఠాంతరముల సమస్యను చర్చింపక, సాధుత్వాసాధుత్వ చర్చలు విడిచిపెట్టబడినది. వావిళ్ళవారి ప్రతిని ఆధారగ్రంథముగా స్వీకరించి సరళ గ్రాంథికములో, సరళ భావనతో వ్యాఖ్య అందించ ప్రయత్నించితిని. కొన్ని పట్టికలను ప్రాచీన వ్యాఖ్యాతల నుండి గ్రహించి పాఠకుల సౌలభ్యమునకై అనుబంధముగా చేర్చబడినవి, ఈ వ్యాఖ్యలోని లోపములు సహృదయులు సౌహృదయముతో మన్నించ ప్రార్థన.

"మహో వావిళ్ళ సంస్థ" ఆవిర్భవించినది అనునట్లుగా రోహిణి ప్రచురణ సంస్థ ప్రాచీన ఆధునిక సాహిత్య గ్రంధములను ప్రచురింప బూనినది. అధినేత శ్రీ॥ పైల అప్పారావుగారు ఈ వ్యాఖ్యాన రచనకు ప్రోత్సహించి అవకాశము కల్పించినందులకు సర్వదా కృతజ్ఞుడను.

ఈ ప్రథమ ప్రసూనమును మాతృశ్రీచరణారవిందములకు సమర్పించుకొనుచు

మీ

రాజమహేంద్ర — బుధజన విధేయుడు

25-3-1998 — మురళీకృష్ణ

# విషయానుక్రమణిక

## ప్రథమాశ్వాసము



## ద్వితీయాశ్వాసము

# తృతీయాశ్వాసము

## చతుర్థాశ్వాసము

## పంచమాశ్వాసము

శ్రీ ర స్తు

# కావ్యాలంకార సంగ్రహము

## నరసభూపాలీయము

### గ్రంథాదికృత్యములు

శా. శ్రీలీలావతి దా నారీమణి సభాసింహాసనత్కౌస్తుభా
వేలాభాప్రతిబింబితాంగియగుచున్ వ్యాలోకితం దాల్చునాఁ
హాలేయంచుఁ దలంచునో యన నమందానందుఁడై లక్ష్మినే
వేళం గాఁగిటఁ జేర్చు శౌరి నరసోర్వీనాథునిం బ్రోచుతన్ 1

సీ. ఏ లేమ కడలిరాచూలి యనా వెలింగించుఁ
గలితవళీతరంగములరంగు
ఏమానినీరత్న మిందుసోదరి యనాటఁ
బ్రకటించు మొగముపోలిక తెలంగు
ఏతన్వి కందర్పమాత యనా వెలింగించుఁ
గరగృహీతాంభోజకాండకలన
ఏసాధ్వి దనుజారియిల్లా లవుటఁ దెల్పు
నలి వినీలాబ్జజిన్న యనగరిమ

తే. యట్టి శ్రీదేవి సుకవి వాగమృతదంబు
నఖిలభువనోన్నతము నైన యాటలేంద్ర
నరసవిభుమందిరం బాత్మశరణ మనుచు
నుండి యే కాలమును బాయకుండుఁగాత. 2

3)

పలుకులకొమ్మనెమ్మొగముఁబార్వణచంద్రునిగాఁదలంచియు
జ్జ్వలనిజభద్రపీఠజలజంబు నిమీలితమౌనొ యంచు నే
ర్పలవడ భారతీవనిత నాత్మముఖంబులలోన కొల్పుచుం
జెలఁగువిధాత యోబయనృసింహున కిచ్చుఁ జిరాయురున్న
తుల్ 3

సీ. ఒకటి యక్షరవిలాసోల్లాసమున మించ
నొకటి తాళప్రౌఢి నుల్లసిల్ల
నొక్కటి నారికేళోన్నతిఁ దాల్ప నొ
క్కటి గోస్తనీగుచ్ఛకలనఁ దనర
నొకటి సువృత్తభావోన్మేష మొంద నొ
క్కటి వల్లకీతుంబికలనఁ జెలఁగ
నొకటి ధారవిశేషయుక్తిఁ బెంపొంద నొ
క్కటి గిరీశమతానుసారి గాఁగ

తే. నసముసాహిత్యసంగీతరసము లనెడు
గుబ్బపాలిండ్లు దాల్చు పలుకులవెలంది
సరసగుణహారు నోబయనరసధీరు
నవ్యకృతినాయకునిఁగా నొనర్చెఁగాత. 4

శా. గంగం దాల్చితివుత్తమాంగమున నక్కైకోలుగావించిత
ర్ధాంగీకారమునం, బురంధ్రి! నిన్ను వామాంగంబునం దాల్పనే
శృంగారోన్నతిఁ జూడు మంచు గిరిజ న్స్వర్గాపగాబింబిత
స్వాంగానందితఁ జేయుశంభుఁడు నృసింహాధీశ్వరుం బ్రోవుతన్

చ. అరుదుగ వామభాగలలనాకలనాచలనాత్ముఁ డైన యా
హరుగురుఁ గాంచి కౌనునుద దాకృతియాకృతి నేకదంతుఁ డై

కరికరిణీగుణంబులు మొగంబునందాల్చి జగంబు లేలు నా క
తరకరుణాసనాథు గణనాథు మరుద్గణనాథుఁ గొల్చెదన్. 6

సీ. తనయాస్యగహ్వరంబునకు ఖద్యోతజృం
భణము ఖద్యోతజృంభణము గాఁగఁ
దనకరాంభోజాతమున కల గంధమా
దన మొక గంధమాదనము గాఁగఁ
దనశౌర్యహార్యవక్షమునకు మైరావణ
స్ఫురణ మైరావణస్ఫురణ గాఁగఁ
దనవాలదంభోళి కెనయు కర్బురగోత్ర
గరిమ కర్బురగోత్రగరిమ గాఁగఁ

తే. వఱలు రామానుజన్మజీవప్రదాన
ధుర్యవర్యాయుధాత మేదురవిరోధి
బలపయోధివిలంఘనప్రబలశక్తి
యొఁబయనృసింహభూభర్త కొసఁగుఁగాత. 7

సీ. ఎవ్వాఁడు మొదలఁ దా నిలకు భారతి డించెఁ
దగ భగీరథుఁ డభ్రతటినిఁ బోలె
భ్రమరకీటన్యాయభాతి నేకవిరాజు
వాగ్దేవి దానయై వన్నె కెక్కె
వరవృత్తములు మానివాణి యెవ్వానికై
వలచి నానాశ్లేషములకుఁ జిక్కె
నెవ్వానివాఙ్మాత మనుని ధాత్రికిఁ దెచ్చి
పేర్మితోఁ గరము లర్పించుకొనియె

తే. నట్టి మహిమాధికులఁ గొల్చి యఖిలమునివ
చోఽనుపమశక్తిభృతపురాణార్థవితతు

సీ. లలితాకలంకకలాకలాపంబున
నేరాజు రేరాజు నేవగించు
భూభారధరణలీలాభిముఖ్యంబున
నేమేటి తామేటి నెగ్గులాడుఁ
జతురభాషామనీషావిశేషావాప్తి
నేభోగి యాభోగి నీసడించు
శరణాగతనిజాతిథరణాధికత్రాణాప్తి
నేశౌరి యాశౌరి చెవ్వు సూవు

తే. నతఁడు రిపురాడఖర్వ గర్వాంధకార
గంధనిర్గంధనాంభోజబంధుబంధు
బంధురౌదార్యశౌర్యధురంధరుండు
నరసగుణహారుఁ డోబయనరసఘనుఁడు. 11

వ: వెండియుం బ్రచండభుజాదండతాండవమండలాగ్ర ఖండితారాతిమండలుండును, నఖండనవఖండపృథ్వీమండల ధురాధరణధరాభూతభుజగపరిబృంఢులుండును, నజాండ కరండ పిచండిలయశఃకర్పూరకస్తూరికాహారుండును, నరస్వతీ మనోభండారచౌర్యధౌర్యగుండును, నమరసమయసముజ్జృంభిత జంభారిదోస్స్తంభనమూర్తంభితకుంభోళీధారా విదారితమహాభీల శైలాళిపక్షాలరవ కోలాహల లీలాహాళహాళికానమారంభ సుభగంభావుక గంభీరవిజయభేరీభయంకర భాంకార సంకరసముత్తేజిత దిగ్వేదండకాండును, సత్కులకలశసురత్నోద్భాకర మదోన్మత్తగత్నోన్నతరత్నో కాంత్నో విత్నోదచిచక్షణాక్షీణ నృహార్యక్షయాక్షవిక్షణీధనదానశుశ్రూక్షణక్షణనముత్తీక్షప్రకీలా కరాళ విచ్ఛిన్నాచ్ఛచ్ఛాయాచ్ఛటాపటిమఘటన చటుల

ప్రతాప వైభవుండును, నుభయరగండ గండభేరుండాది
బిరుదామంద సందీపిత ప్రాభవుండును, నసాధారణ మేధావ
ధీరిత వేధోమేధోవబోధనిర్నిరోధమధుర మధురసావధీరణ
సమగ్ర వాగ్గ్రథనధన సుధీజనగృహద్వార నిర్నిద్రభద్ర
వారణ ఘటావికటకటాహతట పతదనూనదానాంభోఝరీ
పరిమళ పరిలబ్ధలుబ్ధలబ్ధామోదమేదుర భృంగీ తరంగిత
భంగిప్రసంగత ప్రసంగాంగీకృత నిరంతర దిగంతర విశ్రాంత
విశ్రాణన జయానకుండును, కుశికసుతకులజలధి జైవాతృ
కుండును, నానావిధఖానాధిక సేనాంబునిధానానుపమానా
హవమా నామితామోఘవైఖరీ పరీతబరీదనపాద సప్తాంగ
హరుండును, భోజరాజవంశసంభవుండును, లక్కాంబాగర్భ
పావనుండును, బరమభాగవతసంభావనుండును, నోబభూపాల
పుత్త్రవరుండును, గడిదుర్గస్థాపనాచార్యుండును, సత్యభాషా
హరిశ్చంద్రుండును నగు నృసింహక్షితీంద్రుండొక్కనాఁడు
రుచిరరుచి శుచితావిశేషదూషితోషర్బుధులు బుధులు,
సరస్వతీ ప్రవాహసంతత విహరమాణమహాకవులుకవు,
లజిహ్మజిహ్వారంగ నృత్యదుత్తుంగ గైర్వాణ వాణీప్రాకృత
శౌరసేన్యపభ్రంశ పైశాచికామాగధులు మాగధులు, నట
నటితమహానటులు నటులు, వరయౌవన సౌందర్యవసతులు
సతులు, నయవినయ సౌజన్యులు రాజన్యు, లవధీరితసుర
రాజమంత్రులు మంత్రులు, ప్రబలబలోద్భటులుభటులు, పురో
హితులు, హితులు, పౌరాణికులు, వైణికులు, గాయకులు, గణ
కులు నాదిగాఁగల నిఖిలనియోగిజనంబులుబలసికొలువమణిమ

యాస్థాన మధ్యభద్రాసనంబున సుధర్మాసీనుం డగు శునా
సీరుచందంబున నందంబుగాఁ గొలువుండి యపుడు. 12

సీ. శతలేఖినీపద్యసంధానధౌరేయు
ఘటికాశతగ్రంథకరణధుర్యు
నాశుప్రబంధబంధాభిజ్ఞు నోష్ఠ్యని
రోష్ఠ్యజ్ఞు నచలజిహ్వోక్తినిపుణుఁ
దత్సమభాషావితాసజ్ఞు బహుపద్య
సాధిత వ్యస్తాక్షరీధురీణు
నేకసంధోదితశ్లోకభాషాకృత్య
చతురు నోష్ఠ్యనిరోష్ఠ్యసంకరజ్ఞు
తే. నమితయమకాశుధీప్రబంధాంకసింగ
రాజసుతతిమ్మరాజపుత్త్రి ప్రసిద్ధ
నరసవేంకటరాయభూమణసుపుత్రు
నను బుధవిధేయు శుభమూర్తినామధేయు. 13

క. కనుఁగొని దయామరందము
కనుదమ్ములఁ గ్రమ్మ నుచితగౌరవలీలా
ఘనతరగభీరభావల
ననియె న్నరసింహుఁ డభినవానందముతోన్. 14

సీ. బాణవేగంబును భవభూతిసుకుమార
తయు మాఘుశైత్యంబు దండిసమత
యల మయూరుసువర్ణకలన చోరునియర్థ
సంగ్రహమ్ము మురారిశయ్యనేర్పు
సోమప్రసాదంబు సోమయాజుల నియ
మంబు భాస్కరునిసన్మార్గఘటన

శ్రీనాథునిపదప్రసిద్ధధారాశుద్ధి
 యమరేశ్వరునిసహస్రముఖదృష్టి
తే. నీకుఁ గల దటుగాన ననేకవదన
వదనసంచారఖేదంబు వదలుపఱచి
భారతీదేవి నీజిహ్వఁ బాదుకొనియె
మూర్తికవిచంద్ర! విఖ్యాతకీర్తిసాంద్ర! 15
ఉ. కావున నీయుదగ్రమతి గౌరవయోగ్యనిరూపణంబుగా
నీవొనరింపఁబూనిన యనేకమహాకవివాఙ్మయోపకా
రావహమైన కావ్యము మదంకితమై వెలయంగఁ జేయు ము
ర్వీవలయప్రసిద్ధబుధవిస్మయదానధురంధరంబుగన్. 16
వ. అని సబహుమానంబుగా కర్పూరతాంబూల జాంబూనదాంబరాభరణచ్ఛత్రచామరాందోళికాచతురంతయానాగ్రహారాదిప్రదానంబుల బహూకరించుటయు నేను నానందకందళితతరంగితాంతరంగుడ నై. 17
సీ. నిజరూపమునకు వన్నియ దెచ్చు వేఱొక
 వెలుగొందు ధ్వని హీరకళిక లమర
ఛాయాంతరాలక్ష్యసహజతేజములైన
 లక్షణవైదూర్యలక్ష లలర
రతులతోఁ దులదూఁగు రమణీయరసవిశే
 షము లను గారుత్మతములు మెఱయ
గురుసువర్ణగుణైకగుంభితస్థితిఁ దాల్చు
 నాయకనాయకోన్నతులు వెలఁగ
తే. నిల నలంకారనికరంబు లిరవుకొలిపి
కమలభవగేహినీకరిమకరణాకరణ

యోగ్యములుగా నొనర్చిన భాగ్యనిధుల
భామహాదుల ననిశంబు ప్రస్తుతించి. 18

క. వారిప్రసాదమున నలం
కారము ధ్వని లక్షణాధికారరసాలం
కారము నొనర్తు నాంధ్రవ
చోరచనఁ జమత్క్రియాశోభితమతి నై. 19

తే. అసదృశరసప్రధానశబ్దార్థములును
రీతులును వృత్తులను నలంకృతులు గుణము
లాదియగు లక్షణంబుల నలరుఁ గావ్య
సరణి యండు రలంకారసారవిదులు. 20

క. ఈకావ్యలక్షణంబు ల
నేకులు తొల్లింటిపెద్ద లేర్పఱచిన సు
శ్లోకనృపచరితనుతి దీ
ప్తాకలనయు నభినవాంధ్రకవితయు నగుటన్. 21

వ. ఏతత్ప్రబంధబంధురావ్యాజకావ్యాలాప లక్షణకృతక్షణ
ప్రసంగ సంగ్రహణ నిర్వహణకృత్యంబున నిత్యంబు
నత్యంత కృతావసరుండ నై. 22

క. బంధురతరప్రబంధుల
బంధముల కనంతకీర్తిభాగ్యప్రదధా
రంధర్యగ్రంథిలము వ
సుంధర ననవద్యరమణసుగుణస్తవముల్. 23

సీ. రామాయణాదిక గ్రంథంబు లనవద్య
నేతృవర్ణనల వన్నియకు నెక్కె

వైశేషికాదినానాశాస్త్రములు శివ
ప్రతిపాదనమున సన్నుతి వహించె
సంఖ్యావిమంత్రముల్ శర్వదీశ్వరనామ
జపసాధనత ననశ్వరము లయ్యెఁ
బహుకు లాంతాంతికిఁ బ్రాబింబ్యములును బర
బ్రహ్మగోచరము లై ప్రణుతిఁ గాంచె
తే. ననినఁ గావ్యం బమేయనాయకవికస్వ
రస్వరూపనిరూపణభ్రాజి యగుట
నేఁడ వివరింప నేల? బంగారమునకుఁ
జాయ సౌరభ్యలహరి యబ్బుటయ కాదె.
శా. వేదంబుల్ ప్రభుశాసనంబులు; సుహృద్విజ్ఞాపనంబుల్ పురా
ణాదిగ్రంథము; లంగనాజనవిలాసాలాపలీలాసమ
ప్రాదుర్భావములౌర కావ్యములు కర్తవ్యోపదేశక్రియా
పాదప్రక్రియ లెన్నఁ గావ్యమహిమల్వర్ణింపఁగా శక్యమే?
మ. పరమజ్ఞానలతాలవాలము జగత్ప్రఖ్యాతివిఖ్యాతసా
గరచంద్రోదయ మిష్టసంఘటనరేఖా దివ్యధేనూత్తమం
బఖిలార్థప్రదకామితార్థముఖం బుద్వేలనిర్వాణ భ
వ్యరసాస్వాదరసాయనం బనినఁ గావ్యం బెన్న సామాన్యమే
క. కావున వేదవిధములు
నానావిధ కావ్యములును నవర
త్నాదేశాకరవల్లిక
కైవడి ననవద్యనాయకభ్రాజిత మై. 27
మ. ఇట్లూహించి మదీయసంఘటితకావ్యాలంక్రియాసంగ్ర
హాంబనఘంబై వెలుఁగొందకున్నరవివంశాధీశ్వరుం జొప్పింసిం

హాన్నృపాలాగ్రణికిఁ ద్రివర్ణనముచే నాశాంతవిశ్రాంతపా
వనమౌఁ గావున నందు నాయకమహావంశంబు వర్ణించెదన్

-: నాయకవంశవర్ణనము :-

సీ. శ్రీమించు పద్మినీభామామణీ కినుండు
నితరసంసారవార్ధికిఁ దరణి
త్రిజగతీసజ్జనశ్రేణికి మిత్రుండు
బహుళతమోవనికి విభావసుండు
సముదమందేహదేహములకుఁ దపనుండు
చతురాగమార్థసంతతికి సవిత
సకలచోరపరంపరకు సహస్రకరుండు
వినతలోకవితానమునకు ద్యుమణి
తే. హరిహరవిరించిముఖదేవతానుభావ
ఘనతరస్వర్ణతారకాలోకనీయ కాఁగఁ
గరఁగి కూర్చిన యుపరంజకడ్డి యనఁగ
సూర్యుఁ డిరవొందుఁ దేజోఽనివార్యుఁ డగుచు. 29

క. అతనికి వైవస్వతమను
వతనికి నిక్ష్వాకునృపతి యాతనికిఁ గుక్షి
క్షితిపతి; యతఁడు వికుక్షిం
బ్రతాపఖనిఁ గనియె నతఁడు బాణునిఁ గనియెన్. 30

సీ. అనరణ్యుఁ డతని కాయనఘుఁడు పృథుఁ గాంచెఁ
బృథుఁడు త్రిశంకుధాత్రీంద్రుఁ గనియె
నతనికి ధుంధుమారాభిఖ్యుఁ డతనికి
మాంధాత; యతఁడు సుసంధిఁ గాంచె

తే. దతనికి యయాతి నాభాగుఁ డతని కతని
కజుఁడు దశరథుఁ డతనికి నతని కొదవ
రామభద్రుఁడు తద్వంశరత్న మయ్యె
సారిది గలిగెఁ గరికాలచోళవిభుఁడు. 34

సీ. ఏరాజువివిధపుష్పారాధనమున గం
గాధరుతలమీఁది కొంచు మాన
నేరాజుదివ్యాన్నసారార్పణంబున
శితికంఠుమెడ సున్న చేఁదు మాన
నేరాజురత్నోపహారానుభవభూతి
రుద్రునెమ్ములదండరోఁత మాన
నేరాజుకాంచనాగారరచనకేళి
భవునకు గిరు లెక్కుపాటు మాన

తే. జలధిదేవేరిఁ గావేరి జనులు సూడ
కుండ నాచ్ఛాదన మొనర్చె నొఱపు మెఱయ
నుభయతటములఁ దరుకట్టు లునిచె నే నృ
పాలుఁ డతఁ డొప్పుఁ గరికాలచోళవిభుఁడు. 35

చ. అతఁడు మహాదిగంతవిజయం బొనరించిసురాద్రియాలను
న్నతనిజమీనలాంఛన మొనర్చుటకై గిరిరాజుఁ ద్రిప్ప న
ప్రతిమతదీయదోర్యుగభరభ్రమితాచలశృంగసంగతా,మిత
జవరయాఢి నేఁడును భ్రమించుఁ దదగ్రగతిన్ గ్రహావళుల్.

తే. శ్రీలఁ జెలువొందు నాకరికాలచోళ
కుంభినీనాథుకులమున సంభవించె
ఘనఖనిక్షోణి రత్నంబు గలుగురీతి
భోగసౌభాగ్యసురరాజు పోచిరాజు. 37

సీ. తనకీర్తికి జగద్వాహిని యాపగామికి
నమ్మహానదితోడ యమున సాక్షి
తనప్రతాపస్ఫూర్తి కిను వేఁడి సరిగామి
కతఁడబింబము మాఘనదులు సాక్షి
తనధైర్యమహిమకుఁ గనకాద్రి ప్రతిగామి
కచటఁ గాఁపున్న గోత్రాద్రి సాక్షి
తనకాంతికి మృగాంకుఁ డెనగామి కతనితో
సరిపొత్తు మను కర్మసాక్షి సాక్షి
తే. కాఁగ విలసిల్లువసుమత్తాత్రికర్మ
వరత స్వైరవర్త్మ కితఁ డొజ్జబంతి యనఁగ
రాజమృగరాజు వైభవరాజరాజు
భూరిసౌందర్యరతిరాజు పోతిరాజు. 38

క. ఆపోచిరాజవంశజు
ఘాషాకారమునకుఁ దారాపతి యై
నౌషాంకుఁ దగుమలక్ష్మో
చేపాలుఁ దనంగకీర్తిపుణ్యోజ్జ్వలుఁ డై. 39

సీ. రక్షించినాఁడు హిరణ్యగర్భాన్వయిఁ
జనాద్రిసంఘాత పాతకముల
శిక్షించినాఁడు దుర్గ్రహాత్యయదనిధారఁ
బ్రాపిపక్షగిరిలక్షపక్షగరిమ
వీక్షించినాఁడు సద్విధ నావహావిహావ
నదనంబుఁ గదనంబు నరియు గాఁగఁ
బ్రోక్షించినాఁడు సంపూర్ణ దయాధార
వితతాడదాతపావృతులమీఁద

తే. నతఁడు రాజన్యమాత్రుఁడె యపరశిఖరి
చరమగహ్వరబంహిష్ఠజరఠతిమిర
పటలపాటనపటుమహాభాస్వరుఁడు
రాజకులహేళి తిరుమలరాయమౌళి 40

క. ఆరాజశిఖామణికిన్
ధీరాత్ములు తనయులైరి తిప్పనిభుఁడు గం
భీరరణాంభోరాశి య
పారకృపామూర్తి వల్లభక్షితిపతియున్. 41

వ. అందగ్రజుండు. 42

సీ. తనజయధ్వజమారుతములు వైరికిరీట
ఖచితసన్మణిదీపకళికల మలుపఁ
దనశిలీముఖము లుద్ధతవిరోధిశిరోధ
జలజశోణితరసాసవము లానఁ
దనతేజము లరాతిధరణీశమదవతీ
కబరికానిబిడాంధకార మడఁపఁ
దనవాహినీప్రౌఢి దర్పితప్రతికూల
భూమిభృన్మదభేదమునఁ దలిర్ప

తే. రాజమాంధాత యనఁ బొల్చె రసికలోక
సతతసంరక్షణాస్తోకజాగరూక
నవనవానందహృల్లగ్నవందగోత్ర
బాలకుండైన తిప్పభూపాలకుండు.

తే. అతఁడు రామప్రభునిఁ గోనెటాంబయందు
నోబళేంద్రుని లక్కాంబయందుఁ గనియె

కృతులయుండును బలాన్వితులయుండును రాగ
భరితవీక్షణ మెన్నఁగాలుఁ జూచిచేఁ

తే. జగతి నే రాజు కువలయోత్సవ మొనర్చు
రాజుగావున నటు స్వీయరక్షచేతఁ
గౌరి యన్వర్థ మగుచంద్రగుప్తిపద్ర
మతఁడు విలసిల్లు వేంకటకృష్ణవిభుఁడు. 49

తే. అతఁడు తిమ్మాంబయందుఁ దిమ్మావనీశుఁ
జిన్నతిమ్మప్రభుఁ గాంచె సీతయందు
రవికులోద్ధారకుం డైన రాఘవుండు
గరిమఁ గుశలవవీరులఁ గన్నకరణి 50

క. ఈ సంతతిఁ దగు తిమ్మ
క్ష్మాసుత్రామునకుఁ గూర్మి సహజమ్ముం డనన్
భాసిల్లు నోబనృపతి శు
నాసీరమహీజవితరణగుణాస్పదుఁడై 51

చ. సరసనఖప్రసూనరుచిశాఖలఁ జెంది పచోపురందమా
ధురిఁ జెలువొందికీర్తియను తోరపుఁ బాసనఁ బొందిసొంపునం
బరఁగు దళంబులం బ్రబలి పండితకీరపరంపరాఫల
స్ఫురణ మొనంగు నోబనృపపుంగవుఁ డాశ్రితపారిజాతమై

ఉ. భూనుతశౌర్యుఁ డోబనృపపుంగవుఁ డుగ్రరణోర్విభీమబా
హానిశితాసిధార ననతాహితకోటియుదగ్రహస్తము
ల్పూని వారింపఁ దద్గళితభూతసమున్నతఖడ్గముల్ ప్రవ
స్థానము చేసిన ట్లమరు సారెకు వారికి నూర్ధ్వయాత్రకున్.

క. అతఁ డోబళాంబయం ద
ప్రతిము నోబళనృపాలు రాజమహీశున్

క్షితిఁ గాంచె విద్యయం ద
ద్భుతధీనిధి వినయబోధములఁ గాంచుగతిన్.

క. తదనుజుఁడు వరదభూపతి
సుదతీమకరాంకుఁ డామరు సురపురవనికా
విదితవరదానచాతురి
గదిసినయాత్మీయనామకము సార్థముగన్.

వ. తత్క్రమంబున.

సీ. అవనినభోఽంతరం బాస్యరంధ్రము గాఁగ
ఘనపంక్తి మోముపై కప్పు గాఁగ
హిమశైలవింధ్యశైలములు కొమ్ములు గాఁగఁ
బూర్ణచంద్రుండు మూఁపురము గాఁగ
శరధులు నాలుగు గొరిజపట్టులు గాఁగ
నైలింపనది గంగడోలు గాఁగ
వాసుకి యాభీలవాలదండము గాఁగ
దారకల్ కింకిణీతతులు గాఁగ

తే. గరిమఁ జెన్నొందు బసవశంకరమహాంక
మాజి నేరాజశేఖరుం డావహించె
నతఁడు నిలువెల్ల మగఁటిమి యనంగఁ బరఁగు
రామవిభుతిప్పశౌరి నిర్వారితారి.

సీ. బలధూతధూళిచేఁ బందిళ్ళు నమకట్టి
యహితరక్తము కలయంపి చల్లి
నవయశోరుచివితానవితానములు గట్టి
వివిధవాద్యధ్వను ల్వెలయఁజేసి

విమతాస్థికటలచూర్ణముల ముగ్గులు పెట్టి
ద్విజపరంపరలకు విం దొనర్చి
దళితారికుంభిముక్తాఫలంబుల సేస
చల్లి ప్రతాపాగ్ని సాక్షి గాఁగ
తే. మెఱయునే రాజు విజయలక్ష్మి వివాహ
విదితసన్నాహుఁడై యతఁ డెదురు గుండ
పిఱికితండయు లేని గభీరఘోర
రణజయోత్సాహి పాపనరామవిభుఁడు 58

చ. అతని సహోదరుండు చతురంబుధివేష్టితభూధురంధరుం
డతులిత శౌర్య భీకర భుజాగ్రుఁడు వేంకటరాజు వొల్చునా
క్షితిపతి దానమానముల ఖేచరశాఖిఁ దిరస్కరింపఁగా
వితతతదీయదుర్యశము విస్ఫుటమౌ నలిమండలాకృతిన్. 59
క. ఈవంశకర్తయగు తి
ప్పావని పాలునకుఁ గూర్మి యనుజన్ముఁడు తా
నై నెలయు వల్లభధా
త్రీవల్లభుఁ డఖిలరాజతేజోనిధియై 60
సీ. కమలాప్త కమలాప్త కమలాప్తసన్నిభుం
డే విభుండు రుచి ప్రభావ దయల
గోరాజ గోరాజ గోరాజసంకాశుఁ
డే రాజు మతి భోగ గౌరవముల
హరిపుత్రి హరిపుత్రి హరిపుత్రి సదృశుఁడే
ధన్యుండు జయ రూప దానవిధుల
నాగారి నాగారి నాగారికల్పుఁడే
మేటి ప్రాభవ వేగ పాటవముల

తే. సతతసువిచారుఁ డవికారుఁ డనఘుఁ డలఘుఁ
డప్రమేయుఁ డజయ్యుఁ డతిప్రతాపు
డప్రతీపుఁ డనేకలోకాభిసంస్తు
చరితుఁ డొప్పొందు వల్లభక్ష్మావరుండు. 61

ఉ. వల్లభరాజశౌర్యగుణవైభవ మెన్న విచిత్ర మమ్మహీ
వల్లభువైరిరాజి వనవాటుల నుండి నిజాంబుజాస్యత
న్వల్లభ! యంచుఁ బిల్వఁగ నవార్యతదుజ్జ్వలనామసంస్మృతిం
బెల్లువడంకుఁ గాంతకుఁ ద్రపేమలుగొంత నెపంబు సేయుచున్.

క. అతులప్రతాపుఁ డా భూ
పతి ప్రోద్ధతవైరియగుఁ బ్రబలునిఁ దిమ్మ
క్షితిపాలునిఁ గాంచెం బశు
పతి పార్వతియును గుమారుఁ బడసిన భంగిన్, 63

సీ. భోగి మట్టినవానిఁ భోగిఁ జుట్టినవాని
భోగిఁ బట్టినవానిఁ జోలనేర్చుఁ
దమ్మిఁ దాల్చినవానిఁ దమ్మి దొల్చినవానిఁ
దమ్మి మొల్చిన వానిఁ జారసించు
మృగము నుంచిన వాని మృగముఁ ద్రుంచినవాని
మృగముఁ బొంచిన వాని మీఱఁజాలుఁ
గొండ నెక్కినవానిఁ గొండఁ జెక్కిన వానిఁ
గొండఁ ద్రొక్కినవానిఁ గొదవసేయు

తే. భరణభూతిజనప్రభాభావశక్తి
మతికళాశౌర్యసత్త్వశుంభద్విభావ
భోగగాంభీర్య గుణములఁ బుడమి నెన్న
పాలకులు సాటి రా రతిమ్మక్ష్మాధిపునకు. 64

తే. అతఁడు గంగాంబయం దాంళావనీంద్రు
మూర్తిఘను సింగవిభుఁ గాంచెఁ గీర్తినిధుల
నత్రియనసూయయందు మున్నబ్జగర్భ
61 కమలనాభకపర్దులఁ గన్నయట్లు, 65

ఉ. వారలలో గభీరగుణవారిధి వారిధి వారిధిపంక్తిలో సుధా
వారిధిపోలె భూమిధరవర్గములోఁ గనకాద్రిపోలె దో
స్సారము వీరముం దెలుపసత్యము శౌచము సద్విచార మా
చారము గల్గి పాల్చెబుధసన్నుతుఁ డౌబళరాజు ధన్యుఁడై.

సీ. అప్పుపాలైన శుభ్రాబ్జంబు రుచి యెంత
మూటమోచినయంచ తేట యెంత
నీళ్ళు మోచినభవానీభర్త కలి మెంత
62 బిలము దూఱినశేషుబలిమి యెంత
తమ్ములతోఁ బోరు తారేశుకళ యెంత
తృణమైన శరపుంజదీప్తి యెంత
పండ్లిగిలించు కల్పకశాఖదళ మెంత
విరిసినమల్లెలవీఁక యెంత

తే. యనుచుఁదనకీర్తిధవళాబ్జహంసమదన
మథనవరభోగివిధుశరామర్త్యవిటపి
వికచవిచికిలమాలికావితతిఁ దెగడ
వసుధఁ బాలించు నోబభూవల్లభుండు. 67

సీ. ఇతనివైరులు వనవ్రతతిలోఁ గాఁపుండ
నన్వర్థమై ధాత్రి యవని యయ్యె
నితఁ డంతరీపంబు లేల ముద్రాసము
64 న్నిద్రుఁడై జలధి సముద్రుఁ డయ్యె

నితనియాలము చూచి యెల్ల వేల్పులు నిమే
షము మాని యనిమేషసంజ్ఞఁ గనిరి
యితని సేనాధూళి హిమసేతువులు గప్ప
గాఁకియుఁ దప్పె దంధకారి యయ్యె

తే. నితనికరుణాంబురాశిసంభ్రమతరంగ
సంగతం బైన మనసున సంచరించి
శౌరి నారాయణుం డయ్యె జగతి ననుచు
సుకవులు నుతింతు రాబళిక్షోణివిభుని 68

వ. తత్క్రమంబున. 69

సీ. చతురాననాధికశ్రుతిహితశీలుఁడై
విబుధాన్నదానప్రవీణుఁ డగుచు
వసుమతీభారధూర్వహుఁడై నృసింహతా
భాసియై బలిశిరోరత్నమగుచు
సర్జునకరగర్వహరణసత్కీర్తియై
యతనుశాత్రవధర్మహారి యగుచుఁ
గామపాలాఖ్యుఁడై గరిమసర్వజ్ఞుఁడై
వరవరోచిత మైన నడత యొఱఁగి

తే. శౌరి బహురూపవిహరణశ్రమముఁ జెంద
లేక యన్ని గుణంబులు నేకమూర్తి
యందు నిరవొందఁ జేసినయట్లు వొల్చు
మూర్తినిర్జితరతిరాజు మూర్తిరాజు. 70

చ. చిరతరకీర్తి మూర్తినృపశేఖరుఁ డాహవదుర్మదారిభూ
వరులఁ గరాగ్రలోకకరవాలముఖమ్మున గ్రుచ్చి యెత్తుఁడ

ద్వరవరణాభిలాషయుత హాసనలోక విలాసినీపరం
పరులకు వీరు వల్లభులు పట్టుఁబటంచు నొసంగుకై వడిన్.71

సీ. గురువసీపకుల కాదర మొప్పఁ గొం డని
యొసఁగియుఁగొండని యొసఁగకుండు
నమితలావణ్యలీలావాప్తి నే మారుఁ
గినిసియు వేమారు గినియకుండు
సత్కీర్తిచే సుధాకరదేవసరసుల
వాడియు నరసుల నాడకుండు
నరులపై నిశితసాయకపఙ్క్తి చేపట్టి
విడిచియుఁ జేపట్టి విడపకుండు

తే. ఫణిపతికినైన భారతీపతికినైనఁ
బశుపతికినైన నలబృహస్పతికినైన
నవని నవలీలఁ బొగడంగ నలవిగాని
చరితములఁ బొల్చు నాసింగజనవిభుండు. 72

చ. చకచకమించుసింగనృపచంద్రుని కాంతకృపాణవల్లిలోఁ
బ్రకటవిరోధియు ధరథభద్రగజాశ్వసమూహనికరం
బకములు గానవచ్చు సులభప్రతిబింబితమూర్తులై మహా
జికలితసాధ్వసోదయముచే నసిగన్నముఁ జొచ్చెనో యనన్

తే. ఇట్లు సుగుణాభిరాముఁడై యొప్పు యమమూర్తి
ఘనుఁడు సింగక్షితీంద్రుఁడుఁ దను భజింప
నెలమి భీమార్జునులు గొల్వ నింపు మీఱు
ధర్మసుతుమాడ్కిఁ దగు నొబ్బయణివిభుఁడు. 74

సీ. ఘనభుజాశౌర్యరాఘవుఁడు రాఘవదేవ
ధరణీశుఁ డేరాజు తాతతాత

నరసుతుఁడై నపిన్నమరాజు సౌజన్య
ధన్యుఁ డే రాజన్యు తాతతండ్రి
యమితవైభవుఁడై యార్వీటిబుక్క భూ
తలనాథుఁడే రాజు తండ్రి తండ్రి
యసమానదానవిద్యాధురంధరుఁడగు
రామరాజేంద్రుఁడే రాజుతండ్రి

తే. యట్టిసోమాన్వయాబ్ధిశీతాంశుఁ డనఁగ
నమరుశ్రీరంగవిభుపుత్త్రియై చెలంగు
లక్కమాంబను వరియించె లలితశీల
నమ్మహాసాధ్విసోదరు లధికయశులు. 75

క. కోనక్షితిపతి తిమ్మమ
హీనాథుఁడు రామనృపతి యెఱతిమ్మధరా
జానియును వేంకటేంద్రుఁడు
భూనాయకతిలకు లగుచుఁ బొల్తురు ఘనులై. 76

వ. అందగ్రజుండు. 77

సీ. లాటీకుచాభోగపాటీరపంకంబు
బోటీముఖాబ్జకర్పూరకలన
గౌళీనవీనాంకపాళీదుకూలంబు
చోళీకుచాళీప్రసూనరాజి
యంగీముఖాభంగసంగీతవాణి క
ళింగీవిలాసకేళీమరాళి
భోజీకరస్వచ్ఛరాజీవకాంతి కాం
భోజీమహాహీరముకురరేఖ

తే. కుంతలీకర్ణమౌక్తికకుండల ప్ర
కాశ మెవ్వానియభినవాకాశదేశ
చంద్రికాయితసత్కీర్తిజాల మతఁడు
ప్రబలు శ్రీరంగవిభుకోనపార్థివుండు. 78

వ. తదనుజుండు. 79

శా. శ్రీరంగప్రభుతిమ్మశౌరి భుజశౌర్యంబుచే నాజుల
న్వీరారాతులఁ ద్రుంప నాక్షితిపతుల్ వేగ మార్తాండునిం
దూఱుండూఱఁ దదీయమండలసముద్భూతవ్రణశ్రేణికి
న్నీరంధ్రావధమార్గభాతిఁ దగు నెంతేఁ దచ్ఛమూరేణువుల్.

వ. తత్క్రమంబున. 81

సీ. ఖలు సతిద్రోహి సల్కయతిమ్మని హరించి
సకలకర్ణాటదేశంబు నిలిపె
సతుని వర్ధితునిఁ దత్సుతునిఁ బట్టముఁ గట్టి
కుతుపసమల్కన క్షోణి నిలిపెఁ
బదిలుఁడై రాచూరుముదిగల్లుగవ్వంబు
సేయఁ గాంచి సపాదసీమ నిలిపె
శరణన్న మల్కనిజామునికభయం బొ
సంగి తదీయ రాజ్యంబు నిలిపె

తే. నవని యంతయు రామరాజ్యంబు సేసెఁ
దనగుణంబులు కవికల్పితములు గాఁగ
నలవిరో రచింప సత్కావ్యములను వెలయ
భూమి నొకరాజమాత్రుఁడే రామవిభుఁడు, 82

సీ. ఖరదూషణాఖర్వగర్వనిర్వాపణం
బాజినవ్వానిసాయకనికాయ

6)

మధిక తారావరాహంకారవారణో
ద్వేల మెవ్వనియశోవిమలశోభ
వివిధారికామినీవిఘటనాటోపమే
యువనీశురోషారుణాక్షిరేఖ
పౌలస్త్యనిరసనప్రౌఢిమాఢౌకితం
బే రాజుచారిత్రచారుభూతి
తే. యతఁడు కలియుగనవ్యరామావతార
చారుతాసార్థనామప్రచారుఁ డగుచు
వెలయు బ్రహ్మాండపేటికావితతకీర్తి
ధనుఁడు శ్రీరంగవిభురామధరణిధవుఁడు. 33

సీ. తనభుజాదండ కోదండ మఖండమై
యనువేలశరవృష్టి నాచరింపఁ
దనహేతిశతకోటి ఘనధాళధళ్యమై
ప్రతిపక్షబలభిదాపటిమ నెఱపఁ
దనవిగ్రహంబు సజ్జనమనోహారియై
మంజుఘోషాశ్లేషమహిమఁ జెలఁగఁ
దనవైభవంబు సంతాన సమగ్రమై
సురభిసంభృతగుణస్ఫురణఁ జెంద
తే. రాజదేవేంద్రుఁ డితఁ డనఁ దేజరిల్లు
ననఘచాళుక్యనారాయణాంకవివిధ
బిరుదమన్నె విభాళాదిబిరుదశాలి
ప్రాభవోపేంద్రుఁ డెఱతిమ్మపార్థివుండు 34
సీ. అసురారిరాణివే నధిహసించుట యెట్లు
బహువిధానూనవంశభవులయందు

సురలోకధేనుసోదరి నేను నిలుచుచో
ట్లకట గోఘాతపాతకులయందుఁ
త్రైలోక్యమాత నేఁ దగిలియుండుట యెట్లు
త్రైలోక్యకంటకోద్ధతులయందు
దేవతారాధ్య నేఁ దిరముగాఁ దగు టెట్లు
కడుదేవతాద్రోహకరులయందు
తే. అనుచు యవనులఁ దెగడి తన్నాశ్రయించు
వారి సామ్రాజ్యలక్ష్మి నివ్వాండు గొనియె
నాహవోగ్రబరీదసప్తాంగహరణుఁ
33 డతఁడు విలసిల్లు శ్రీవేంకటాద్రివిభుఁడు 85
మ. ప్రతికూలావనిభృద్విభేదనకళాపారీణుఁడై సంగర
క్షితిలో వేంకటరాజశేఖరుని కౌక్షేయంబు కృష్ణాధిక
ద్యుతిఁ జెన్నొందఁ దదీయధాగఁ బడి కాదోషాకరుల్యావన
క్షితిపుల్గాంచిరి నాకలోకవనికాశృంగారసాంగత్యముల్. 86
మ. బలధుర్యుండగు వేంకటేంద్రుని మహాబాహాబలాటోప వి
ప్లవులై మున్నతిధావనక్రియ నపాదాభిఖ్యులై నట్టియే
దులఖానుం డిదె నేఁడు గ్రమ్మఱ నపాదుండయ్యెనా నర్మిలిం
దలఁదత్పాదముఁ దాల్చె భీమనదిపొంతంగా ననిలోన్నతిన్.
మ. స్థిరసంగ్రామజయాభిరాముఁడగు నా శ్రీవేంకటక్ష్మావరుం
డరయ న్రాజశిఖావతంసుఁ డగుఁ దథ్యం బుర్విఁ గాకున్న నీ
34 ధరణీపాలకు లెల్ల మెచ్చఁగ నపాదక్షోణిభృత్ప్రాప్తిభా
సురదుర్గాధిపతిత్వవైభవభనస్ఫూర్తి న్విజృంభించునే. 88
క. ఈ రాజమణులసోదరి
యై రాజిలు లక్కమాంబ యమృతాశనధా

స్త్రీరత్నముల కై దిండికి
నారయఁ దోఁబుట్టు వగు రమాంగనకుఁగిదిన్.

సీ. ప్రతివచ్చునన్న పూర్ణాదేవి భైక్షాన్న
మిడక సంయమి నలయింపకున్నఁ
బాటి సేయఁగవచ్చు భాగీరథి నభంబు
ముట్టి పెల్లుబ్బుఁగ్రమై మొరయకున్న
నరి వచ్చు భూకాంత సకల ప్రజాభార
పూర్ణానహత్వంబుఁ బూనకున్న
రూపింపవచ్చు నరుంధతి నేర్పొద్దుఁ
దనయల్పభావంబు దాల్పకున్న

తే. నిమ్మహాసాధ్వి కవిజను లెల్లఁ బొగడ
నలరు నాబక్కిరీశు సర్ధాంగలక్ష్మి
బాంధవావనధుర్య వైభవకదంబ
లలితసద్గుణనికురుంబ లక్కమాంబ.

క. పౌలోమికి నింద్రునకు మ
హాలలితాకృతి జయంతుఁ డాత్మజుఁ డైన
ట్లా లక్కమాంబ కోబన్న
పాలునకు నృసింహధరణిపతి జనియించెన్.

సీ. కాశ్యపి కా నాఁటఁ గశ్యపోద్భవుఁ డైన
కాకోదరస్వామిఁ గలయుపెట్టు
ధాత్రి యా తపనయోధారచేఁ బెరిఁగినఁ
గమలకులాధీశుఁ గవయుపెట్టు
తగ ధేను వగువేళఁ దర్శకం బగుధరా
ధరశిరోమణిఁ గూడఁ దలఁచుపెట్టు

తనకు యావిర్భవించెన వంచనామహా
89 క్రోడంబుతోఁ గూడి యాడు పెట్టు
తే. తగవుగా దంచు ఫణికూర్మ ధరణిధరవ
రాదిభూదారముల నూని యవని కాంత
తనభుజాదండమున నుండఁ దనరుచుండు
సరసగుణహారి యోబయసరసశౌరి. 92

క. అతఁ డిలఁ రామయతిమ్మ
క్షితిపతిసత్పుత్త్రిఁ దగుచుఁ జెలు వొందు గుణా
న్వితుఁ డగు తిరుమలధాత్రీ
పతితనయుం దిరుమలాంబఁ బరిణయ మయ్యెన్. 93

సీ. పొలుపగు నేసాధ్వి భుజవల్లి రుక్మిణి
సత్య యేగరితవాచావిశుద్ధి
జనకనందిని యేవిశాలాక్షి మతిరేఖ
90 భద్ర యేమగువ శోభనవినీతి
యనసూయ యేకుటుంబిని దృష్టి సర్వమం
గళ యేశుభాంగ నలలితరీతి
ధృతి సుదక్షిణ యేపతివ్రత కరుణనం
91 పత్కాంత యేయింతి భవ్యమూర్తి
తే. యట్టిగుణధన్య యై తనయాత్మ యెల్ల
నఖిలపతిదేవతాసంగ్రహం బనంగ
నలరు నలవీరవల్లి తిమ్మానసీంద్ర
శరధిమందారవల్లి యై తిరుమలాంబ. 94

తే. ఆమగువయందు నరసింహభూమివిభుఁడు
రసిక సారంగరాజు శ్రీరంగరాజు

గనియె నసఘుని దేవకీకాంతయందు
ఘనుఁడు వసుదేవుఁ డచ్యుతుఁ గన్నపగిది.

క. అతఁ డుభయవంశపావనుఁ
డితఁ డన బాలార్క విజయ హేవాకవిభా
వితతియు నమందమంద
స్మితచంద్రాతపముఁ దాల్చి శ్రీ రంజితుఁడై.

సీ. ఘనతఁ జేసాఁప నేర్చిన నాఁటనుండియు
శత్రులమీఁదఁ జేఁ జాఁప నేర్చె
నడయంబు నడుగువెట్టిన నాఁటనుండియు
నరిశిరంబులమీఁద నడుగు వెట్టె
నవనీతము గ్రసించునాఁటనుండియు వైరి
కులముకో నవనీతములు గ్రసించె
నవపాంసుగతిఁ జెందునాఁటనుండియు ఖలా
భీలధాటీపాంసుకేళిఁ జెందె

తే. నిలువ నేర్చిననాటనుండియు విరోధి
నృపతిసేనాపతుల గెల్చి నిలువ నేర్చె
నరసవిభుని సిరంగభూనాధవిభుఁడు
ప్రబలెఁ బ్రబలుచునున్నాఁడు ప్రబలఁగలఁడు.

వ. ఈకుమారనారాయణుం గాంచినరాజన్యపుంగవునకు.

క. ఏతాదృశగుణమణికి ధ
రాతలపరిపూర్ణ కీర్తి రమణికి జలధి
వ్రాతవృతధరణీధరణాస
మాతతనిజభుజభుజంగమగ్రామణికిన్.

క. ధన్యునకుఁ దరణికులమూ
ర్ధన్యునకు నిజప్రధానిరత్నవదాన్యుం
మన్యునకరాతినృపప
ర్జన్యనిబంధనవిశేషశతమన్యునకున్. 100

క. అజరగజరజతరజనికృ
దజతనుజద్యుతిజపురజిదజభుజగజరు
గ్ర్వజవిజయినిజయశోమయ
సుజనసుతధ్వజునకధికశోభానిధికిన్. 101

క. గండరగండని కభినవ
మండలికాఖండమన్మార్తాండునకున్
జండప్రతాపపిహితా
జాండునకున్ లోభిమన్నియరగండనికిన్. 102

క. లక్కాంబానందనునకు
దిక్కాంతాచికురనికరదీపితకుసుమ
ప్రక్కాంతదంతురయశో
ధక్కానిధి కహితకరిఘటాభీమునకున్. 103

క. గాధేయగోత్రసవనధు
రాధేయున కఖిలసుకవిరాజశ్లాఘా
రాధేయదానవిద్యా
రాధేయునకును ధరామరధేయునకున్. 104

క. గర్వితబరీదసేనా
సర్వస్వహరానివార్యశౌర్యునకు నఖి
ర్ధూర్వహనపాదభయదా
ఖర్వమహావిజయభేరికాభాంకృతికిన్. 105

క. పీనమలాకుస్థాపన
మానితకరుణా ప్రసంగ మాంగళ్యునకున్
ధీనిధికి నృహరిచరణ
ధ్యానవిధానావధాన ధౌరేయునకున్.

క. ఓరుగంటి దుర్గరాజ్య
స్థిరసింహాసన నివాసదీక్షానిధికిన్
వరయంత్రమత్స్యభేదన
బిరుదోద్దండునకు గండభేరుండునకున్.

క. ప్రతిదినకనకవసంతా
శ్రితకృతికాంతునకుఁ దురగరేవంతునకున్
గ్రతుపురనారాయణగృహ
వితతప్రాకారఘటనవిఖ్యాతునకున్.

క. అరుణారుణకరుణారస
పరిణామసమగ్రనయనపద్మాభునకున్
శరణాగతభరణాకర
నరసింహునకుఁ గోటశౌరిసింహునకున్.

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన యి
మ్మహాలంకారప్రబంధంబునకు నాదికారణం బగు నాయక
గుణవ్రాతం బభివర్ణించెద.

## నాయకగుణములు

క. కులము మహాభాగ్యము ను
జ్జ్వలత యుదారత మహావిశాలత ధర్మా
కలనయు వైదగ్ధియు ననఁ
జెల నాయకగుణము లిఁవియ; నవి యేర్పడుతున్.

క. ఏనికి లక్ష్యము లెల్లను
శ్రీ నరసింహేంద్రుఁ పేరఁ జెప్పెద నెలమి
న్నానావిధ భక్తి సూచిత
నానావిధపద్యగుంభనసమగ్రము గాన్. 112

కులీనత :—

సీ. ఏవంశమునఁ బుట్టెఁ బావనశ్రుతిధర్మ
మర్మకర్మఠుఁడైన మనునృపాలుఁ
డేవంశమునఁ బుట్టె నింద్రాదు లరు దంద
సత్యమొందిన హారిశ్చంద్రనృపతి
యేవంశమునఁ బుట్టె నిలఁ జతుర్దశలోక
రక్షణాక్షముఁడైన రావణారి
యేవంశమునఁ బుట్టె నిహపరాద్భుతపుణ్య
చరితధుర్యుఁడు చోళచక్రవర్తి
తే. యట్టి యిందు గ్రహాదిసేనాధికత్వ
సత్యయశుఁడైన భానువంశమునఁ బుట్టి
పరఁగు భూపాలసింహుఁ డోబయనృసింహుఁ
దలఁపఁ గలికాలదోషంబు దొలఁగు టరుదె. 113

మహాభాగ్యము :—

మ. ప్రకటాఖిలవిరోధిసైన్యములఁ ద్రుంపంజాలు నాకొక్కొనే
వరుఁడే వారణవాజిశాలలు సమద్వైరిక్షితీంద్రార్పితా
ధిక వేదండహయాన్వితంబులు భుజాదీప్తాంగదం బుర్వి భా
[1] గ్యకళావైభవ మెన్న శక్యమె నృసింహక్ష్మాతలస్వామికిన్

7)

ఔజ్జ్వల్యము :—

మ. స్థిరసోమాన్వయదుగ్ధవారిధిజనియించెన్వేంకటాద్రీంద్రదక్ష
వరచంద్రుండు తదీయసోదరి రమావామాక్షి లక్కాంబికా
పరఁగం దద్వనితాశిరోమణికి నోబక్షోణిపాలేంద్రుడు శ్రీ
నరసింహాధిపుఁడై జనించె మరుఁడౌ తన్యంబుదీపింపఁగన్

ఔదార్యము :—

సీ. అల బలీంద్రునిచేత నడుగు వెట్టఁగ నేర్చి
ధారాధరముచేత నీరువోసి
కానీనుచేఁగంచుకముఁ బూనఁగా నేర్చి
యెలమి దధీచిచే నెముక బలిసి
క్షీరాంబురాశిఁ దచ్చిన వెన్న నీడేరి
నైలింపగవి చన్నుపాలఁ బెరిఁగి
కల్పపాదపఫలోత్కరములఁ జవి గాంచి
వనజారినెమ్మోము ననఁగి పెనఁగి
తే. ధరణిఁ బ్రోదివహించిన దానకన్య
సకలయాచకబాంధవు లన్ను తింప
నీకరగ్రహణావాప్తి నెఱసె నౌర
సరసగుణహార యోబయనరసధీర.

తేజస్విత :—

సీ. బహుళతరాశాభ్రాంతి బయలు ప్రాఁకక యున్నఁ
గువలయద్వేషంబుఁ గోరకున్న
మీఁటి తమ్ములవిరిపోటు సేయక యున్న
[illegible] కున్న

జగతి నందఱకును బగ లొనర్పక యున్న
దోషాభిభూతుఁడై తొలఁగ కున్న
ద్విజరాజపరిభవోద్వృత్తి సేకొనకున్న
సరసుల నింకింపఁ జాల కున్న
తే. సాటి యగు విశ్వవినుతశశ్వత్ప్రతాప
వైభవధ్వస్తదుర్వారవైర[illegible]ఁ
డైన యోబయనరసింహు నమితభువన
భువనభృతతేజమున కబ్జబాంధవుండు. 117

ధార్మికత్వము :—

చ. పలుకుట సత్యవాసన కపారవిరోధిజయోత్సవంబు దా
నలఘుయశోధనంబుకొఱ కంబుధివేష్టితభూపరిగ్రహం
బలరు నగణ్యపుణ్యచరితాచరణంబున కాత్మజీవనం
బలసుజనావలంబుకొఱకౌర నృసింహనృపాలమౌళికిన్ 118

వైదగ్ధ్యము :—

సీ. వనజారి కళలచేఁ దనివి నొందించిన
నిల ఖేచరుఁడు ప్రాణ మిత్తు ననిన
వనదంబు తనదుజీవన మెల్ల నొసఁగిన
నమ్మేను శిబి కోసికొమ్మటన్న
నీగిప్రమాణేసొమ్ము లిచ్చిన సురమణి
మిన్నంది తలఁపులో మెలఁగుచున్నఁ
శౌరి పాదము బలి శిరసావహించినఁ
బాధోధి దా నెంత భంగపడిన
తే. వారి నవ్వారిఁగా దని వసుధ నౌర
నిక్కముగఁ గీర్తికామిని నిక్కఁ దక్కె

గరలి విరించి గేహిని లిఖించిన భారము వొందదా! మా
నరసనృపాలమౌళిసుజన స్తుతసద్గుణసంప్రదాయముల్. 124

భూభరణము :—

చ. విపులఫణాసహస్రమున నిల్పి ధరింపఁగ లేని మేదిని
న్నిపుణత బాహుపీఠమున నిల్పి నృసింహుఁ డటంచు నుబన్న గా
ధిపతి నిరంగాద్భుతమతిం దలఁచు జరావి పొందుదు
డేవుడుఁ బురాణభోగి యని చెప్పెదు రా భుజగేంద్రు
నందయిన్. 125

కావ్యగీతప్రసంగము:—

మ. నరసింహుం డతిధీరవీరరసనన్నాహంబు చాటించియుం
గరుణాకోమలుఁడై రమావిమల శృంగారార్ద్రుఁడై బాల్యచా
తురి సాహిత్యజమర్మ కర్మకలనోద్యోగాదృతుం డయ్యె నీ
నరసింహేంద్రుఁ డనూనగానరససంధానప్రియుం డెంతయున్

మ. అమరక్ష్మాధరధీర! ధీరజిత శార్యారంభ! రంభాసమ
ప్రమదభవ్యమనోనురాగఘటనాపాంచాల! పాంచాలగా
ళముఖోర్వీనుతశౌర్య! శౌర్యనవలీలాలోల! లోలాభవ
ద్రమణీయాగమధర్మ! ధర్మతనయప్రఖ్యాతసత్యవ్రతా 127

క. కుటిలారిభయదధాటీ
పటుపటహాథమన్నినాదపరిపాటితది
క్తటపటల! చటులమేధా
పటిమపరాభూతభూతపతిసాణిహారా! 128

మాలిని. అలఘునయవిహారా! హారనీహారతారా!
హాలధరరుచిధారా హారకీర్తిప్రచారా!

జలధివరగభీరా! జైత్రకౌక్షేయధారా!
లలితగుణవిచారా! లక్కమాంబా కుమారా! 129

గద్యము. ఇది శ్రీహనుమత్ప్రసాదలబ్ధకవితాసారసారస్వతాలంకారసంకుశ ప్రతిభాబంధుర ప్రబంధపదసరచనాధురంధర ప్రబంధాంక వేంకటరాయభూమణసుపుత్త్రి తిమ్మరాజపౌత్త్రి సకలభాషావిశేషనియమావధానశారదామూర్తిమూర్తి ప్రణీతంబైన కావ్యాలంకారసంగ్రహంబను మహాప్రబంధంబునందు నుపోద్ఘాతప్రకరణంబును నాయకగుణవర్ణనంబును నాయకస్వరూపకథనంబునన్నది ప్రథమాశ్వాసము.

శ్రీ ర స్తు

# కావ్యాలంకార సంగ్రహము

## నరసభూపాలీయము

### ద్వితీయాశ్వాసము

క. శ్రీరాజితసదన! కలా
ధార! నిరంతరతరార్థిదారిద్ర్యహరా!
నారాయణచరణార్చన!
నారీజనమారతీశ! నరసాధీశా! 1

తే. అవధరింపు లక్ష్మలక్ష్యములనెల్ల
ననఘ! భవదీయనామధేయాంకితముగ
బహువిభక్తుల నొసరింతుఁ బద్యవితతి
నిచట; నాయకభేదంబు లెట్టులనిన. 2

క. ధీరోదాత్తప్రముఖులు
ధీరోద్ధతధీరశాంతధీరలలితు లీ
ధారుణి నలువురు నాయకు;
లారయఁ దల్లక్షణంబు లభివర్ణింతున్. 3

వ్యాఖ్య: ధీరోదాత్తుడు, ధీరోద్ధతుడు, ధీరశాంతుడు, ధీరలలితుడు అని నాయకులు నాలుగు విధములు. వారి లక్షణములు ముందు తెలుపబడును.

శా. ధీరాత్ముండవికత్థనుండు కరుణోద్వేలుండు నత్యాఘ్యుఁడా
ధీరోదాత్తుఁడు; శౌర్యదర్పబహుమాసాధీనుండు ధీరోద్ధతుం;

దారూఢి న్నమాధీశ్వరనన్నుఁ జె స్వభావుం డాతఁ డాధీరశాంతుండు; వృ
త్రారిం బోలినభోగి ధీరలలితుం డప్పోల్కి బ్బల్కింతతన్. 4

వ్యాఖ్య: క్లేశములకు సహించువాడు, ఆత్మశ్లాఘ చేయనివాడు, కరుణాకరం
వాడు, సుఖదుఃఖాదులకు లొంగని స్థిరస్వభావము గలవాడు ధీరోదాత్తుడు.
శౌర్యము, దర్పము, మాయలవంటి స్వభావము గలవాడు ధీరోద్ధతుడు. ధీర
త్వమును, శాంతత్వమును సమానముగా గల బ్రాహ్మణుడు ధీరశాంతుడు.
ఇంద్రునితో సమానమగు భోగములను అనుభవించువాడు ధీరలలితుడు.

ధీరోదాత్తుఁడు :

సీ. చలిచీమ నేనియుఁ జంపఁ ద్రొక్కఁగఁ జాలఁ
డేరీతిఁ గల్పనో నారిపరులఁ
గలనైన నిజవర్ణనలు సేయ వినఁ జాలఁ
డట్లందుకొనియెనో కృతిచయంబు
చెలువొందు నాకారచేష్ట లెయ్యెడఁ గానఁ
డెట్లు నవ్వునొ యాత్మహితులతోడఁ
బరుషాక్షరంబులు పలుకఁ డెక్కాలంబు
భర్జించెనో హీనజంతులనెట్లు
తే. బరులఁ జేపట్టఁ డెలమిఁ జేపట్టి విడువఁ
డలయఁ డేమఱఁ డరినైన నవగుణంబు
లెన్నఁ డోబయ నరసధాత్రీశతిలక
మరయ నరలోకభాగధేయంబు గాదె. 5

వ్యాఖ్య: నరసభూపాలుడు చలిచీమనుకూడ త్రొక్కజాలడు అనుట
వలన కరుణాకరుడనియు, నిజవర్ణనలు వినజాలడు అనుటవలన ఆత్మశ్లాఘ
లేనివాడనియు, ఆతనియందు ఆకారచేష్టలు గోచరింపవు అనుటవలన

గాంభీర్య గుణము కలవాడనియు, పరుషాక్షరములు పలుకడు అనుట వలన సత్వగుణసంపన్నత గోచరించుచున్నది. కావున నరస భూపాలుడు ధీరోదాత్తుడు.

ధీరోద్ధతుండు :

మ. బలవద్వైరిభిదామదాభిరతమై భవ్యప్రతాపోజ్జ్వల
జ్వలనజ్వాలజటాలమై రణభయవ్యాపక్తశత్రున్మనో
జలజాంధంకరణప్రగల్భరుమానానపాదిద్యోపాల్యుండా
నిల ధీరోద్ధతవృత్తియై నరసధాత్రీశోగ్రఖడ్గంబలిన్, 6

వ్యాఖ్య: ఇందు నరసభూపాలుని ఖడ్గము ధీరోద్ధత లక్షణము కలదానిగా అభివర్ణించెను. శత్రుబలమును భేదించు మదము కలిగినది అనుటచే దర్పము, ప్రతాపాగ్ని జ్వాలరూపమైనది అనుటవలన శౌర్యము యుద్ధముచే భయపడిన శత్రువుల మనస్సులందు చీకట్లు క్రమ్మునట్లుగా చేయుటవలన మాయలమారి లక్షణము గోచరించుట వలన ఖడ్గమునకు ధీరోద్ధత లక్షణము కలది

ధీరశాంతుండు :—

చ. ఇనకులభూష్యుఁడైన నరసేంద్రునిచేతఁ బ్రతిష్ఠితంబు లా
ననఘమహాగ్రహారములయందలిభూసురకోటి మేటియై
ఘనతరశాఖలం జెలఁగి శాంతశుకక్రమమై మెలంగున
య్యనిమిషభూజవాటిక్రియ నంత్రశుచిప్రసవాఖిరామమై. 7

వ్యాఖ్య: నరసభూపాలునిచే ప్రతిష్ఠింపబడిన అగ్రహారమునందలి బ్రాహ్మణులు కల్పవృక్షమువలే గొప్ప శాఖలు గలిగి, శుక సంచారము కలిగి, శుచి ప్రసవముతో ఒప్పుచున్నది అని వర్ణించుటవలన బ్రాహ్మణులు ధీరశాంతులు. ఇందు శాంతత్వము గోచరించుచున్నది. గాని, ధీరత్వము గోచరించుటలేదు. చారుదత్తాదులు ధీరత్వశాంతిత్వమునకు ఉదాహరణకాగలరు.

8)

ధీరలలితుఁడు :

ఉ. కుంతల గౌళ చోళ కురు ఘూర్జర హూణ శకాదిమేదినీ
కాంతులు సంతతంబు నిజగాథబలశ్రుతిమాత్ర భీతులై
యింతుల రత్నహారముల నెల్ల ధనంబుల నిచ్చి కొల్వ ని
శ్చింతతఁ దాల్చె నోబయనృసింహుఁడు భోగకళా ప్రవీణుఁడై

వ్యాఖ్య: కుంతలాది నానాదేశరాజులు నరసభూపాలుని ప్రతాపాదులను విని భీతులై, స్త్రీలను, రత్నహారములను, ధనమును ఇచ్చికొలుచుచుండగా నరసభూపాలుడు నిశ్చింతతో భోగకళా ప్రవీణుడై ఉండెను అని వర్ణించుట వలన నరసరాజును ధీరలలితునిగా వర్ణించెను. ఇందు నరసభూపాలుని ధీరత్వము గోచరించుచున్నది. కాని లలితత్వము గోచరించుట లేదు. వాస్తవదత్తలోని వత్సరాజు ధీరత్వ, లలితత్వములకు ఉదాహరణ.

తే. మఱియు శృంగారలీలాసమగ్రయోగ్య
కానికవిచక్షణులు దక్షిణానుకూల
ధృష్టశఠు లనఁ గాంతు లభీష్టమతులు
గలరు; తల్లక్షణంబులు తెలివిపఱుతు. 9

వ్యాఖ్య : దక్షిణుడు అనుకూలుడు, ధృష్టుడు, శఠుడు, అను శృంగార నాయకులు నాలుగు విధములుగా ఉందురు.

చ. చెలఁగుబహుప్రియాసదృశశీలుఁడు దక్షిణుఁ డొక్క కాంత
కే. వలచి గుణాభిరాముఁ డగువాఁ డనుకూలుఁడు సాప
రాధుఁడై. యలుకనివాఁడు ధృష్టుఁడు; ప్రియాశయ
మాత్రనివేద్యవిప్రియుం, డలశఠుఁ డండ్రు, వీరల కుదాహా
రణంబులు నిర్ణయించెదన్. 10

వ్యాఖ్య : బహు నాయికలయందు సమానమైన ప్రేమగలవాడు దక్షిణుడు. ఒక్కకాంతయందే ప్రీతిగలవాడు అనుకూలుడు. అపరాధము నర్చియు భయపడనివాడు ధృష్టుడు, ప్రియురాలికి మాత్రమే తెలియదగిన అప్రియము చేయువాడు శఠుడు. వీరికి ఉదాహరణము ముందు పద్యములో తెలియబరచబడును.

దక్షిణుఁడు :—

ఉ. సాగరమేఖలానతికిఁ జారుభుజాపరిరంభ మిచ్చెఁ: వా
ణీగగనావలగ్నకును నేర్పు మెఱుఁగొ న్మోగ మిచ్చె; వీరల
క్ష్మీగజరాజగామిని కమేయభుజాంతర మిచ్చె సంతత
త్యాగినృసింహభూవిభుఁడుదక్షిణనాయకుఁడెన్ని భంగులన్ 11

వ్యాఖ్య : నరసరాజు భుజములపై భూభారమును, వాక్కుల యందు విద్యను, వక్షస్థలమునందు శౌర్యమును వహించెను. అని వర్ణించుటవలన భూదేవి, సరస్వతి, వీరలక్ష్మిని సమానముగా గౌరవించుట వలన దక్షిణ నాయకుడు అయ్యెను.

అనుకూలుడు :—

చ. కనకము లంబరంబులును గ్రామములుజ్జ్వలదివ్యరత్నయుం
దనములు వాజివారణఘటల్ ఘన సారసుగంధసారము
ల్దనివి దలిర్ప వేఁడినకొలంది నొసంగుచునోబభూవనం
దనుఁడగు నారసింహుఁ డిల దానరమాప్రియుఁడయ్యె
నెంతయున్. 12

వ్యాఖ్య : నరసరాజు యాచకులకు అడిగనవన్ని దానముచేయుటచే దానలక్ష్మికి అనుకూలుడని తెలియుచున్నది. ఒకే నాయకుడు అవస్థా భేదమును బట్టి మార్పుచెందుచున్నట్లుగా వర్ణింపవచ్చును.

వ్యాఖ్య : పై నాయకులకు విట, పీఠమర్ద, చేట, విదూషకులను సహాయకులు (ప్రియుండ్రలితో పొత్తు కూర్చు సహాయకులు కలరు.

చ. వసుమతి నేకవిద్యగలవాఁడు విటుం డనఁబొల్చు నాయకో
ల్లసనముకన్నఁ గొంతగుణలక్షణహీనుఁడు పీఠమర్దకుం
డసదృశబాలికాసుఘటనాది రహస్యవిదుండు చేటకుం
డనఁగ సజ్జనహాస్యరసహేతువువాఁడు విదూషకుం డిలన్.

వ్యాఖ్య : ఏకవిద్యగలవాడు విటుడు. ఏక విద్య అనగా వేశ్యా నాగరకులకు సందేశము చెప్పువాడు అని "యశోధర" నిర్వచనము ప్రధాన నాయకుని కన్న కొంచెము గుణలక్షణహీనుడు, పీఠమర్దకుడు. నాయికతో సంఘటనాది రహస్యములు తెలిసినవాడు చేటకుడు. హాస్య రసమునకు హేతువగువాడు విదూషకుడు.

నాయికలు :—

క. ఈమతమున స్వీయాన్యా
సామాన్య లనంగఁ గలరు సతు; లందుఁ ద్రపా
సాధ్వీశీలార్జవ
కోమలకమనీయ స్వీయగుణములఁ జెలఁగున్. 17

వ్యాఖ్య : ఈశృంగార మతమున స్వీయ, అన్య, సామాన్య అను సతులు గలరు. లజ్జ, ఋజుశీలము, పాతివ్రత్యము, కోమలత్వము, కమనీయత్వము లక్షణములుగా గల నాయిక స్వీయ.

క. అన్య యనఁగ నన్యోఢయుఁ
గన్యయు; సామాన్య యనఁగ గణికామణి; యీ
మాన్యల కుదాహరణముల
నన్యాదృశవిశదఫణితి నాపాదింతున్. 18

వ్యాఖ్య : అన్యోఢ, కన్య, అని అన్యస్త్రీ రెండు విధముల కలదు. అన్యోఢ అనగా పరుని వివాహమాడిన స్త్రీ. సామాన్య అన వేశ్య.

స్వీయ :—

చ. అమృతమువంటి సద్గుణము సంచిత చంద్రకళావిలాస
వముశివగోత్రభూతియు నవారణఁదాల్చ యశఃపురంధ్రి తా
గమలవనీహితాన్వయశిఖామణియైన నృసింహమేదినీ
రమణున కేకపత్ని యన రంజిలులోకము లెల్లమెచ్చఁగన్.

వ్యాఖ్య : అమృతమువంటి సద్గుణములు కలిగి, చంద్రకళ వం కాంతిగలిగి, కైలాసమువంటి తెల్లదనము కలిగిన కీర్తికాంత సూర్యవం శ్రేష్ఠుడగు నరసభూపాలునికి ఏకపత్నియై రాజిల్లుచున్నది అని వర్ణించ వలన కీర్తికాంత స్వీయ నాయిక.

అన్యోఢ :—

సీ. పారసీకక్షమాపతులచో శ్వడఁగించి
వేర్పు మీఱఁగ మోహనిద్రవుచ్చి
యావనసేనాధినాయకులదోః స్తంభనం
భ శిత్రవ కాకవీపంబు లడఁచి
యభిభూతబానసమల్కా విపక్ష్మ కాయశో
ంతసంతతి కాత్మ సంతసిల్లి
హరతురుష్క ప్రాప్తసీమల
గు మోవఁగనీయక యరుగుదెంచి

తే. ప్రాజ్యసామ్రాజ్య యగు వారి రాజ్యలక్ష్మి
కదనసంకేతమున జారకాంత యగుచు
నంచితస్ఫూర్తి నిన్ను వరించె నౌర!
వైరిగజసింహ! యోబయనారసింహ! 20

వ్యాఖ్య: పారసీక రాజ్యలక్ష్మినేర్పుతో వారివి నిద్రపుచ్చి, యవన నాయకులను ప్రతాపదీపములను ఆర్పి, మల్కాఖానుకు వచ్చిన అపయశస్సును చీకట్లకు సంతోషించి, యుద్ధరంగమును సంకేతస్థలమున నిన్ను వరించుచున్నది. ఇట పారసీకాదుల రాజ్యలక్ష్ములు అన్యోఢలుగా వర్ణించబడినది.

కన్య :—

ఆజానేయమునెక్కి యోబయనృసింహస్వామివాహ్యాళిరా
నోజం గాంచనసౌధవీథికఁ దద్విలోల్లాసముం జూచి మా
తేజోవిభ్రమధన్యకన్య మదనార్తిం జెంది ప్రాసాదపా
ళీజాగ్రన్మణిపుత్రికాసయతిఁ దాల్చెం దద్గతస్వాంతయై 21

వ్యాఖ్య: నృసింహస్వామి ఉత్తమాశ్వమునెక్కి, వ్యాహాళికై వచ్చుచుండగా ఒక కన్య బంగారు మిద్దిపై నెక్కి, అతని అందమును చూచి మదన పరవశయై, ఆ ప్రాసాదములోని మణిపుత్రికవలె ఉన్నది అని కన్యను వర్ణించెను.

సామాన్య :—

క. ఏరీతివారు చెందిన
నారీతిఁ దదీయరాగ మందెడి నౌరా!
వారాంగన యిది సాక్షా
త్కారపుఁ జటికంపుబొమ్మ కాఁబోలుఁ జుమీ. 22

వ్యాఖ్య : ఈ వారాంగన సాక్షాత్కరించిన స్ఫటికపు బొమ్మవలె

ఏ రీతివాడు పొందుపడిన ఆ రీతి అనురాగమును పొందు చుండిం
చున్నది అని వర్ణించెను.

క. ఈమగువల కాద్యయము ము
గ్ధామధ్యాప్రౌఢ లనఁగఁ దగు నవ్యవయో
వ్యాప్మిశ్రిత యోగ్యము లగు
నామములు; తదీయలక్షణము తేర్పఱుతున్.

వ్యాఖ్య : స్వీయ నాయిక ముగ్ధా, మధ్యా, ప్రౌఢ, అను
ములు నూతన వయస్సంబంధమువలన ఏర్పడినవి. వారి లక్షణము లు
రించబడును.

చ. నవనవకామయౌవననవాంధయు నల్పరతంబు గల్గున
య్యువిద యొముగ్ధ; మధ్యసదృశోదితయౌవనకామ యైరతా
తవివశయౌ లతాంగి, నతతప్రథితోల్బణకామయౌవనో
న్నవయురతాదిమోహమును దాల్చు లతాంగి ప్రౌఢ తానగు!

వ్యాఖ్య : నూతనమగు కామము, యౌవనము, అల్పరతిము
[illegible] ముగ్ధ. [illegible], కామము, సమానముగా కలిగినదియు, ద[illegible]
తమున [illegible] మధ్య, [illegible] కలిగి, రత్యార[illegible]
నందే పారవశ్యము పొందునది ప్రౌఢ

ముగ్ధ :—

శా. ఆలాపంబున కుత్తరంబొసఁగ; దాయాసంబునం గాని తా
నాలోకింపదు; పాటలాధరమరందాస్వాదసమ్మర్దముం
జాలించాలదు; కౌఁగిలీయదు; వినూతోత్సంబు చల్లాడఁగా
నే లజ్జావతి తత్ప్రసంగంబు దయితాభీష్టంబు గా నుండు నే.

వ్యాఖ్య : ముగ్ధనాయిక సిగ్గుతో మాటలాడుటలేదు, చూచుటలేదు; ముద్దుపెట్టుకొనుటను సహించుటలేదు. కౌగిలించుకొననీయదు, అని వర్ణించుటచే నాయికలోని నవయౌవన లక్షణము, ముగ్ధత్వము గోచరించుచున్నది.

## మధ్య :—

ఉ. మానితవై ఖరీస్మరణితమంత్రములం గబరీవిసర్గళ
త్సూనములం బ్రసూనశరశూరునిపూజ లొనర్చి తా రతి
న్మానిని యొప్ప నవ్వ డసమానమునోజభుజపీఠి నాతనిన్
ధ్యానము సేయుచుండె వడి రతాంతనితాంతనిమీలితాక్షియై.

వ్యాఖ్య ; ఆ యువతి మణిత యంత్రముల చేతను, జడనుండి జాలువారుచున్న పుష్పములతోను, మన్మథ పూజచేసి వివశురాలై నాయకుని ధ్యానము చేయుచున్నట్లుండినట్లుగా వర్ణించుటవలన నాయిక రతాంత వివశురాలగు "మధ్యగా" తెలియుచున్నది.

## ప్రౌఢ :—

మ. నటదుత్తుంగపయోధరంబు జితమందాక్షక్రియోదారమ
స్ఫుటవాగంకురచక్షుకోణనివసత్పుష్పేషుదర్పంబు సం
ఘటితాలింగనవామనీకృతకుచాగ్రప్రౌఢవోమాంచమై
విటుఁజొక్కించెఁ బ్రఫుల్లపద్మనయనావీరాయితంబెంతయున్.

వ్యాఖ్య : నాట్యమాడుచున్నదై ఎత్తయిన పయోధరములు గలదియు, సిగ్గును జయించినదియు అస్ఫుటమగు మాటలు కలదియు, కనుచూపులయందు మదన దర్పము కలదియూ ఆలింగనముచే ఒత్తబడిన

రోమాంచము కలదియు ఆగు ఆ తరుణి పురుషాయితమున విటుః జొక్కించెను. ఇట విట శబ్దమునకు నాయకుడు అని అర్థము గ్రహింః వలయును. లజ్జ, లేమి, రతి ప్రౌఢిమ వర్ణించుట వలన నాయిక ప్రౌఢ.

క. ధీర యధీరయు ధీరా
ధీరయు నగునందు మధ్య; ధీరా ధీరా
ధీరాధీరాహ్వయముల
ధారుణిఁ బ్రౌఢయుఁ జెలంగుఁ దల్లక్షణముల్ 28

వ్యాఖ్య : మధ్యప్రౌఢ నాయికలు ధీర, అధీర, ధీరాధీర అను భేదములతో ఒప్పుచుందురు. స్వీయ నాయికకు భేదములు లేవు.

తే. తప్పుగల భర్త మోల సోత్ప్రాసఫణితిఁ
గేరడము లాడు నతి మధ్యధీర; సాశ్రు
పరుషవచన యధీర; సబాష్పకుటిల
హారివచన ధీరాధీర యనఁగఁ జెలఁగు. 29

వ్యాఖ్య : అపరాధ మొనర్చిన భర్తను ఎత్తిపొడుపు మాటలతో పరిహాస మొనర్చునది మధ్యధీర, కన్నీటితో పరుషవచనములాడునది మధ్యాధీర, కన్నీటితో కుటిల వచనములాడునది మధ్యధీరాధీర.

తే. కాంతుఁ డపరాధియైన నాకారగుప్తిఁ
బరఁ రతివేళ నలయించుఁ బ్రౌఢధీర;
తాడనోగ్ర యధీర; యుదగ్రకుటిల
ఫణితియుభయాఖ్య; వీరి నేర్పఱుతు వరుస. 30

వ్యాఖ్య : కాంతుడపరాధము చేసినను ఆకారగోపనము చేసి, రతి వేళ అలయించునది ప్రౌఢాధీర, తన్నులు తన్నునది ప్రౌఢ అధీర, వంకర మాటలచే బాధించునది ప్రౌఢ ధీరాధీర.

మధ్యధీర :—

ఉ. మోమున ఘర్మశీకరసమూహముగానఁగనయ్యెనిప్పుడా
రామవిహారకేలిని భరంపడినాఁడవొ నన్నుఁ బాసి యీ
రే మదనాస్త్రఘాతముల ప్రేగితొ నీయుర మెల్లఁదద్వ్రణ
స్తోమను సోఁకి యున్నయది చొప్పడఁ గాంత! యెఱుంగఁ
జెప్పుమా.

వ్యాఖ్య : నీ మొగమున చెమటలు కనబడుచున్నవి, తోటలో విహరించుటవలన అలసితివో, నన్ను ఎడబాయుట వలన మదన బాణముల వలన నీ ఉరమంతయు గాయపడి ఉన్నది అని నాయిక పర కాంతతో భోగించి వచ్చిన నాయకుని ఎత్తిపొడుపు మాటలతో పలకరించు చున్నది కావున నాయిక మధ్యా-ధీర.

మధ్యాధీర :—

శా. చాలుంజాలుఁబిసాళిచేఁతలుపదాబ్జాతంబుపైమాటికిన్
వ్రాలంబోకు భవత్ప్రియానఖవిభిన్నాంశంబైన నీవక్షమీ
నీలస్థాపితకుట్టిమం బొరసిన న్వేధించు లే లెమ్ము నీ
బాలసంగమసౌఖ్యవైభవము సూపన్వచ్చితే యిచ్చటన్.

వ్యాఖ్య : నీ ఇచ్చకపు చేతలు చాలు, నా పాదములపై వ్రాల కుము. నీ ప్రియురాలి నఖక్షతములతో గాయపడిన వక్షస్థలము నేలకు తగిలినచో బాధకలుగును. నీ బాల సంగమ సౌఖ్యము చూపించుటకు వచ్చి తివా అని నాయిక అన్యకాంతా సంభోగ మొనర్చిన నాయకునితో పలుకు చున్నది. ఇట నాయిక సాక్షుపరుషవచనము గోచరించుచున్నది కావున మధ్య-అధీర.

మధ్యాధీరాధీర:—

చ. పలుకవటంచు నేమిటికి బాములఁ బెట్టెదు, కాంత! నీయెడం
దెలియఁగఁ దప్పు లేమికిని నిన్ననఁ జాలక యూరకుంటి నం
బలుమఱు సాపరాధునిగఁ బట్టెద వెన్నఁడు దప్పు నీయెడం
గలుగునె? యంచు నించెఁ దెలిగన్నులనీరుల తాంగియంతటన్

వ్యాఖ్య : నేను మాటలాడుట లేదని, తప్పులు పట్టుచున్నావు- నీ యందు తప్పు లేదని నిన్నేమియు అనలేక ఊరకుంటిని. అయినను నీవే అపరాధుని వలె పట్టుచున్నావు.... ఎన్నడయినను తప్పు నీయందు కలుగునా అని బాష్పాకులితలోచనయై పలుకుచున్నది. ఎన్నడు తప్పు నీ యెడం గలుగు అనుచోట ధీరత "నించె దెలి గన్నులనీరు" అనుచోట అధీరత గోచరించుచున్నది.

ప్రౌఢధీర :—

చ. హితమతి ధూర్తభర్త కెదురేఁగదు నేర్పున నేకపీఠ సం
గతి వారియించి పల్కుటయుఁ గ్రక్కున నచ్చెలికూడిగంబు లం
జతురత నేర్పుచుం దమక జాలఁగఁ ద్రోచి యతిప్రగల్భయై
నతియుపచారగౌరవము నల్పెడునట్లు వహించుఁ గోపమున్

వ్యాఖ్య : ధూర్తుడైన భర్తకు ఎదురేగు నెపమున తానుకూర్చుండి పీటనుతీసివేసి, అతడు పలుకరించగా వెలికత్తెకు పనులు పురమాయించు నెపమున పంపించి వేసెను. ఇట నాయిక తనకుగలకోపమును కప్పిపుచ్చి వేఱునెపముతో నాయకునితో కలసి ఉండుటచే ప్రౌఢధీర నాయిక.

ప్రౌఢాధీర :—

చ. వడిఁ గృతాపరాధుని నవారణయాన యీసునం
గెరలి భమగణాంబువ బిగించి ప్రతంసితసారసంబునం

గరముదమింపఁగాఁదొడఁగెఁగాంతునిసాంత్వనశీతలోక్తులాం
తరనిజకోపతప్తఘృతధారకకారణవారిధారగాన్. ౩౬

వ్యాఖ: అపరాధుడగు ప్రియుని ప్రియురాలు తన కరపాశముచే బిగించి పట్టి, నాయకుని సాంత్వన వాక్యములచే కోపాగ్ని ప్రజ్వరిల్లి కర్ణావతంసముగా నున్న తామర పువ్వుతో కొట్టెను అని వర్ణించుట వలన నాయిక నాయకుని తాడనము చేయుచున్నది. కావున ఈమె ప్రౌఢా, ధీర.

ప్రౌఢధీరాధీర :—

చ. బొమముడిపాటుజంకెనయుఁబూని పురంధ్రులుసాదరా
థులౌ
రమణులు వేడుకొన్న ననురాగముదాల్చుదు రట్లు కాదుమ
త్క్రియమపరాధలేశమును దాల్పవినీ విపుడెంత మ్రొక్కినం
దెమలదుశాంతిఁబొందదుమదీయమనంబిఁకఁజాలుఁబ్రార్థనల్

వ్యాఖ్య: అపరాధుడగు ప్రియుడు ప్రియురాలను బొమముడిపాటు జంకెనయు సహించి వేడుకొనగా క్షమతో అనురాగమును పొందెదరు, కాని నా పద్ధతి అటుకాదు. నీవు ఎంత మ్రొక్కినను నాకు శాంతి కలుగదు. నీ ప్రార్థనలు చాలును. అని నాయిక పలుకుటలో "అపరాధలేశము దాల్చను" అనుటలో ధీరతను, "మదీయమనంబు ఎంత మ్రొక్కినన్ దెమలదు శాంతిఁబొందదు" అనుటలో అధీరతయు సూచించుచున్నది. కావున నాయిక ప్రౌఢ ధీరాధీర.

క. ధారుణి మధ్యయుఁ బ్రౌఢయుఁ
ధీరాధీరాదిభేదదీపితలై వే
ర్వేరను జ్యేష్ఠ కనిష్ఠయు
నై రంజిల ద్వాదశాఖ్యలగుచుండు వరుసన్. 37

వ్యాఖ : మధ్య ప్రౌఢలు, ధీర, అధీర ధీరాధీరాది భేదములచే ఆరు విధములు, అరుగురు తిరిగి జ్యేష్ఠ, కనిష్ఠా భేదములచే మొత్తము పండ్రెండు విధములు.

క. కావున స్వీయ త్రయోదశ
 భావంబు వహించు; నన్య పరఁగు ద్వివిధ యై;
 యావారాంగన యేకవి
 ధావహః యుబ్లెన్నఁగాఁ బదార్వురు సుదతుల్. 38

వ్యాఖ్య : స్వీయనాయిక ఈ పై విధమున పదమూడు విధములుగా నుండును. అన్య, అనోఢ, కన్యా భేదముచే ద్వివిధము సామాన్య ఏక విధము. మొత్తము నాయికలు పదునారు విధములు

తే. మఱియు శృంగారశంభుసంభావితాష్ట
 తనువులన నీమృగాక్షులు వినుతిఁ గాంతు
 రష్టవిధభేదముల; వీరియాహ్వయములు
 లక్షణము తేర్పరించెద లలితఫణితి. 39

వ్యాఖ్య : శృంగార రసము పరమేశ్వరునకు అష్టమూర్తులవలె అవస్థా భేదములను పట్టి నాయికలు ఎనిమిది విధములుగా నుందురు.

సీ. వరుఁడు కైవసమైన వనిత స్వాధీనభ
 ర్తృక; ప్రియాగమవేళ గృహముఁ దనువు
 నవరించునింతి వాసకసజ్జ; పతిరాక
 తడవుండ నుత్కంఠఁ దాల్చునింతి
 విరహోత్క; సంకేత మరసి నాథుఁడు లేమి
 కెననార్తయా కాంత విప్రలబ్ధ;

విభుఁ డన్యసతిఁ జెంది వేకువ రాఁ గుందు
నబల ఖండిత; యల్కనధిపుఁ దెగడి
తే. యనుశయముఁ జెందు సతి కలహాంతరిత; ని
జేశుఁడు విదేశగతుఁడైన కృశతఁ దాల్చు
సతివ ప్రోషితపతిక; కాంతాభిసరణ
శీల యభిసారికాఖ్యయై చెలువు మెఱయు 40

వ్యాఖ్య : భర్త తన స్వాధీనమయిన వనిత స్వాధీన పతిక. ప్రియాగమన సమయమున తన శరీరమును, గృహమును అలంకరించుకొను స్త్రీ వాసక సజ్జిక. పతి రాకకు ఆలస్యము చేయగా మిక్కిలి తడబాటు పడి స్త్రీ విరహోత్కంఠిత. సంకేత స్థలమునకు ప్రియుడు రాక పోవుటచే స్మరార్తిని పొందు స్త్రీ విప్రలబ్ధ. ప్రియుడు పరకాంతతో గడిపి సంభోగచిహ్నములతో ఉదయమున రాగా బాధపడునది ఖండిత. కోపముతో భర్తను దూషించి వెడలగొట్టి, అతడు వెళ్ళిన తరువాత పశ్చాత్తాప పడునది కలహాంతరిత. ప్రియుడు పరదేశగతుడయిన కృశించునది ప్రోషిత భర్తృక. ప్రియుని వద్దకు తానే పోవునది అభిసారిక.

క. ఈరీతిఁ జెలఁగు సతిశృం
గారకలాకలితనాయికామణులకు వే
ర్వేర నుదాహరణంబులు
భూరిమధురవచనరచనముల నేర్పఱుతున్ 41

వ్యాఖ్య : ఈ శృంగార నాయికామణులకు ఉదాహరణాలు ముందు చెప్పబడును.

స్వాధీనపతిక :—

ఉ. శ్రీనిధి యోబళూవరునృసింహుఁడు కైవసమై చెలంగఁగా
భూనుతవైభవస్ఫురణఁ బొల్చు యశోజలజాక్షి నిత్యస
న్మానితశీలయై ధవుని మన్నన నౌదల నెక్కినట్టి వై
మానికవాహిని న్నగు నమందనిజాతిశయంబు పేర్మికిన్, 42

వ్యాఖ్య : యశఃకాంత నృసింహునికి కైవసం చెంది మహావైభవముతో భర్తృ సమ్మానం పొంది అతని నెక్కి కూర్చున్నదై గంగా నదిని చూచి నవ్వుచున్నది. ఇట నరసరాజు కీర్తి ఆకాశగంగ వలె స్వచ్ఛమై లోకమున నిండినదని భావము. కీర్తి కాంత స్వాధీన పతిక.

వాసకసజ్జిక :—

చ. యవనచమూనమూహములనాజిజయించియుదగ్రదిగ్జయో
త్సవవిభవాభిరాముఁడయి సారెకు నోబయనారసింహభూ
ధవుఁ డరుదెంచు లగ్నమునఁ దత్పురలక్ష్మివిభూషితోల్లస
ద్భవనవిశేషయై మృగమదంబువవాసనఁ బొల్చునిచ్చలున్.

వ్యాఖ్య : నరసభూపాలుడు యవన రాజులను యుద్ధమున జయించి దిగ్విజయోత్సవముతో తిరిగి వచ్చుచున్న సమయమున ఆపుర లక్ష్మి, గృహలక్ష్మి కస్తూరి వాసనలను వహించి యుండెను. ఇట పుర లక్ష్మిని వాసకసజ్జికగా వర్ణించెను.

విరహోత్కంఠిత:—

ఉ. నెచ్చెలు లీన్నృసింహధరణీవరుఁ దెచ్చెదమంచుఁబోయిరా;
రిచ్చట నీవునుం గరుణ యించుకలేక కలరంపగుంపులన్
గ్రుచ్చెద వేలమత్ప్రియునిఁ గూర్పుము మన్మథ నీకు మద్విభుం
దెచ్చుటకై యొసంగెద మదీయకటాక్షములన్జయాస్త్రముల్.

వ్యాఖ్య : ఓ మన్మథా నా ప్రియుని తీసుకొని వచ్చెదమని నా చెలికత్తెలు పోయి యింకను రారైరి. నీవు నిర్దయుడవై పుష్పబాణములతో కరుణలేక నన్ను బాధించుచున్నావు. నా కటాక్షములను జయాస్త్రములను నీకు ఒసంగెదను, నా ప్రియుని జయించి తీసుకొని వచ్చి నాకు కూర్పుము. ఈ నాయిక విరహోత్కంఠిత.

విప్రలబ్ధ:—

చ. ఎనయఁగ నీనివాసమున కే నరుదెంచెద నంచు నాపయిం
గనుఁగొన నిక్కపుం బ్రియము గల్గినవాఁడునుబోలెఁ బల్కి
యీ మనికికి రాక తక్కనను మానెదుఁగాక; మదీయదృష్టికిం
బనుపడి ప్రోలనున్నగతి మాయలు సేయఁగ నేలభర్తకున్.

వ్యాఖ్య :- నా ప్రియుడగు నరసభూపాలుడు నీ నివాసమునకు నేనే వచ్చెదనని నాపై ప్రేమ కలిగినదానినివలె పలికి ఇటకు రాక మానెను. మానిన మాను గాక, ఎదుట నున్నట్లుగా నా దృష్టి కగపడు మాయలు పన్నుట ఎందులకు అని నాయిక తన ప్రియుడు సంకేత స్థలమునకు రాక పోవుటచే విచారించుచున్నది కాన విప్రలబ్ధ.

ఖండిత:—

చ. నృపులకు నెల్లవారల భరించుట యోగ్యముగాన నేఁటి రే
యపరిమితోత్సవంబునఁ బ్రియానదనంబులకేఁగి యే గి యా

నెరమున మధ్యహ్నంబునకు నీ వరుదేరఁ బ్రభాతమయ్యెఁగా
కిపుడు నృసింహా! నీవయినొకించుక వంచనలే రెఱుంగుదున్

వ్యాఖ్య :- ఓ నృసింహా! రాజులు అందరిని సమానముగా భరించవలెను కాన నేటి రాత్రి ప్రియా సదనములన్ని చుట్టుముట్టి నా గృహము నకు వచ్చునరికి సూర్యోదయమయినది అని నాయిక, నాయకుడు అన్య కాంతా సంగమ మొనర్చి వచ్చినసంగతి కనిపెట్టి సోత్ప్రాసముగా పలుకు చుండుటచే ఖండిత నాయిక.

కలహాంతరిత:—

ఉ. అనఁగరాని కోపమున నప్పుడు కాంతుని ధిక్కరించుచో
మానదురాగ్రహాగ్రహము మానుపలేకపు డెందుఁబోయెనో
యీ నసవింటిదంట యిపు డేఁపఁ దొడంగె భవిష్యదర్థము
ల్గానని నామనంబునకుఁ గావలె నిట్టి విషాదవేదనల్. 47

వ్యాఖ్య :- పట్టరాని కోపముతో ప్రియుని ధిక్కరించుటచే అతడు ఎచటకు పోయెనో, ఆ మన్మధుడు నన్ను బాధింప సాగెను. భవిష్యదర్థ మును గ్రహింపక వర్తించిన నా కిట్టి ప్రాయశ్చిత్తము కావలసినదే! అని నాయిక ప్రియుని నిందించి వెడలి పోయిన పిదప పశ్చాత్తాప పడుటచే కల హాంతరిత.

ప్రోషితభర్తృక:—

చ. చిరయశ! మోబభూవరునృసింహా! భవద్రిపు భామ
కానవాం
తరమున కేఁగి యందు నిజనాథుఁ గాంచక మన్మథార్తయై
వరుని సరోజపత్రమున వ్రాయునెడం గరము ల్సెమర్పఁగా
నరయు నిజాంగకంబె పగమయ్యెనటంచుఁ దలంచుదై వమున్.

వ్యాఖ్య:- ఓ నృసింహ నీ శత్రువు భార్య భర్తకు దూరమై మన్మథార్తితో సరోజపత్రముపై ప్రియుని చిత్రము లిఖించు చుండగా చేతులు చెమర్చుచుండుటచే తన అవయవములే తనకు శత్రువులయ్యెనని బాధపడు చుండెను. నాయకుడు పరదేశగతుడగుటచే నాయిక దుఃఖించుచుండి నట్లుగా వర్ణించుటచే ప్రోషితపర్తృక.

అభిసారిక:—

ఉ. నాతి మదిం బ్రియాభిసరణం బొనరింపఁ దలంచెదీవు; చం
ద్రాతపసాంద్రదీధితు లజాండకటాహము నిండఁ బర్వఁగా
నీతలఁ బెట్లు గూడు రమణీ! వలెనే నొకవన్నెఁగాఁగ ము
క్తాతతులుం బ్రసూనములు జాల్వు మలందుము గంధసారమున్.

వ్యాఖ్య:- ఓ రమణీ! వెన్నెల లోకమంతయు వ్యాపించి యుండగా నీవు ప్రియుని అనుసరించుటకు పోవుచున్నావు. నీ కోరిక ఎట్లు తీరును. నీవు ముత్యాలహారము, తెల్లని పుష్పములు, మంచి గంధము ధరించి, వెన్నెలలో కలసి పొమ్ము. ఇట నాయిక ప్రియుని అభిసరించి పోవు చున్నది కాన అభిసారిక.

క. ఈయెనిమిది భేదంబులఁ
బ్రేయసులు పదార్వురుం బ్రభిన్నాత్మికలై
యాయతగతి నిల నూటిరు
వై యెనిమిది భేదములను వఱలుదు రెలమిన్. 50

వ్యాఖ్య :- వెనుక చెప్పబడిన విధముగా పదారు నాయికలు అష్టవిధ నాయికా భేదముచే నూటిరవై యెనిమిది భేదములతో ఒప్పుచుందురు.

క. ఇల నీసంఖ్యలఁ దగు సతు
లలయుత్తమమధ్యమాధమాభిఖ్యలఁ జె

న్నలరఁగ మున్నూఱెనుబది
నలువురు నాయికలటండ్రు నవరసరసికుల్. 51

వ్యాఖ్య :- నూట యిరువది యెనమండ్రు నాయికలు, ఉత్తమ, మధ్యమ అధమ భేదములచే మూడువందల యెనుబది నాలుగు విధములుగా నందురు.

## కావ్య స్వరూపము

తే. ఇంకఁ గావ్యస్వరూపంబు నేర్పరింతు
విగతదోషంబులును గుణాన్వితము లధిక
లసదలంకారభావోపలక్షితములు
నైన శబ్దార్థములు కావ్య మనఁ జెలంగు 52

వ్యాఖ్య:- దోష రహితము, గుణ సహితము, అలంకారయుక్తము అగు శబ్దార్థములు కావ్యమనగా చెల్లును.

క. తనువగు శబ్దార్థంబులు
ధ్వని జీవ మలంక్రియావితానము సొమ్ముల్
తనరుగుణంబులు గుణములు
ఘనవృత్తులు వృత్తులౌర! కావ్యేందిరకున్. 53

వ్యాఖ్య :- కావ్యమునకు శబ్దార్థములు శరీరము, ధ్వని జీవము, అలంకారములు అలంకారములు, గుణములు గుణములు, వృత్తులు వృత్తులు

తే. అందు వాచకలక్షకవ్యంజకంబు
లనఁగ శబ్దప్రపంచంబు వినుతికెక్కుఁ;
ద్రివిధమై యర్థజాతంబు తేజరిల్లు
నవని వాచ్యంబు లక్ష్యంబు వ్యంగ్య మనఁగ

వ్యాఖ్య ; శబ్దము వాచక, లక్షక, వ్యంజకమను భేదములచే

మూఁడు విధములుగా నుండును. అర్థము వాచ్యము, లక్ష్యము, వ్యంగ్యము అని మూఁడు విధములు.

తే. శబ్ద వృత్తులు నభిధ లక్షణ యనంగ
వ్యంజన యనంగఁ బెనుపొందు; నంచు నభిధ
సంతతసంకేతితార్థ గోచరసుశబ్ద
ధామమై యోగ రూఢి భేదములఁ జెలఁగు. 55

వ్యాఖ్య : శబ్ద వ్యాపారమును అభిధ, లక్షణ, వ్యంజన అని మూఁడు విధములుగా విభజింపబడినది. ఒక శబ్దమునకు అర్థము తెలియ జేయునప్పుడు నడుమ జరుగు ప్రక్రియే శబ్ద వ్యాపారము. అభిధ సంజ్ఞా రూపమగు అర్థమును తెలియజేయును. అది యోగము, రూపము అని రెండు విధములు. కేవల సంజ్ఞా రూపమగు అర్థమూ కలది రూఢము, వ్యుత్పత్త్యర్థము కలది యోగము.

యోగమూలాభిధ :-

చ. అలఘుబలాభిరాముఁ డగు నా బళిరాజనృసింహ మేదినీ
తలబలవైరిదానజలధారల నిచ్చలుఁ దేలి తేలి త
ద్గళితవిరోధిశోణితపదమ్ముల నిమ్ములఁ గూడి కూడి యా
జలధులు వాహినీశులనఁ జాఁ జెలంగుఁబయో నిధానముల్.

వ్యాఖ్య : నరసరాజుగారి దానజలధారలను, వారి శత్రువాహినుల శోణితనదములు తమలో కలియుట వలన మొదట జలధులు అని పేరు బడిన సముద్రమునకు వాహినీశుడని పేరు కలిగినది. ఇచ్చట బలవైరి, వాహినీశులు యౌగికము. ఈ శబ్దములకు వ్యుత్పత్త్యర్థమును బట్టి ఇంద్రుడు, సముద్రుడు అని అర్థము. ఇవి యౌగికములు.

తే. అందు జహదభిధేయము నజహదర్థ
యనఁగ సంబంధలక్షణ యలరు; సామ్య
గుణనిబంధన తాను ద్వైగుణ్య మందు
జగతి సారోప సాధ్యవసాయి యనఁగ. 60

వ్యాఖ్య : సంబంధ నిబంధన జహదభిధేయము (జహదావాచ్యము), అజహదర్థము (అజహదభిధేయము, అజహద్వాచ్యము, అజహల్లక్షణము) అని రెండు విధములు. సామ్య నిబంధన సారోప, సాధ్యవసాయి అని రెండు విధములు.

సీ. అల "గంగలో ఘోష" మను నెడ గంగాప
దంబు సంబంధి యౌ తటముఁ దెలుప
సంబంధలక్షణ జహదర్థ యగు నందు;
"మంచె మ్రోసె" నటన్న మంచగతులు
దోఁచుఁ; "గోదండపఙ్క్తులు వచ్చె" నన విండ్ల
నమరు యోధులఁ దోఁప నజహదర్థ
"యవనిపాలుఁడు సింహ" మనువేళ సదృశతా
గుణసిద్ధిసామ్యలక్షణ చెలంగు;
తే. నందు నుపమాన ముపమేయ మప్రభిన్న
మైన సారోప; యుపమాన మగదితోప
మేయమై యున్న సాధ్యవసాయ; యిట్టి
లక్షణల కన్నిటి కొనర్తు లక్ష్యములను.

వ్యాఖ్య : "గంగలో గొల్లపల్లె" అను పదమునందు గంగాపదము స్వార్థమును విడిచిపెట్టి గంగా తీరము అను అర్థమును తెలుపుచున్నది. కావున జహల్లక్షణ. అదేవిధంగా "మంచెలు మ్రోసెను" అను వాక్య

ములో మంచెలు మ్రోయవు. మంచెలపై నున్న జనులు అరచుచున్నారు అని అర్థము. ఇచట తన అర్థమును విడిచి వేరొక అర్థమును స్ఫురింప చేయుచున్నది కనుక జహల్లక్షణ, "కోదండ పంక్తులు వచ్చె" అను వ్యాకంలో కోదండమును ధరించనవారు వచ్చిరి అని అర్థము. ఇట కోదండము ధరించినవారితోటుగా కోదండము కూడా వచ్చినది. ఇచ్చట స్వార్థమును విడిచిపెట్టలేదు. కావున అజహల్లక్షణ "అవనిపాలుడు సింహము అను వాక్యమునందు రాజుయందు సింహమునకున్న క్రౌర్యాది లక్షణములు గోచరించుచున్నవి. ఇందు ఉపమాన, ఉపమేయములు ప్రత్యేకముగా ప్రయోగించుటవలన సారోపలక్షణము. ఉపమేయమును చెప్పక ఉపమానము మాత్రము చెప్పినచో సాధ్యవసాయి లక్షణ అగును. ఉదాహరణ "సింహము వచ్చే" ఇందు సింహ సదృశుడగు రాజు వచ్చుచుండెనని అర్థము. రాజునకు సింహమునకు అభేదము పాటింపబడినది.

జహల్లక్షణ :-

చ. అగణితశౌర్యధైర్యవిభవాన్విత! యోబయనారసింహ! నీ
గగనచరామరాగశిబికర్ణ జయోన్నతదానలక్ష్మికిన్
జగములు సంతసిల్లె; నతిసాంద్రభవజ్జయభేరిభాంకృతి
ద్విగుణితసైన్యఘోషముల వే వడఁకె న్రిపుపట్టణావళుల్.

వ్యాఖ్య : ఓ నరనరాజా! నీ దానలక్ష్మిని చూచి లోకములు సంతోషించినవి. నీ జయభేరి ధ్వనిని విని పట్టణములు వణకుచున్నవి. ఇట జగములు సంతసిల్లినవి, "వే వడకేన్ రిపు పట్టణావళుల్" అను స్థలం నందు అచేతనములగు లోకములు, పట్టణములు సంతసిల్లుట వణకుట జరుగదు. కనుక ఆ శబ్దములు తమ స్వార్థమును విడిచి లోకములోని ప్రజలు, పట్టణములోని శత్రువులు అని అర్థము గోచరించుచున్నది. గావున ఇది జహల్లక్షణ.

అజహల్లక్షణ :—

క. అనమరణరంగమున నీ
యసినటి నటియింపఁ గరుల హరుల న్నిరులన్
వెన నొసఁగు నౌర యెంతటి
రసికుఁడు నీవైరి యోబరాజనృసింహా. 63

వ్యాఖ్య:- ఓ నరసింహా! రణరంగమున నీ కత్తియను నాటకత్తె నటియించుచుండగా శత్రువులు నాట్యమును మెచ్చుకొని, గజతురగములు, సంపదలను కానుకగా ఇచ్చుచుండిరి. ఇట వాచ్యార్థమగు "సమర్పించు" అను అర్థమును విడిచిపెట్టక యే లక్ష్యార్థమగు "ఉపహార రూపమున సమర్పించుచున్నారు" అను తాత్పర్యార్థము గోచరించుచున్నది కాన ఇది అజహల్లక్షణ.

సారోపలక్షణ :—

మ. అమరద్వీపవతీఝరాంతరములం డాయాడి నీలాంబుపూ
రము సూర్యాత్మజఁగాఁ దలంతురు దురసారప్రౌఢిమైఁ గొందఱు
ద్యమతేజోఽధిక! నారసింహ! భవదుద్యత్కీర్తివిర్ధూతసం
భ్రమయాగంగయకీర్తి దాల్చెననినే భావింతుఁ జిత్తంబునన్.

వ్యాఖ్య :- గంగానదిలోని నల్లని ప్రవాహమును యమునా నదిగా భావించుచుందురు కాని గంగానది నీ కీర్తి వలన తన గర్వమును కోలుపోయి అపకీర్తిని ధరించినదని నేను భావించుచున్నాను. ఇట యమున ఉపమేయము, అపకీర్తి ఉపమానము, ఉపమానమానోపమేయములు అభిన్నముగా గోచరించుటచే సారోపలక్షణ.

సాధ్యవసాయలక్షణ :—

క. నిరతబుధప్రహ్లాదా
దరకరుఁడు హిరణ్యకశిపు దానోన్నతుఁడై
ధరఁ బోచిరాజవంశ
స్థిరరత్న స్తంభమున నృసింహుఁడు పుట్టెన్. 65

వ్యాఖ్య :- ప్రహ్లాద, హిరణ్య కశిపుల రాజ వంశమున నరస భూపాలుఁడను నృసింహుఁడు పుట్టెను. ఇట "నృసింహుఁడు పుట్టెన్" అనుట వలన ఉపమానము ఒక్కటియే గ్రహించబడినది కావున ఇట సాధ్యవసాయిలక్షణము.

క. సంగతములగు పదార్థము
లం గల వాక్యార్థమున కలంకారంబై
రం గగు నర్థాంతర మర
యం గావ్యములందు వ్యంజనాఖ్యఁ జెలంగున్. 66

వ్యాఖ్య :- పద పదార్థములకు అన్వయము కలుగుటచే వాక్యార్థము కలుగును. కావ్యములందు ఆ వాక్యార్థములకు శోభాహేతువగు అర్థాంతరము గోచరించు చుండును. దీనినే వ్యంజన అందురు.

క. ప్రకృతోతపన్న కభిధకుఁ
బ్రకృతానుపపత్తిగోచరకు లక్షణకున్
బ్రకటితవిభేద్య వ్యంజన
ప్రకృతాప్రకృతోపపత్తిఁ బరఁగెడుకతనన్. 67

వ్యాఖ్య :- అభిధ ప్రకృతార్థమును మాత్రమే గోచరింప చేయును. లక్షణ ప్రకృతార్థము గోచరింపక పోగా, లక్ష్యార్థమును తెలుపును. వ్యం

జన ప్రస్తుతార్థము, అప్రస్తుతార్థమును తెలుపును, కాని వ్యంజనా శక్తి అభిధా లక్షణా శక్తుల కంటె విలక్షణమైనది.

ఆ. జగతి నదియు శబ్దశక్తిమూలంబును
నర్థశక్తిమూల మరయ నుభయ
శక్తిమూల మనఁగ నన్నుతిఁ గాంచుఁ; ద
దీయలక్ష్యములను దేటపఱతు. 68

వ్యాఖ్య :- ఆ వ్యంజనా వృత్తి శబ్దశక్తి మూలవ్యంజన, అర్థ శక్తి మూలవ్యంజన ఉభయశక్తిమూల వ్యంజన అని మూడు విధములు.

శబ్దశక్తిమూలవ్యంజన:—

క. ఘనత నృసింహుని కరమునఁ
దనరెడు నసి నిజసమగ్రధారాగ్రనిమ
జ్జనతత్పరు లగు నరులకు
ననిమిషభావం బొసర్చు ననవరతంబున్. 69

వ్యాఖ్య :- నృసింహుని చేతికత్తెకు గురికాదలచిన నరులు తెప్పపాటులేనివారై చూచుచుండిరి అని వాచ్యార్థము. నృసింహావతారము ధరించిన విష్ణువు చేతి ఖడ్గము, తన ఖడ్గధారలో మునగదలచిన వారికి దేవత్వము నొసగును అని వ్యంగ్యార్థము. ఇట శబ్దముల నానార్థశక్తిని ఆధారముగా నరస భూపాలుని వర్ణన ప్రస్తుతము, నరసింహావతార వర్ణన అప్రస్తుతము నృసింహ, తత్పరులగు నరులు, అనిముషభావము అను శబ్దములు నానార్థ బోధకము కావున ఇట వ్యంజన శబ్దశక్తి మూలము.

అర్థశక్తిమూలవ్యంజన :—

చ. అలఘుపరాక్రమక్రమసమగ్రభుజాగ్ర! నృసింహభూప! నీ
విలసదనూనదానగుణవిభ్రమ మెంతయు నాలకించి తా

నారభటియును సాత్త్వతి భారతియును
నాఁగఁ బొగడొందుఁ గల్ల క్షణము లొసర్చు. 72

వ్యాఖ్య :- కైశికి, ఆరభటి, సాత్త్వతి, భారతి అను వృత్తులు రచనాశ్రయములై, మధుర రస విశేష యోగ్యముగా నుండు.

మ. చెలఁగుం గైశికి కోమలార్థ రచనాశ్రీ: నుద్ధతార్థక్రమా
చలితాడంబర సూక్తి యారభటి; యీషత్ప్రౌఢసందర్భని
శ్చలయౌ సాత్త్వతి; పొల్చు భారతియు నీషత్కోమలార్థ
క్రమం
బుల; నీ వృత్తులకున్యథోచితరసస్ఫూర్తుల్నిరూపించెదన్ 73

వ్యాఖ్య : కోమలమైన అర్థమును వర్ణించుటకు కైశికి వృత్తియు, ఉద్ధతమైన అర్థమును వర్ణించుటకు ఆరభటి, ఈషత్ప్రౌఢమయిన అర్థమున వర్ణించుటకు భారతియు ఈషత్కోమలమయిన అర్థమును వర్ణించుటకు సాత్త్వతి వృత్తులను ప్రయోగించవలయును.

ఈ వృత్తులకు ఏయే రసము లుచితములో నిరూపించుచున్నాడు.

తే. కైశికి చెలంగు శృంగార కరుణలందు;
నారభటి రౌద్రబీభత్సవాహిని యగు;
నలరు భారతి హాస్యశాంతాద్భుతములఁ;
నమరు సాత్త్వతి వీరభయానకముల 74

వ్యాఖ్య : కైశికి శృంగార కరుణములయందు, ఆరభటి రౌద్ర బీభత్స రసములయందు, భారతి హాస్య, శాంత, అద్భుతములయందు సాత్త్వతి వీరభయానకముల యందు ఒప్పారును.

భారతి :-

సీ. నీ కీర్తి కెన యని నెగడిన సురదంతి
 శిరము మధ్యే భిన్నతరము గాదె
నీ కీర్తితోఁ బ్రతి నెరసిన యిందుమం
 డలము పదాఱు ఖండములు గాదె
నీ కీర్తి నోరసిన కాకోదరస్వామి
 తల సహస్రచ్ఛిద్రాకులము గాదె
నీ కీర్తిఁ బోలఁ బూనిన ధవళాంభోజ
 తతి శశధా దళితంబు గాదె

తే. యహహా! నీ కీర్తి కవనిలో నమరకరియు
గిరియు నిందుండు గిందుండు సురగపతియు
గితియుఁ దెలిదామరచాలు గీలు నెనయె
యాబలేంద్రుని నారసింహక్షితీంద్ర? 77

వ్యాఖ్య : ఓ నరసరాజా నీ కీర్తితో సాటి వచ్చునట్లుగా ఏనుగు తల ద్విధాభిన్నముగా నుండుట, చంద్రుడు పదాఱు కళతో నుండుట, ఆనంతుడు వేయి తలలతో నుండుట, తామర పూవునకు నూఱు దళము లుండెను అని వర్ణించెను. యిది అద్భుత రసానుకూలమగు వస్తువర్ణ మగుటచే వైదర్భీరీతిని ఆశ్రయించి కొంచెము మృదు సందర్భమున వర్ణించుటచే భారతివృత్తిని ఆశ్రయించినది

సాత్త్వతి :-

చ. ఉభయురగండ! తావకరణోగ్రజయానకము ల్ఘుభుల్ఘుభు
ల్ఘుభు లని మ్రోయఁగా భయదకుంఠితవీరభటు ల్ప్రభుల్ప్రభు

మానస యగు గౌడి; యుభయాత్మమహిమ గల్గి
యలరుఁ బాంచాలి; వీనిలక్ష్యము లొనర్తు. 81

వ్యాఖ్య :- మృదు పదములు, అల్ప సమాసములుగల రచన వైదర్భి, పరుషాక్షరములతోగూడి, దీర్ఘ సమాసములు గల రచన గౌడి, కొంత మృదు పదరచన కొంత పరుషపద రచన గలది పాంచాలి

వైదర్భి :—

శా. ఆలావణ్య మగణ్య మాగుణగణం బవ్యాజ మాతేజ ము
ద్వేలం బావినయం బమేయతర మావీర్యం బనిర్వాచ్య మా
యాలాపం బతిసత్య మావితరణం బాశాంతవిశ్రాంత మా
శీలం బార్జవమూల మెన్నఁదరమే శ్రీనారసింహేంద్రునిన్.

వ్యాఖ్య:- ఇందు నారసింహుని లావణ్యము, తేజము, వినయము, వీర్యము, ఆలాపము, వితరణము, శీలమును, మృదు పదములచే వర్ణించెను. "ఆశాంత విశ్రాంత" అను స్థలమునందు అల్ప సమాసమును ప్రయోగించెను కావున ఇది వైదర్భీరీతి.

గౌడి :—

శా. అంభోరాశిగభీర! యోబయనృసింహా! నీ రణోదస్తదో
స్స్తంభోత్తంభితజృంభితాసిలతికాసంరంభసంభావనా
దంభానర్గళదుర్గ దుర్గమమదోద్యద్దుష్టధృష్టాగిరా
ట్శుంభచ్ఛుంభనిశుంభసంభ్రమహరస్ఫూర్తిన్వి
జృంభించురా.

వ్యాఖ్య :- నీ చేతియందు విజృంభించుచున్న ఖడ్గమను కాళికాదేవి శత్రురాజులను శుంభ నిశుంభులను సంహరించు చున్నది. ఈ పద్యము

ఇందు పరుషాక్షర పదములు (స్తంభ, జృంభిత, అదోద్ధుష్ట), అదోద్ధుష్ట సృష్టారి....స్ఫూర్తిన్ వంటి దీర్ఘ సమాసములు కలవు కావున ఇది గౌడి వృత్తి.

పాంచాలి :—

శా. ఆరూఢింc దప మాచరించెదవు చంద్రా! యుల్ల మందాకినీ
తీరక్షోణితటిన్మహానటజటాదీర్ఘాటవీవాటిలోc
బ్రారబ్ధం బగు మేనియంకము హరింప న్వ్రేcడి యిం తేల? నీ
కారాధింపcగ రాదె యోబయనృసింహాధ్యక్షుసత్కీర్తులన్.

వ్యాఖ్య :- ఓ చంద్రా! నీ మేని అంకమును హరించుటకై తపమాచరించు చుంటివి కాని, నృసింహుని సత్కీర్తులను ఆశ్రయించవచ్చును కదా. ఇందు మృదుపద బంధములతో, "మహానటజటా దీర్ఘాట వీ వాటి" వంటి దీర్ఘ సమాసములు ప్రయోగించుట వలన ఇట పాంచాలి వృత్తి.

ఉ. పాక ముదీరితార్థపరిపాక మనం దగు; నందు గోస్తనీ
పాకము నారికేళఫలపాక మనన్ ద్వివిధంబు; గోస్తనీ
పాకము సంవృతార్థ పరిపాకనివేద్యము; నారికేళపా
కాకలనంబు గూఢ నిబిడార్థవిచార్యము; వీనిలక్ష్యముల్.

వ్యాఖ్య :- భావబోధకత్వమును బట్టి పాకము రెండు విధములుగా విభజింప వచ్చును. ద్రాక్షాపాకము (గోస్తనీ పాకము), నారికేళ పాకము. ద్రాక్షా పాకమనగా భావము బహిస్ఫుటముగాక సుబోధకమైనది నారికేళ పాకము నందు భావము గూఢముగా నుండును ఇట అర్థము అను పదమునకు భావమని గ్రహింప వలయును.

ద్రాక్షా పాకము :—

క. వాలికలై వెలిదమ్ముల
పోలికలై చందమామపులుc గులుకును దా

మేలికలైన నిరీక్షణ
మాలికల నృసింహుఁ జూచె మదవతి వేడ్కన్. 86

వ్యాఖ్య :- ఇందు నృసింహుని చూచుచున్న మదవతియొక్క చూపు లను వర్ణించెను. ఇట భావము సుబోధకముగా నుండుటచే నిది ద్రాక్ష పాకము.

నారికేళపాకము :—

మ. వరభూషాదులపై మనంబిడక దృగ్వ్యాపార మింతేఁబర
స్పరసందర్శనాతిభిన్న మయి చూపట్టంగఁ గార్యాంతర
స్మరణం బేమియు లేక నిశ్చలత నీసాంగత్యముం గోరి మా
హరిణీలోచన యాత్మయందు నరసింహా నిన్న భావించెరా!

వ్యాఖ్య :- మా చెలికత్తె తన మనస్సును ధనకనక వస్తువాహ నాదులపై పోనీక, పరస్పర సందర్శనాతి భిన్నము కానిది కాగా కార్యాం తర స్మరణము లేనిదై యుండెను. అర్థము స్పష్టముగా గోచరింపక క్లేశ ముగా నుండుటచే నిది నారికేళపాకము.

క. కదిసి పదంబులు ముందటి
పదములతోఁ బరమమైత్రిఁ బరఁగి పరస్పరదా
స్పద మన కుండినఁ గృతులం
దది శయ్య; తదీయలక్ష్య మాపాదింతున్. 88

వ్యాఖ్య :- ఒక పదమునకు ముందటి పదముతో కూర్పు మైత్రియే శయ్య. అనగా ఏ పదము తరువాత ఏ పదమును కూర్చిన సౌందర్యము కలుగునో అట్టిమైత్రి శయ్య అని భావము. రీతులయందు పదములు మార్చి నను సౌందర్యము చెడదు. శయ్య యందు పదముల మార్పు పొసగదు.

క. రతిపతివో చెలువున భా
రతిపతివో సుతగుణాభిరామత రామ
క్షితిపతివో ధర నోట
క్షితిపతివరసింహా శౌర్యజితనరసింహా! 89

వ్యాఖ్య :- ఓ నరసింహా నీవు రతిపతివా, భారతి పతివో, రామ క్షితిపతివో, జోదక్షితిపతివో అని అను ప్రాసభూయిష్ఠమైన శబ్దములను ప్రయోగించి శయ్యా సౌందర్యమును సాధించెను.

## కావ్య విశేషములు

తే. ఇట్లు కావ్యస్వరూపంబు నేర్పరించి
యింకఁ గావ్యవిశేషము లెప్పెంగ దెలుతు
నటనకటుధూర్జటిజటాగ్రచటులసింధు
ఘుమఘుమారంభగంభీరగుంభనముల. 90

వ్యాఖ్య :- ఈ విధముగా కావ్య స్వరూపమును తెలియజెప్పిన పిదప కావ్య విశేషములను తెల్పెదను.

తే. వ్యంగ్యము ప్రధానమైనను నప్రధాన
మైన నస్ఫుటమైన గావ్యము త్రిసంఖ్య
నమరు నుత్తమమధ్యమాధమములై, ధ్వని గు
ణీభూతవ్యంగ్యమును జిత్రమై తనరి

వ్యాఖ్య :- వ్యంగ్యము ప్రధానమైన కావ్యము ఉత్తమ కావ్యము. వ్యంగ్యము అప్రధానమైన (వాచ్యము ప్రధానమైనది) మధ్యమ కావ్యము వ్యంగ్యము అస్ఫుటముగా లేనిది అధమ కావ్యము.

ధ్వని:-

సీ. తల యెత్తుకొనఁగల్గెఁ గులమువారలలోనఁ
బడినట్టి శిరముల పాఁపఱేని;
కనువుమచ్ఛాయావిహార మందఁగఁ గల్గె
జిమ్మచీఁకటిమ్రింగు నమ్మికాని;
కమృతాబ్ధిలో నిద్ర యొనరింపఁగఁ గల్గె
వెలిదమ్మిపాకిఁటి వేల్పుసామి;
కల మహానటజటావలభి నుండఁగఁ గల్గె
నెలకొన్న చల్లనివెలుఁగువాని;
తే. కవుర! భువనాతిశాయియై భవవిభూతిఁ
బూని జగదేకజేగీయమానుఁడైన
యోబభూపాలునరసింహుఁ డుర్వియందు
నవతరించి శుభస్ఫూర్తి నతిశయిల్ల. 92

వ్యాఖ్య : ఆదిశేషుడు తన కులము వారిలో తలయెత్తుకొని విశ్రాంతిగా తిరుగుచుండెను. సూర్యునకు ఛాయదేవితో విహారము చేయగలిగెను. విష్ణువు పాలసముద్రంలో విశ్రాంతిగా నిద్రించగల్గెను. చంద్రుడు శివుని జటాజూటములో విశ్రాంతిగా నుండగలిగెను. నరసరాజు భూమియందు అవతరించుటచే వీరందరికి విశ్రాంతి చిక్కెను అనుటలో నరసరాజు భూభారమును వహించుటవలనే శేషుడు, సూర్యుడు, విష్ణువు, చంద్రుడులకు విశ్రాంతి లభించినదని భావము."

తే. ఇందుఁ "దలయెత్తుకొనఁ గల్గె దందశూక
పతికి" నన నారసింహభూపాలుఁ డుర్వి

తాల్చె నను వ్యంగ్య మాదియా ధ్వనులు దోఁచఁ
దనరు నుత్తమ కావ్యమై ధ్వని యనంగ. 93

వ్యాఖ్య : నరసరాజు భూభారమును వహించుటవలన ఆదిశేషుడు తన తలపై నున్న భారము తగ్గి తలయెత్తుకొనగలిగెను ప్రతాపమును వహించుటచే సూర్యునకు, ఆర్తరక్షణ వహించుటచే విష్ణువునకు, కీర్తిని వ్యాపింపచేయుటచే చంద్రునకు విశ్రాంతి లభించినదను వ్యంగ్యం గోచరించుటచే ఇది ఉత్తమ కావ్యమునకు ఉదాహరణ.

గుణీకృతవ్యంగ్యము :-

క. కొలు వాన మొసఁగి సురగవి
వెలికిలఁబడు; గల్పతరువు వేఁడిన మఱి యా
కులపడి పండ్లిగిలించును;
వలువుగ నినుఁ బోలఁగలవె నరసింహనృపా. 94

వ్యాఖ్య : ఓ నరనాథా కామధేనువు తన్నుకొలుచువారికి వెలికిల బడును. (పొమగు చూపును) కల్పతరువు తన్ను వేడుటకు వచ్చిన వారిని చూచి అకులపడి (ఆకులను రాల్చి) పండ్లిగిలించును (పండ్లను రాల్చును) కావున అవి నిన్ను పోలగలవా.

క. "నినుఁ బోలఁగలదె సురతరు"
వను నెడ లే దనెడి వ్యంగ్య మరయఁగ వాచ్యం
బున కెక్కుడు [illegible]
దనరు నిది గుణీకృతవ్యంగ్యంబై. 95

వ్యాఖ్య : ఇది "పోలఁగలదే సురతరువు" అను స్థలమునందు పోలలేదు అను వ్యంగ్యము గోచరించును. వాచ్యార్థమును మించి

వ్యంగ్యార్థము గోచరించుచున్నది కావున గుణీభూత వ్యంగ్యము అనగా మధ్యమ కావ్యమునకు ఉదాహరణ.

క. చిత్రము శబ్దార్థోభయ
చిత్రము లనఁ ద్రివిధగతులఁ జెలఁగు; నదియు నం
స్ఫూర్తితమగు ముందఱ నా
చిత్రాలంకారతతులు చెప్పెడిచోటన్. 96

వ్యాఖ్య : చిత్రకావ్యము శబ్దచిత్రము, అర్థచిత్రమూ శబ్దార్థోభయ చిత్రము అని మూడు విధములు.

క. ద్వివిధం బగు ధ్వని కృతులం
దవిరళగతి లక్షణాభిధాయోజితమై
యవివక్షితవాచ్యంబును
వివక్షితాన్యపరవాచ్యవృత్తియు ననగన్. 97

వ్యాఖ్య : కావ్యములందు ధ్వని లక్షణామూలధ్వని, అభిధా మూల ధ్వని అని రెండు విధములు. లక్షణా మూల ధ్వనికి అవివక్షిత వాచ్యమనియు, అభిధామూలమునకు వివక్షితాన్య పరవాచ్యమని పేరు. అవివక్షత వాచ్యధ్వనియందు వాచ్యార్థములకు వివక్షలేదు. వివక్షితాన్య పర వాచ్య ధ్వనియందు వాచ్యార్థమున్నను వ్యంగ్యమును చమత్కరింప చేయును.

క. చను నత్యంతతిరస్కృత
మన నర్థాంతరసమేత మనఁ ద్వివిధతఁ గై
కొని; యవివక్షితవాచ్యం
బినుమడి యగు వాక్యపదము లెనసిన నదియున్. 98

వ్యాఖ్య : అవివక్షిత వాచ్యధ్వని అత్యంత తిరస్కృతి వాచ్యము

అర్థాంతరసంక్రమిత వాచ్యము అని రెండు విధములు. ఈ ద్వివిధము లైన ధ్వనులు వాక్యగతము, పదగతము అని రెండు విధములు.

చ. నరపుంగవీ విలక్షణ్యములోన 'త్రు' ధరిత్రీందిరుఁ' డన్న ధృష్టుఁ డ
న్ధ్వని యభిభూతవాచ్యముగఁ దత్ప్రథమంబు చెలంగు; 'యావ
నులు, ఘనసంగ గ్రోవ్యమానుఁ' డనం దద్యవనాళిని ద్రుంచు
నీతఁ డ,న్ధ్వని యితరార్థ సంక్రమిత వాచ్యముగాఁ గ ద్వితీయ
మింపగున్. 99

వ్యాఖ్య: నరసభూపాలుడు ధృతీందిరుడు" అనుచో అత్యంత తిరస్కృత వాచ్యమై నరసభూపాలుడు ధృష్టుడు అను వ్యంగ్యార్థము గోచరించుచున్నది "యావనుల్ మనసున గ్రోవ్యమాను" అనుచోట "నీతడు మదించిన యవనులను సంహరించునని వ్యంగ్యార్థము. ఇందు వాచ్యార్థము, అర్థాంతరమున సంక్రమించుటచే నిది అర్థాంతర

ఆరయ మఱియు వివక్షితాన్యపరవాచ్య
మనని లక్ష్యక్రమవ్యంగ్య మన నలక్షి
తక్రమవ్యంగ్య మన ద్వివిధంబు; వీని
లక్ష్యముల నేర్పరించెద లలితఫణితి. 100

వ్యాఖ్య: వివక్షితాన్యపరవాచ్య ధ్వని సంలక్ష్యక్రమ వ్యంగ్యమనియు, అసంలక్ష్య వ్యంగ్యమనియు రెండు విధములు. సంలక్ష్యక్రమ వ్యంగ్యమనగా వాచ్యార్థ వ్యంగ్యార్థముల క్రమము స్ఫుటముగా గోచరించుట. వాచ్యార్థ, వ్యంగ్యార్థముల క్రమము చాల సూక్ష్మముగా గోచరించినదో అది అసంలక్ష్యక్రమ వ్యంగ్యము.

తే. 'ఇతఁడు నరసింహరాజు' అనుచోట నిదియె వ్యంజ
కంబగుచు ధృష్టుఁ డనెడు వ్యంగ్యమును వరుసఁ

దెలుప లక్ష్యక్రమవ్యంగ్య; మిల నలక్షి
తక్రమవ్యంగ్య మిట్లు వేద్యక్రమంబు. 101

వ్యాఖ్య :- "ఇతఁడు నరసింహుఁడు" అనుచోట ముఖ్యార్థమునకు బాధ కలుగక "నరసింహ" శబ్దశక్తినిబట్టి "విష్ణువు" అను అర్థాంతరము గోచరించుచున్నది. నరసింహ పదమునకు, భూపాలుడనియు, విష్ణువనియు అర్థక్రమము గోచరించుటచే సంలక్ష్య క్రమ వ్యంగ్యము. అసంలక్షితక్రమ వ్యంగ్యమున వాచ్యార్థ, వ్యంగ్యార్థముల క్రమము గోచరింపదు.

తే. అందు లక్ష్యక్రమవ్యంగ్య మమరు శబ్ద
శక్తిమూలం బనఁగ నర్థశక్తిమూల
మన నుభయశక్తిమూలంబు ననఁ ద్రిసంఖ్య
దాల్చు; వేర్వేఱ వీనిభేదము లొనరు. 102

వ్యాఖ్య :- ఈ లక్ష్య క్రమవ్యంగ్యము శబ్దశక్తిమూల, అర్థశక్తి మూల, ఉభయశక్తిమూల అని మూడు విధములుగా నుండును.

క. తనరారు వస్తురూపం
బనఁగ నలంకారరూప మనఁగ ద్వివిధమై
ఘనవాక్యపదగతత్వం
బున నాల్గగు శబ్దశక్తిమూలము ధరణిన్. 103

వ్యాఖ్య :- శబ్దశక్తి మూలధ్వని వస్తుధ్వని (శబ్దశక్తిమూలవస్తుధ్వని) అలంకారధ్వని (శబ్దశక్తి మూలాలంకారధ్వని) అని రెండు విధములు. ఈ శబ్దశక్తిమూలధ్వని పదవాక్య భేదములచే మొత్తము నాలుగు విధములు.

సీ. సమధికం బగు నర్థశక్తిమూలము స్వతః
ప్రతిపన్నమును గవి ప్రౌఢవచన
సిద్ధంబు సుకవినిబద్ధోక్తిసిద్ధంబు
నన( ద్రిరూపం బగు; నవియు వస్తు
కలితవస్తుధ్వని యల వస్తుభవదలం
కృతిమయధ్వని యలంకృతినిరూఢ
వస్తుధ్వని యలంకృతిస్తుతాలంకృతి
ధ్వని యన నాల్గుభేదములు వరున

తే. నొక్కొకటి దాల్చు రవిసంఖ్య నొనరు నవియు(,
దనరు ముప్పదియాఱై పదప్రబంధ
వాక్యగతభేదముల నిట్లు వఱలు; నుభయ
శక్తిమూలంబు నేకమై జగతియందు. 104

వ్యాఖ్య :- స్వతసిద్ధార్థశక్తిమూల వస్తుధ్వని, స్వతఃసిద్ధము, కః ప్రౌఢ వచన సిద్ధము, సుకవి నిబద్ధోక్తము అని మూడు విధములు. ఈ మూడును ప్రత్యేకముగా వస్తుధ్వని, అలంకార ధ్వని అని రెండేసి విధములు. అందు వస్తుధ్వని వస్తుకృత వస్తుధ్వని, వస్తుకృత అలంకార ధ్వని అని రెండు విధములు. ఇట్లే అలంకార ధ్వని, అలంకారకృత వస్తుధ్వని, అలంకార కృత అలంకార ధ్వని అని రెండు విధములు. మొత్తము మూడర్థములకు పన్నెండు భేదములగును. ఈ భేదములన్నియును ఒక్కొక్కటి వాక్యగతము, పదగతము, ప్రబంధ గతము, అని మూడేసి భేదములుండును. ఇట్లు అర్థశక్తి మూలధ్వని ముప్పదియాఱు విధములు. ఉభయ శక్తి మూలము ఒక్కే విధము.

క. నలువదియొక రూపంబులఁ
బొలుపగు నీరీతి భేదముల కాస్పద మై
యల సంలక్ష్యక్రమమున
నలరెడు వ్యంగ్యంబు శేన మూపాదింతున్. 105

వ్యాఖ్య :- శబ్దశక్తి మూలధ్వని నాలుగు విధములు. అర్థశక్తి మూలధ్వని ముప్పదియారు భేదములు. ఉభయశక్తి మూలధ్వని ఏక విధము. మొత్తము సంలక్ష్యక్రమ వ్యంగ్య ధ్వనికి నలువది యొక్క భేదములు.

క. అసమవిభావాదులచే
రసధ్వని జనించువేళఁ గ్రమ మొదవమిఁ బెం
పొసఁగు నలక్ష్యక్రమమై
యొసఁగిన వ్యంగ్యంబు; దీని కిల భేదంబుల్. 106

వ్యాఖ్య :- విభావానుభావ, వ్యభిచారుల సంయోగము వలన రసము
నిష్పన్నమగును ఆ రసము వ్యక్తమగునప్పుడు వాచ్యార్థ, వ్యంగ్యార్థముల
10 క్రమము గోచరింపదు కావున రసాది ధ్వని అసంలక్ష్య క్రమ వ్యంగ్య
మగును.

పదవాక్యవర్ణరచనా
పదైకదేశములఁ గృతులఁ బరఁగుచు నౌరా!
యిది కూడ, నలువదేడగుఁ
బదిలముగ వివక్షితాన్యపరవాచ్య మిలన్. 107

వ్యాఖ్య :- అసంలక్ష్య క్రమ వ్యంగ్యము పదగతము, వాక్య గతము, వర్ణగతము, రచనాగతము, పదైక దేశగతము, ప్రబంధగతము, (కావ్యగతము) అని ఆరువిధములు. సంలక్ష్య క్రమ వ్యంగ్యము నలువది యొక్క భేదములు, అసంలక్ష్య క్రమ వ్యంగ్యము ఆరు విధములు మొత్తము వివక్షతాన్య పరవాచ్య ధ్వని నలువదేడు భేదములు.

క. మును నవివక్షితవాచ్యం
బునఁ గలిగిన నాల్గుభేదములు నివి గూడఁగ
దనరుఁ గృతి జీవశుద్ధ
ధ్వని యేకశతార్థభేదసంతం బగుచున్. 108

వ్యాఖ్య :- అవివక్షిత వాచ్యధ్వని నాలుగు విధములు. అవివక్షిత వాచ్యధ్వని, వివక్షితాన్యపర వాచ్యధ్వని భేదములు కలసి ఏబది యొక్క భేదములగును. ఇవి శుద్ధభేదములు (అసంకీర్ణధ్వనులు)

క. ప్రకృతంబు లైన యీధ్వను
లొకటొకటిం గూడ నేఁబదొక భేదములం
బ్రకటిత మగుఁ బ్రాగ్భేదం;
బకట! ద్వితీయంబు నేఁబ దగు నిరతిన్. 109

వ్యాఖ్య :- ఈ యేబది ఒక్క భేదములలోను ఒక్కొక్క దానితో, వేఱొక్క దానికి సంబంధము కల్పించినచో ఎక్కువ భేదములు కలుగును. అప్పుడు మొదటి భేదము ఏబది యొక్క విధములు. రెండవది ఏబది భేదములు అగును.

క. కృతి నన్నియు నేకైకో
న్నతసముచితసంఖ్య గైకొనఁగ మిశ్రంబుల్
క్షితి షడ్వింశత్యుత్తర
శతత్రయాన్వితసహస్రసంఖ్యఁ జెలంగున్. 110

వ్యాఖ్య :- అవివక్షిత వాచ్యధ్వనికి, వివక్షితాన్య వరవాచ్యధ్వనితో గాని, వివక్షితాన్య పర వాచ్యధ్వనికి అవివక్షిత వాచ్యధ్వనితోగాని, వస్తు ధ్వనికి అలంకార ధ్వనితోగాని, అలంకారధ్వనికి వస్తుధ్వనితోగాని సంబంధము కలిగిన భేదములు అభిన్నములు కావున ధ్వని భేదములు 1326 మాత్రమే అగును.

తే. త్రివిధ మగు సంకరమున సంసృష్టిచేత
నొకటొకటి నాలుగై యివి యొప్పువిూఱు
నవనిఁ జతుర త్తరశతత్రయాభిరామ
పంచదశశతభేదప్రపంచగరిమ. 111

వ్యాఖ్య : ఈ 1326 ధ్వనులు త్రివిధమగు సంకరముచే (సందేహ సంకరము, అనుగ్రాహ్యానుగ్రాహక సంకరము) ఏక వ్యంజకానుప్రవేశ సంకరము, ఏక విధమగు సంసృష్టిచే నాలుగురెట్లయి ధ్వని 5304 భేదములగుచున్నవి.

క. ఎన్నిక వీనికి లక్ష్యము
లన్నిటికి నొనర్పఁ జాల వగు ననుభీతిన్
గొన్నిటి కొనర్తు; వినుఁడు ప్ర
సన్నులనన్న వచోవిచారధురీణుల్. 112

వ్యాఖ్య : స్పష్టము

అత్యంతా తిరస్కృతావివక్షితవాచ్యధ్వని :-

క. ఖరఖురకుట్టనఘట్టిత
ధరణీరజస్స్థగితసద్ఘశతామదవిచల
త్తరతరతురగోత్కర మై
కర మమరు నృసింహధాటి కాహాయ మవనిన్. 113

వ్యాఖ్య : నరసరాజు యుద్ధాశ్వములు తమ గిట్టలచే భూమి దుమ్మును ఎగరగొట్టి సూర్యుని గుఱ్ఱములను కప్పివేచి వాని గర్వమును హరించుచున్నవి. ఇట వాచ్యార్థము పొసగుటలేదు. భూమిపై సంచరించు గుఱ్ఱములు, సూర్యాశ్వములను ఎదిరించలేవు. కావున వాచ్యార్థము తిరస్కరించి వ్యంగ్యార్థమున నరుసరాశ్వములు యుద్ధరంగమున అతి సాహస

ముతో తిరుగుచున్నవి అను భావము వ్యక్తమగుచున్నది. కావున ఇది అత్యంత తిరస్కృతావివక్షిత వాచ్యధ్వని.

క. "ఖరఖురకుట్టనఘుట్టిత
ధరణీరజస్స్థగితసమస్తశతాంగధ్వవిచల
త్ఖగకరతురగం" బను నిడఁ
దిరస్కృతస్వార్థమగు నది బహువ్రీహిన్. 114

వ్యాఖ్య: ఖరఖురపుటగోత్కరమై అనుచో బహువ్రీహిని గ్రహించినచో వాచ్యపద్ధతినే అర్థము సిద్ధించును.

అర్థాంతరసంక్రమితావివక్షిత వాచ్యధ్వని:-

ఉ. ఇంద్రసుతుండు జయించినరసేంద్రుఁడు డోకమ్మనమత్స్య యం
త్రముగ్, నాంద్రవిరూషి చేసె నని సంతతము న్వని త త్త
ఱంచి మ, త్స్యేంద్రుఁడు యోగముద్ర ధరియించి చరింపఁ
దొడంగు నారసి! వి, న్నంద్రజవంబున న్వపిన శైలగుహాగహ
నాంతరంబులన్. 115

వ్యాఖ్య: అర్జునుని వలె నరసేంద్రుడు మత్స్య యంత్రమును గొట్టగా మత్స్యదేశాధీశుడు యోగముద్రను వహించి పర్వతారణ్యముల సంచరించుచుండెను.

తే. "నరసభూభర్త మత్స్యయంత్రంబు నేయ
[illegible] వాత్మమత్స్య
[illegible] నవను
[illegible] 116

వ్యాఖ్య: [illegible] పినవు, మత్స్య దేశము
అను అర్థము [illegible] మత్స్యయంత్రమును గొట్టగామత్స్య

రాజు భయపడెను అని అర్ధము గోచరించుచున్నది. మత్స్యేంద్ర శబ్ద ములో వాచ్యార్థము మత్స్య దేశమనియు, వ్యంగ్యార్థము మీనము, మీనము లకు రాజు అని వ్యంగ్యార్థము గోచరించుచున్నది. ఇట వాచ్యార్థమును తెలుపుటకు అనావశ్యమగు పదములతో గూడి విశేషార్థము గోచరించుట వలన అర్థాంతర సంక్రమితా వివక్షిత వాచ్య ధ్వని యగుచున్నది.

శబ్దశక్తిమూలాలంకారధ్వని :—

క. ఈకోమలి పద్మిని యఁట!
యేకాలముఁ బ్రోచువినుఁడ వీ వఁట! సతి! తా
నీకరసంస్పర్శనహీన
గాక చెలంగునె నృసింహ ఘనబలసింహా! 117

వ్యాఖ్య : ఈ కోమలి పద్మినీ జాతి స్త్రీ. నీవు ఎల్లకాలము రక్షించు ప్రభువు. నీ కరస్పర్శ లేకుండగా ఆమె ఎట్లు జీవించగలదు అని వాచ్యార్థము తెలియుచున్నది.

పద్మిని, ఇన శబ్దములచే వ్యంగ్యార్థము గోచరింపగా ఈ తామర తీగసూర్యుడువైన నీ కిరణముల స్పర్శ లేనిదే జీవించ లేదు కదా అని భావము.

తే. ఇందుఁ బ్రకృతంబు లగు వధూనృపతివాచ
కంబు లల పద్మినీనశబ్దంబు లెలమిఁ
గమలినీభాస్కరులఁ దెల్పఁ గలుగునుపమ
వ్యంగ్యముగ నీయలంకృతిధ్వని చెలంగు. 11

వ్యాఖ్య : ఇట పద్మినీ, ఇన శబ్దములు.... వాచ్యార్థమున పద్మినీ జాతి స్త్రీ యనియు, ప్రభువనియు వాచ్యార్థములు గోచరించిన పిదప వ్యంగ్యార్థమును పద్మము సూర్యుడు అను అర్థములు స్ఫురించుచున్నవి.

ఇట వ్యంగ్యార్థమున తామరతీగను సూర్యుడు తన కరస్పర్శచే వెలయించినట్లుగా నీవును హస్తస్పర్శచే ఈ కోమలిని విలసిల్లజేయుము అని ఉపమానము గోచరించుటచే శబ్దశక్తిమూల అలంకార ధ్వని అగుచున్నది. ఇట ఉపమాలంకారమే గాక ఇతర అలంకారములు గూడ గోచరించవచ్చును.

శబ్దశక్తిమూలవస్తుకృతవస్తుధ్వని :-

క. ఆపన్నులార! చెప్పెద
మీపాలిటికిని హితంబు; మెఱయున్నృసింహ
శ్రీపాదకమలసేవా
వ్యాపారము మఱవకుండుఁ డాత్మలలోనన్. 119

వ్యాఖ్య : ఓ ఆపన్నులార! మీరు నరస భూపాలుని పాదపద్మముల సేవను ఆత్మతో మరవకుంటినట్లయిన హితము కలుగును అని వాచ్యార్థము.

ఓ ఆపన్నులార! మీరు నృసింహుని పాదపద్మముల సేవను ఆత్మలో మరవకుండినట్టయిన హితము కలుగును అని వ్యంగ్యార్థము.

తే. ఇచ్చట "నృసింహపదసేవ నెనయుఁ" డనెడు
శబ్దశక్తిని ప్రకృతుఁ డౌ జనవరేంద్రుఁ
గొలువుఁ డతఁ డాపదలు మాన్చుఁ గొలుచువారి
కనెడు వస్తువు వ్యంగ్యమై యతిశయిల్లు. 120

వ్యాఖ్య : "నృసింహ పదసేవ" అను వస్తువుచే ప్రకృతుడగు నరసభూపాలుని కొలిచినచో ఆపదలు పోవును అను వస్తువు వ్యంగ్యమై భాసిల్లుచున్నది కాన ఇది శబ్దశక్తి మూలవస్తుకృత వస్తు ధ్వని.

స్వతస్సిద్ధార్థశక్తిమూలవస్తుకృతవస్తుధ్వని:—

ఉ. చల్లనివాఁడుమానెలవుచందురుమామకడంగి వేఁడుముల్
చల్లనివాఁడు మాయచటిచందన శైలనమీరుఁ డంచుఁ ద
ద్భిల్లవధూమతల్లికలఁ బేర్కొని పల్కు నృసింహమేదినీ
వల్లభ! నీవిరోధినృపవల్లభ దుర్లభశైలవాస యై 121

వ్యాఖ్య :- ఓ నరస రాజా నీ విరోధి భార్య అరణ్యమున పర్వతముపై నివసించుచు, అచటి కిరాత స్త్రీలతో మా ఊరిలోనున్న చంద్రుడు చల్లని వాడు, అచటి మలయ మారుతములు చల్లనివి అని పలుకుచున్నది.

ఉ. 'చల్లనివాఁడుమా నెలవుచందురుమాము'యటన్నఁదద్విప
ద్వల్లభమార్గ్యవైభవము వ్యంగ్యము;తద్ధ్వనిచేత నాయికా
యల్లకమగ్నయానునటవ్యంగ్యము, తద్ధ్వనిచేతవ్యంగ్యమా
నెల్లవిరోధిరాజుల జయించె విభుం డనువస్తు వెంతయున్.

వ్యాఖ్య :- మా ఊరిలోని చంద్రుడు చల్లనివాడు" అని పలుకుటలో ఆమె మూర్ఖ్యమును వస్తువు వ్యంగ్యముచే తెలియుచున్నది. ఆ వ్యంగ్య వస్తువుచే నాయిక భర్తృవియోగమును అనుభవించుచున్నదని తెలియుచున్నది. ఆ వ్యంగ్యముచే నరస భూపాలుడు శత్రువులను జయించెనని తెలియుచున్నది. చల్లనివాడు చంద్రుడు, చల్లనిది మలయ పవనము మొదలగు వాని అర్థము స్వతస్సిద్ధము కాని కల్పన కాదు. కనుక ఇచట స్వతస్సిద్ధార్థమూల వస్తు కృత వస్తుధ్వని.

వస్తుకృతాలంకారధ్వని:—

మ. సలిలచ్ఛాయఁ గుటించియంత్రకృతమత్స్యం బీనృసింహ
క్షమా, తలనాథాగ్రణి యేసె నంచు విని తద్వంశాధిపుం

బట్టినన్, నలిలచ్ఛాయఁ గుఱించి యేయు నవి యంచద్భీతి
మార్తాండునిన్; బలిమిం బట్టఁడు వేగ రాహు విధునిం
బైకొన్న చందంబునన్. 123

వ్యాఖ్య :- నరసభూపాలుడు నీటిలోని నీడను జూచి మత్స్య యంత్రమును కొట్టినట్లుగా తనవంశాధిపుడగు సూర్యుని పట్టుకొనినచో, నా నీడను చూచి సంహరించునని భయపడి చంద్రుని పట్టుకొని నట్లుగా సూర్యుని పట్టుకొనదు.

తే. యంత్రమీనంబు దునుమాడినట్లు దునుము
ననియ కాఁబోలు రాహు వర్కుని గ్రహింపఁ
డనెడు నుత్ప్రేక్ష వాచకం బెనయ లేమి
వ్యంగ్య మగు నిట్టి వాక్యార్థవైభవమున. 124

వ్యాఖ్య :- యంత్రమీనము కొట్టినట్లుగా కొట్టునని రాహువు సూర్యుని పట్టుకొనడు అనుటలో ఉత్ప్రేక్షాలంకారము. ఇట "తద్భీతి" అను వస్తువుచే ఉత్ప్రేక్ష వ్యంగ్యమగుచున్నది.

అలంకారకృతధ్వని :—

ఉ. భూరిభుజాప్రతాపగుణభూషణ! యోబయనారసింహా! నీ
చారుయశోవధూమణికి సారసవైరి ముఖంబు; తారక
ల్సారసనఖాంకురంబు; లల శంకరశైలహిమాద్రు లాత్మనవ
క్షోరుహము; ల్సితాబ్జములు సొంపగులోచనపంకజాతముల్.

వ్యాఖ్య:-ఓ నరసరాజా నీ కీర్తి కాంతకు చంద్రుడు ముఖము నక్షత్రములు గోళ్ళు, కైలాస హిమవత్పర్వతములు స్తనములు, తెల్లతామర పూవులు కన్నులు.

తే. తనదు సత్కీర్తి కాంతకుఁ దారకాదు
లరయ నంబుగంబై వేడ్కఁ బరిణమింపఁ

గలుగుపరిణామమునఁ ద్రిలోకములు నిండు
నరసవిభుకీర్తి వ్యంగ్య మనం జెలంగు. 126

వ్యాఖ్య :- "నీ కీర్తి కాంతకు చంద్రుడు ముఖము, తారకలు నక్షత్రములు అని చెప్పుటచే నిట పరిణామాలంకారము దీనివలన నరన రాజు కీర్తి ముల్లోకములు తెలిసినవని వ్యంగ్యము పరిణామాలంకారముచే వస్తువు వ్యంగ్యమగుచున్నది. కావున స్వతస్సిద్ధార్థ శక్తిమూల అలంకార కృత వస్తు ధ్వని.

అలంకారకృతాలంకారధ్వని :—

చ. అరిపురభంజనోజ్జ్వల బలాధిక! శ్రీనరసింహరాజశే
ఖర! భవదీయకీర్తిరుచి గంగ యనంగఁ జెలంగుఁబొంగుచున్
హరిపదసంగసంకలితయై భువనత్రయపూర్ణయై నిరం
తరతరహంసజాంశుసముదాయసమన్వితయై వసుంధరన్. 127

వ్యాఖ్య :- ఓ నరసరాజా! నీ కీర్తి గంగవలె హరి పదమును ముట్టుచు, మూడు లోకములు నిండి, నిరంతరము హంసలతో నిండినదై ఒప్పుచున్నది.

ఇట "హంస జా" అనగా హంసల కాంతివంటి కాంతి గలదై, సూర్యుని బిడ్డయగు యమునా కాంతి సముదాయముతో అని అర్థము గలదు. యమున గంగానదితో కలియుట కలదు కదా.

తే. 'రాజశేఖర! భవదీయరమ్యకీర్తి
యొనరు నల గంగవలె' ననునుపమచేతఁ
బరఁగుదు నృసింహా! నీవు శంకరుని కరణి
నను నుపమవ్యంగ్యమా నిందు నరసిచూడ. 128

వ్యాఖ్య :- ఓ రాజా "నీ కీర్తి గంగవలె నున్నది" అనుటచే వాచ్యమగు ఉపమ వ్యక్తమగుచున్నది. దీని వలన "నీవు శంకరుని వలె

నుంటివి" అను ఉపమ వ్యంగ్యమగు చున్నది. అలంకారముచే అలంకారము ధ్వనిల్లుచున్నది కావున ఇది స్వతస్సిద్ధార్థ శక్తిమూలాలంకార కృత వస్తుధ్వని.

కవిప్రౌఢోక్తి సిద్ధార్థశక్తిమూల వస్తుకృతవస్తుధ్వని:—

సీ. ఒంటిగా మడికాసుగుంటిపైఁ గూర్చుండి
సంజకెంజాయ పెన్జడలు దాల్చి
సారిది నేకాలంబు సురనదీస్నాతుఁడై
నిద్దంపుబూది మైనిండ నలఁది
యచ్చుగాఁ బులితోలు కచ్చడంబు ఘటించి
యొడలఁ బాములు ప్రాఁక నోర్చు కలిగి
హాలాహలానలాభీలధూమము గ్రోలి
యఱచేత హవ్యవాహనముఁ బూని
గీ. నీయశోలక్ష్మిఁ బోలు పూనికలఁ దపము
నేఁడు నాచరించుచున్నాఁడు నీలగళుఁడు
కానియొడ నేల యతని కీగతిఁ జెలంగ
సరసగుణహార యోబయనరసధీర? 129

వ్యాఖ్య :- ఓ నరసరాజా! పరమేశ్వరుడు ఒంటరిగా కైలాస గిరిపై కూర్చుండి సంజకెంజాయ జడలు ధరించి గంగానది స్నానము చేయుచు, శరీరమునిండా బూదిదను పూసికొని, పులితోలు ధరించి, శరీరముపై పాములు ప్రాకుచున్నను ఓర్చుకొని, హాలాహల రూపమగు పొగను త్రాగి, అగ్నిని చేతబట్టుకొని, నీ యశోలక్ష్మినిపొందుటకై తపము చేయుచున్నాడు.

క. 'నరసవిభుకీర్తిఁ బోలఁగ
హరుఁడు దపము సేయుచుండు' నను వస్తువుచే
సరిగా దాతనికీర్తికి
హరుఁడును నను వస్తు వఱువ వ్యంగ్యం బగుచున్. 130

వ్యాఖ్య :- నరస విభుని కీర్తిని పొందుటకై పరమేశ్వరుడు తపస్సు చేయుచున్నాడు అను వస్తువుచే శివుడు కూడా నరసవిభుని కీర్తికి పోలడు అను వ్యంగ్యము గోచరించు చున్నది. శివుడు తపస్సుచేయుట స్వతసిద్ధము. కవి ఆ తపస్సు చేయుట నరసవిభుని కీర్తిని పొందుటకై అని కల్పితము. కావున ఇట కవిప్రౌఢోక్తి సిద్ధార్థ శక్తి మూలవస్తుకృత వస్తుధ్వని. ప్రౌఢోక్తి అన కవికల్పితోక్తి అని అర్థము

కవిప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలవస్తుకృతాలంకారధ్వని:—

క. మేలిమి నృసింహాధరణీ
పాలు ప్రతాపాగ్ని దిశలఁ బ్రబలినఁ గీలా
భీలదవానల మడవుల
పాలయ్యె; జ్జలధిఁ బడియె బడబానలమున్. 131

వ్యాఖ్య :- నరస భూపాలుని ప్రతాపాగ్ని నలుదిశల వ్యాపించుటచే దావాగ్ని అడవుల పాలయ్యెను, బడబాగ్ని సముద్రము పాలయ్యెను.

క. 'జనపతిప్రతాప మమరఁగ
వనవాటికి నరిగె దావవహ్ని' యనఁడిచో
మనమునఁ గలఁగియునుం బతె
ననియెడు నుత్ప్రేక్ష వ్యంగ్యమగు వస్తువుచేన్. 132

వ్యాఖ్య :- నరస విభుని ప్రతాపాగ్నికి కలతచెంది దావాగ్ని అడవుల పాలయ్యెను అనుట వలన "దావాగ్ని కలత చెందినట్లు" అను

వ్యాఖ్య :- నృసింహ ప్రభుని దానజల ప్రవాహములు సముద్రములో పడుటచే వర్షాకాలమనియు, యశస్సు మేఘముల చేరుటచే శరత్కాలమనియు విష్ణువు ఏకకాలమున వర్షాకాల, శరత్కాల భ్రాంతిని పొంది నిద్రా ప్రబోధములు పొందుచుండెను.

తే. 'హరికి వర్షాశరద్భ్రాంతి యొసఁగె'ననెడి
భ్రాంతిమదలంక్రియారూఢిఁ బ్రబలు నిద్రఁ
దెలివి నున్నట్లు యోగనిద్రలు వహించు
ననెడి యుత్ప్రేక్ష వ్యంగ్యమై యతిశయిల్లు. 136

హరికి వర్షాకాల, శరత్కాల భ్రాంతి ఏకకాలమున కలిగెను అనుటచే భ్రాంతి మదలంకారము. దీనివలన విష్ణువు తెలివితో కూడిన యోగనిద్రలో నున్నట్లుగా, అను ఉత్ప్రేక్ష వ్యంగ్యముచే గోచరించుచున్నది.

కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలవస్తుకృతవస్తుధ్వని:

మ. అనురాగాంబుధి యుబ్బి వెల్వడినయట్లాపూర్ణ
ఘర్మాంబువుల్
దనువల్లిం దిగజాఱఁ గన్నుఁగవ లేఁదళ్కుల్ప్రసారించుచున్
ననవిల్కానిపురప్రవేశకలనానాళీక దామంబులై
తనరం గోమలి నిన్నుఁ జూచె నరసేంద్రా సాంద్రతేజోనిధీ!

వ్యాఖ్య :- ఓ నరసేంద్ర ఆ కోమలి అనురాగాంబుధిలో మునిగి తేలినట్లుగా ఘర్మాంబువులు దిగజారుచున్నవి. కనులు తళుకులు కనబడుచు, మన్మథుని గృహ ప్రవేశమును గోరి నిన్ను చూచున్నది.

క. ఈవాక్యార్థముచేతను
'భూవల్లభ! నిన్నుఁ గోరి పొలఁతి విరహతా
పావృత్తి నున్న దిపు' డను
నావస్తువు వ్యంగ్య మగుచు నతిశయ మొందున్. 138

వ్యాఖ్య :- ఈ పై పద్యముచే ఈ కోమలి నిన్ను కోరి విరహతాప మున నున్నది అనువస్తువు వ్యంగ్యముచే తెలియుచున్నది. "మేనెల్ల చెమ ర్చెను" అను వస్తువుచే విరహతప్తగాత్రలయి ఉన్నది అను వస్తువు వ్యంగ్య ముచే ప్రతిపాదిత మగుచున్నది. కావున ఇచట కవినిబద్ధవక్తృప్రౌఢోక్తి సిద్ధార్థ శక్తిమూల వస్తుకృత వస్తుధ్వని గోచరించుచున్నది.

కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూల వస్తు
కృతాలంకారధ్వని:-

చ. సురగిరిచుట్టునుం బవరిచుట్టెద వేల దినేశ? రత్నసం
భరితము దేవతాధనముఁ బాయక కాచెద నంచు నేఁటికిన్
సురతరులంగరాంగుళులఁజొప్పడఁదాల్చియశోఽభ్రగంగచేఁ
బరఁగి నృసింహుఁడే విబుధపంక్తులఁ బ్రోవ నిదేల యేరికిన్।

వ్యాఖ్య :- ఓ సూర్యుడా! దేవతల ధనమును కాపాడుటకై ప్రతి దినము మేరు పర్వతము చుట్టును ప్రదక్షిణములు చేయుట ఎందులకు ఆ ధనమును ఎవరికి కావలయును, మా నరస విభుడు చేతివేళ్ళకు కల్ప వృక్షములు తగిలించు కొనెను. కీర్తి గంగను ధరించెను, సుకవి పంక్తు లను పోషించెను. ఇంతకన్న మేరువు మాత్రము ఏమి చేయగలదు.

క. తన రెడు నీవాక్యార్థం
బున "శ్రీనరసింహుఁడఖిలమును బ్రోవఁగ నా
యనిమిషగిరివలెఁ దగు" నను
ననుపమ మగు నుపమ వ్యంగ్యమై పొగ డొందున్. 140

వ్యాఖ్య :- ఈ పై పద్యముచే నరసింహుడు అఖిల లోకములను మేరు పర్వతమువలెె రక్షించు గుణము కలవాడు అను ఉపమానము వ్యక్తమగుచున్నది ఇట వస్తు కృతమైన అలంకారముచే వ్యంగ్యము

ధ్వనించుచున్నది కావున యిది కవినిబద్ధ వక్తృ ప్రౌఢోక్తి సిద్ధార్థ శక్తి మూల వస్తుకృత అలంకార ధ్వని.

కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలాలంకార కృత వస్తుధ్వని

చ. ధరణి ననంతకీర్తియుఁ బ్రతాపముఁ గల్గిన రాజవాటనిన్
దరుణి మనోఽరవిందమునఁ దాల్చిన చుట్టుఁ గంబుపేర్మినో
కరివరయానకు స్విశద కాంతియుఁ గాఁకయు నై కడంగి బి
త్తరమగు మేనఁ గీర్తియుఁ బ్రతాపము నిల్చె నృసింహ
భూవరా. 141

వ్యాఖ్య :- ఒక దూతిక నరసరాజుతో ఈ విధముగా పలుకు చున్నది. కీర్తి ప్రతాపములు గల నిన్ను మనస్సునందు దాల్చుట చేత కాబోలు రమణికి దేహమున తెల్లదనము, వేడిమియు కలిగినవి.

తే. "నెఱయు కీర్తిప్రతాపాఢ్యు నిన్నుఁ దలఁప
యశము శౌర్యంబు గలిగిన ట్లలరు చెలరు
గాఁకయును" నను నుత్ప్రేక్షఁ గాంత నేలు
విరహమున కోర్వ దను వ్యంగ్యవిభవ మలరు. 142

వ్యాఖ్య : "విన్నఁదలఁప యశము, శౌర్యము గలిగినట్లలరు" అను ఉత్ప్రేక్షాలంకారముచే ఆమె విరహ తాపముచే బాధింపడుచున్నది అను వస్తువు వ్యంగ్యమగుచున్నది. అలంకారకృత వస్తుధ్వని.

కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలాలంకారకృతాలంకారధ్వని:-

చ. చెలువ! యదేమి యాముగువ చిత్రమునందు నృసింహభూ
వరుం, గలయ లిఖించు వేళఁ బులకంబులుఁ గ్రొంజెమరుం దలి

ర్పఁగా, నొలయు వడంకుచున్నది; సముజ్జ్వలమైన నృపాల
రూపముక్, వలపులు రేఁచుచున్నరతివల్లభరూపని భీతి
జెందెనో. 143

వ్యాఖ్య : ఓ చెలియా! నరసరాజు చిత్రము లిఖించుచున్నప్పుడు మన చేతిహస్తము వడంకుచున్నది. దేహము చెమర్చుచు పులకరించుచున్నది. ఆ నృపాలుని రూపము రతివల్లభుని రూపమని భీతి చెందుచున్నదో అని ఒక చెలియతోటి చెలికత్తెతో పలుకుచున్నది.

క. "వరుని లిఖించుచు వడఁకెడి
సరోజశరుఁ డనియొ" యనెడి సందేహమున
స్మరసింహాఁడు మరుకై వడిఁ
బరఁగు ననెడి యుపమ వ్యంగ్య భావము నొందున్. 144

వ్యాఖ్య :- వరుని లిఖించుచు వడకుటచే మన్మధుడను సందేహము కలుగుటచే ఆ సందేహాలంకారముచే నరసరాజుమన్మధుడనెడుఉపమానము వ్యంగ్యము గోచరించుచున్నది. అలంకారముచే అలంకారము ధ్వనించుచున్నది. కావున ఇట కలినబద్ధ వక్తృ ప్రౌఢోక్తి సిద్ధార్థ శక్తి మూలాలంకార కృతాలంకార ధ్వని కలుగుచున్నది.

క. ఈవరుసఁ బ్రబంధాదిగ
తావేలధ్వనులు బుద్ధి ననుమేయయములౌ;
నావల రసధ్వనులు రస
భావప్రకరణములం బ్రపంచితము లగున్. 145

వ్యాఖ్య : ఈ విధముగ ప్రబంధగత ధ్వనులు ఊహించు కొనవలయును. రసధ్వనులు రసభావ ప్రకరణమున చెప్పబడును.

తే. ఇచట మధ్యమకావ్యమైః రుచిరమగు గు
ణీకృతవ్యంగ్య విభవంబు నిశ్చయింతు;

నిదియు నెనిమిది భేదంబు లెనయు; వీని
భవ్యనామంబు లెఱిఁగింతుఁ బ్రక్రమమున. 146

వ్యాఖ్య : మధ్యమ కావ్యమగు గుణీకృత వ్యంగ్యము ఎనిమిది విధములు. గుణీకృత వ్యంగ్యమనగా వాచ్యార్థము ప్రధానముగా నుండి, వ్యంగ్యార్థము అప్రధానముగా నుండును.

క. అమరు నగూఢము నపరాం
గము వాచ్యాంగంబు నప్రకాశము సంది
గ్ధము నల తుల్యప్రాధా
న్యము కాక్వాక్షిప్త మరుచి రాఖ్యము ననఁగన్. 147

వ్యాఖ్య :- అగూఢము, అపరాంగము, వాచ్యాంగము, అప్రకాశము, సందిగ్ధము, తుల్య ప్రాధాన్యము కాక్వాక్షిప్తము, అరుచిరము అని గుణీభూత వ్యంగ్యము ఎనిమిది విధములు.

క. వనితాకుచకుంభముగతి
ధ్వని గూఢంబైనఁ గాని వైదగ్ధ్యము లే
మినిఁ దగు మధ్యము కావ్యం;
బెనిమిదివగలకు నొనర్తునిల లక్ష్యంబుల్. 148

వ్యాఖ్య : వనితాకుచములవలె ధ్వన్యర్థము కావ్యమున గూఢముగా నున్నగాని రమణీయముగా నుండదు. కొన్ని కావ్యములందు ఆ రమణీయకము తగ్గుటచే మధ్యమ కావ్యములగుచున్నవి.

అగూఢము:-

క. పరిపఠితకవాటము లై
పరిపాటితకనక కూటపటవాటములై
యరిసికరపురప్రకరము
లరుదుగ నరసింహు శౌర్య మంతయుఁ దెలుపున్. 149

వ్యాఖ్య : పడిపోయిన వాకిళ్లును, పాడింపబడిన గుడారములు కలదై సౌధశృంగములమీద చింపివేయబడిన జెండాలుగల శత్రుపట్టణములు నరసరాజు శౌర్యమును చాటుచున్నవి.

క. "పరిపతితకవాటములై
యరిపురములు దెలుపు శౌర్యమంతయు" ననుచో
నరివరుల గెలిచె విభుఁడని
పరఁగెడి వ్యంగ్యం బగూఢభావము జెందున్. 150

వ్యాఖ్య : "పడిపోయిన గృహములు నీ శౌర్యము తెలుపుచున్నవి" అను వాచ్యార్థముచే నరసభూపాలుడు శత్రువులను గెలిచెను అను వ్యంగ్యార్థము గూఢము లేక తెలియుచున్నది. కావున ఇట అగూఢ గృషీ-భూత వ్యంగ్యము. వ్యంగ్యము గూఢముగా లేనిది అగూఢము.

అపరాంగము :—

క. మెడ గ్రుచ్చి కౌఁగిలించుచు
నొడలెల్లం బారవశ్య మొందించు నరిన్
బడి మోహనిద్రపుచ్చును
బుడమి నృసింహేంద్రుఖడ్గపుత్రిక యౌరా. 151

వ్యాఖ్య : నరసరాజు ఖడ్గపుత్రిక శత్రువుల మెడను గృచ్చి, కౌగలించుకొని శరీరమంతయు పారవశ్యము కలిగించుచు, మోహనిద్ర పుచ్చుచున్నది.

క. రంగుగ నీయెడ ధ్వని యగు
శృంగారము రౌద్రరసవిశేషమునకుఁ దా
నంగంబై విలసిల్లుచు
సంగతి నపరాంగ మనఁగ సన్నుతి కెక్కున్. 162

వ్యాఖ : ఇట శృంగార రసము, రౌద్రరసమునకు అంగమై భాసిల్లుచున్నది. నరసరాజు కత్తి యొక్క శృంగార చేష్టలు వర్ణించినప్పు

లోకిని, ధ్వనిచే శత్రువుయొక్క రౌద్రచేష్టలు స్ఫురించుచున్నవి. కావున ఇది అపరాంగము. రస, భావములకు రసభావాదులు అంగములయినచో అపరాంగము.

వాచ్యసిద్ధ్యంగము :-

క. ధారుణి శ్రీనరసింహుని
నీరంధ్ర ధనుర్వినీలనీరద మహురుక్
దారుణతరశరధారా
వారితరిపు శౌర్య సూర్య వైభవ మగుచున్. 153

వ్యాఖ్య : నరసరాజు ధనుస్సు అనెడి మేఘము తన శర ధారలచే, శత్రు శౌర్య రవము అనెడిసూర్యుని వైభవమును హరించుచున్నది.

క. శరధార యనఁగ ధ్వనియై
పరిణత మగు సలిలధార పార్థివుని ధను
శ్శరద మను వాచ్యమున కు
ద్వారలో నంగంబు గాఁగ వాచ్యాంగ మగున్. 154

వ్యాఖ్య : శరధార అనెడి వాచ్యార్థము వలన జలధార అనెడి వ్యంగార్థము గోచరించుచున్నది. ధనుశ్శరదము అనెడి వాచ్యార్థమునకు మేఘము అనెడి వ్యంగ్యార్థము గోచరించుచున్నది. ఈ వ్యంగ్యము లేనిచో ధనుస్సు కారుమబ్బు అనెడి రూపకము కుదరదు. కావున ఇచ్చట వ్యంగ్యము వాచ్యమునకు అంగమైనది. కాన యిది వాచ్యసిద్ధ్యంగము.

అస్ఫుటము :-

క. శ్రీ నరసింహుని భుజస
న్నావితకౌక్షేయకంబు మహీమండలిలో
నానారిపుభూనాథవి
తానార్జితకీర్తిదుగ్ధధారలు గ్రోలున్. 155

వ్యాఖ్య : నరసింహుని చేతిలోని కత్తి భూమండలములో శత్రు రాజుల కీర్తి అనెడి పాలను త్రాగుచున్నది

క. "అరికీర్తిదుగ్ధమాను
ధరణీశ్వరుఖడ్గ" మనుడు దర్వీకరశే
ఖరముగఁ బోల్చ ననియెడి
సరసోపమ కృతులయందుఁ జను నస్ఫుటమై 156

వ్యాఖ్య : నరసరాజు ఖడ్గము కీర్తిదుగ్ధమును గ్రోలుచున్నది అనుట వలన నరసరాజు ఖడ్గము పామువలె నున్నది అను ఉపమ స్పష్టముగాలేదు, వ్యంగ్యము స్పష్టముగా లేకున్న అస్పష్టము.

సందిగ్ధము :-

క. నరసింహ నభంగురసం
గరమున నెదురించు రిపులు కడు ముందఱగా
నరుగుదు రాయతపడుదురు
శరములు విడుతురు సమగ్రసంభ్రమపరులై 157

వ్యాఖ్య : నరసరాజు శత్రువులు సంభ్రమముతో కూడి ముందుగానే వెళ్లి బాణములు విడుచుచున్నారు.

క. "అరివరు లాయితపడుదురు
శరజాలము విడుతు" రనిన సమరంబునకో
గిరిగుహల కరుగనో యన
నరి వ్యంగ్యము లలరుచుండు సందిగ్ధములై 158

వ్యాఖ్య : శత్రురాజులు సిద్ధపడుచున్నారు, బాణములు విడుచుచున్నారు. అనుట వలన యుద్ధరంగమునకు వెళ్ళుటకా, గిరి గుహలకు వెళ్ళుటకా? అనునది సందిగ్ధముగానున్నది అదియో, ఇదియో నిశ్చయింప వీలుకానిది సందిగ్ధము.

తుల్యప్రాధాన్యము :—

క. నరసింహేంద్రుని చరణా
రుణంబుగ సంఘటింపుఁ డరులార! భవ
ద్వరమకుటస్ఫురణంబుల
నరుణం బగు నతనినయన మటు గాకున్నన్. 159

వ్యాఖ్య : ఓ శత్రువులారా, మీ కిరీట కాంతులచే నరసరాజు పాదములను ఎఱ్ఱగా చేయుడు, అటులకాదేని అతని కన్నెఱ్ఱబడును.

క. 'నరసింహేంద్రునకు నమ
స్కరణం బొనరింప కున్నఁ గాంతారంబే
శరణం బగు' నను వ్యంగ్యము
నిరవగు వాచ్యంబు సమము లిచ్చటఁ దలఁపన్. 160

వ్యాఖ్య :- నరసింహేంద్రునకు నమస్కరింపనిచో మీకు అరణ్యమే గతియగును అను వ్యంగ్యార్థము, నరసభూపాలుని పాదములను మీ కిరీటముచే ఎఱ్ఱగా చేయుడు అను వాచ్యార్థము సమానముగనే ఉన్నది. వాచ్య, వ్యంగ్యముల ప్రాధాన్యము సరిసమానముగ నుండిన తుల్య ప్రాధాన్యము.

కాకాక్షిప్తము:—

క. ఒసంగునెడఁ గసరు గర్జిలు
నొసఁగి యొసఁగి వెల్లఁబాఱు నొగి నీకరణిన్
విసువక యొసఁగఁగ నేర్చునె
యసదృశగతి నంబువాహ మాబళిసరసా. 161

వ్యాఖ్య :- మేఘము దానము చేయుచు గర్జించును, దానము చేసి, చేసి, తెల్లబోవుచుండును, కావున మేఘము నీ వలెనే దానము చేయగలదా.

క. 'ఒసఁగు నెడఁ గసరు గర్జిలు
నెసఁగఁగ నీలాంబువాహ మిల నీవలెఁ దా
నొసఁగఁగ నేర్చునె' యనవుడు
నొసఁగఁగ లే దనెడి వ్యంగ్య మొగిఁ గాకు వగున్. 162

వ్యాఖ్య :- మేఘము నీ వలెనే దానము చేయగలదా అనగా, దానము చేయలేదని వ్యంగ్యార్థము. ఇట వాచ్యార్థముతో బాటుగా, వ్యంగ్యార్థము స్ఫురించుచున్నది కావున ఇట కాక్వాక్షిప్తము.

అరుచిరము :—

మ. బలితంబైన మనోజబాణహతిచేఁ బల్మాఱు నిల్పోవ రే
కలిసీలాలక ప్రాణము ల్వెడలి నేత్రాంభోజమార్గంబునం
గలయం బ్రాఁకుచు వచ్చి యున్నిలవునల గన్నీటి యేఱడ్డమై
నిలుపన్నిల్చె నృసింహభూరమణ! మన్నింపఁగఁ బాడింతటన్.

వ్యాఖ్య :- నాయిక మన్మథుని బాణహతిచే ప్రాణములు నిలుపలేక, కన్నుల వెంబడి పోవుదమని చూచిన కన్నీటి ఏఱు అడ్డమై నిలిచినవి కావున ఆమెను రక్షింపవలయును.

క. 'ఏణాక్షి, రాక యున్నను
బ్రాణంబులు విడుచు,' ననెడి వ్యంగ్యంబునకున్
క్షోణి న్వాచ్యముకన్నఁ బ్ర
వీణత్వము లేమిఁ దనరు వెస నరుచిరమై. 164

వ్యాఖ్య :- ఆమె ప్రాణములు కన్నులలో పెట్టుకొన్నది, నీవు రాకపోయినచో ప్రాణములు విడుచును, అన్నది వ్యంగ్యార్థము. ఇది వాచ్యార్థము కన్న సుందరముగా లేదు కావున అరుచిరము.

తే. ఇంక( గావ్యప్రభేదంబు దేర్పరింతు
వరుస నష్టాదశవిశిష్టవర్ణనములు
గలుగవలయు మహాకావ్యతిలకమునకు
నెలమి( దన్నామధేయంబు లెట్టె వనిన. 165

వ్యాఖ్య :- అష్టాదశ వర్ణనలతో కూడిన దానిని మహాకావ్యము అందురు.

క. పురసింధునగర్త్వినశశి
సరసీవనమధురతిప్రసంగరహాముల్
పరిణయతనయోదయనయ
విరచనయాత్రాజిదౌత్యవిభువర్ణనముల్. 166

వ్యాఖ్య :- పురము, సముద్రము, శైలము, ఋతువు, సూర్యోదయము, చంద్రోదయము, సరఃక్రీడా, వనక్రీడా, వసంత, రతిప్రసంగ, విరహ, పరిణయ, పుత్రోదయ, నయ విరచన, దండ యాత్ర, యుద్ధ, దౌత్య, ప్రభువర్ణనము అనునవి అష్టాదశవర్ణనములు గల మహాకావ్యము.

తే. ఇందు నొకకొన్ని కడమైన నెంచిచూడ
నదియు నవని మహాకావ్య మన(గ( బర(గు;
మఱియు క్షుద్రప్రబంధనిర్మాణమర్మ
లక్షణము దేర్పరించెద లలితవాణి. 167

వ్యాఖ్య :- పై అష్టాదశ వర్ణనలో కొన్ని విడిచి వ్రైచినను అది మహాకావ్యమగును. క్షుద్రప్రబంధ నిర్మాణము వివరించబడుచున్నది.

క్షుద్రప్రబంధము :—

కలికోత్కలికలు పద్యము
లలరారు విభక్తులుం దదాభానయుతో

త్కలికలు నజయతిపదమా

నల మాలిని మొదలఁ దగ నుదాహరణ మగున్. 168

వ్యాఖ్య :- కళికోత్కళికలు, పద్యము, విభక్తులతో అలరారు చున్నవి. ఉత్కళికలు, విభక్త్యాభాసముతో నుండును. "జయతి" అను పదము మొదటగా గల మాలిన్యాది వృత్తములతో కూడినది ఉదాహరణ కావ్యమగును.

క. అందు విభక్త్యాభాసము
లందుఁ జతుర్థికిని దెనుఁగుదాహరణము పెం
పొందం, గలికోత్కలికల
నందీప్తవిభక్తి తాలసంప్రాసంబై. 169

వ్యాఖ్య :- అందు చతుర్థీవిభక్తి తెలుగు ఉదాహరణము తాళముతో కూడి ఉండును.

క. ముక్తపదగ్రస్తంబై
సక్తాదిమపద్యమై ససంబోధనమై
ప్రోక్త మగుఁ జక్రవాళము
ముక్తమహాధీరశబ్దమోహన మగుచున్. 170

వ్యాఖ్య :- ముక్త పద గ్రస్తమై, మొదట ఒక పద్యము గలిగి నదియు, సంబోధన సహితమునగు కావ్యము చక్రవాళము. మొదట ఒక పద్యము అనుటచే మిగిలిన కావ్యము గద్యము, ఆ గద్యము కళికలు ఆయి ఉండును.

క. ఆచక్ర వాళలక్షణ
సూచితమై బిరుదభరితశుభవాఙ్మయమై
యాచక్రవాళవిపుల
త్వోచక్రమునందు బిరుద గద్యము వొల్చున్. 171

వ్యాఖ్య :- ఆ చక్రవాళము బిరుద పదములతో కూడియున్న అది బిరుదావళి అగును.

క. తరుణీమణి శృంగారము
విరహము మధుమదనగర్వవిభవంబు సరో
వరవనఖేలనములు గల
చరయు న్మంజరి యనంగ నభినుతి కెక్కున్; 172

వ్యాఖ్య :- స్త్రీల శృంగారము, విరహము, వసంత మన్మథాదుల వైభవము, సరఃకేళి, వనకేళి మొదలగు వాని వర్ణనము మంజరీ కావ్యము.

క. తారక లిరువదియేడును
దారయు నొక్కొక్క పద్యమందుఁ జెలంగం
గూరిచిన పద్యమాలిక
తారావళి యనఁగ నభినుతంబై పొల్చున్. 173

వ్యాఖ్య :- ఒక్కొక్క పద్యమునందు ఇరువది ఏడు నక్షత్రములు వచ్చునట్లు ఇరువది ఏడు పద్యములు గల కావ్యము తారావళి.

మ. ఫణిశుంభద్భుజసార! సారసముఖీపంచాయుధాకార! శా
రణనంతత్యవతార! తారగిరిధైర్యస్థేమదుర్వార! వా
రణసద్రమాఢ్యబలభార! భారవిశ్వవిప్రౌఢోక్తిసంచార! చా
రణసంస్తుత్యవిహార! హారహారవిభారాజద్యశోవైభవా. 174

ఓష్ఠ్యము :—

క. భూమిసుమనోఽమరద్రుమ!
వామాక్షదుర్యమ్న! భానువంశోద్భవ! పౌ
లోమీవిభుశుభవైభవ!
భీమావమ! భీమభీమప్రభువోర్విభవా. 175

పంచచామరము. ఘనాఘనాఘనాశబాధికప్రదానరంజనా!
జనావనాదినాగతల్పసత్కవిప్రసాధనా!
ధనాధినాథనందనాబ్జదర్పకాంగవాసనా!
సనాతనాధునాతనాతిశౌర్యధుర్యలంఘనా. 176

గద్యము: ఇది శ్రీహనుమత్ప్రసాదలబ్ధకవితాసారసారస్వతా
లంకారనిరంకుశప్రతిభాబంధుర ప్రబంధపరనరచనాధురం
ధర ప్రబంధాంక వేంకటరాయభూషణసుపుత్త్ర తిమ్మ
రాజపౌత్త్ర సకలభాషావిశేష నిరూపమూపథాపశారదా
మూర్తిమూర్తి ప్రణీతంబైన కావ్యాలంకారసంగ్రహం
బను మహాప్రబంధంబునందు సర్వరససాధారణనాయక
వర్ణనంబును, శృంగారనాయికాఖ్యానంబును, రీతివృత్తి
ప్రశంసయుఁ, బాకశయ్యాప్రపంచనంబును, గావ్యభేద
ప్రకరణంబును, మధుకావ్యప్రకటనంబును, క్షుద్ర
ప్రబంధమార్గదర్శనంబు నన్నది ద్వితీయాశ్వాసము.

—[ 0 ]—

శ్రీ ర స్తు

# కావ్యాలంకార సంగ్రహము

## నరసభూపాలీయము

### తృతీయాశ్వాసము

క. శ్రీరమణచరణసేవా
పారాయణ! యుభయవంశపావన! లక్కాం
బారచితభాగధేయ! య
పారకృపానరస! యోబపార్థివనరసా. 1

తే. అవధరింపుము లక్ష్మలక్ష్యముల నెల్ల
ననఘ! భవదీయనామధేయాంకితముగ
బహువిధకృతుల నొనరింతుఁ బద్యవితతి
నిచ్చుటఁ; బ్రబంధజీవితం బెల్లటన్న. 2

తే. మహితకవితావిలాసినీమధురతరవి
లాసవిన్యాసములలీల వాసి కెక్క
నవరసంబుల నటింగింతు నవరసార్థ
గుంభగంభీరతరవచోజృంభణముల. 3

క. పులకండంబులు గలిపిన
నలువగు సలిలము రసాయనం బగునగిదిన్
లలితవిభావాదులచే
నలఘుతరస్థాయిభావ మనుగున్ రసమై. 4

వ్యాఖ్య :- పంచదార, నీరు కలిసిన మధురమగు రసాయనము ఆగునట్లుగా లలిత విభావాదులచే నేర్పడు స్థాయి భావము రసమగును.

విభావ, అనుభావ, సాత్త్వికభావము, వ్యభిచారిభావము, అను నాల్గు విధముల భావములచే కలుగు ఆనందాను భావమే స్థాయి భావము.

## స్థాయిభావలక్షణము :—

తే. గరిమ నదు లెన్ని కలిసినఁ గప్పకొనుచు
జలధి కనుపట్టురీతి సంచారిభావ
సంచయము లెన్ని కలిసిన మించనీక
తాన కనుపట్టు భావంబు స్థాయి దలఁపు. 5

వ్యాఖ్య :- సముద్రము నందు నదులు ఎన్ని కలసినను క్షార గుణము స్థిరముగా ఎట్లుండునో ఆదే విధముగ కావ్యమునందు సంచారి భావములు ఎన్ని కలసినను తానే కన్పడు భావమును స్థాయి అందురు.

క. ధర శృంగారము హాస్యము
కరుణము వీరము భయానకము బీభత్సం
బును రౌద్ర మద్భుతము శాం
తరసంబును తనము లనఁగఁ దనరుం గృతులన్. 6

వ్యాఖ్య :- శృంగార, హాస్య, కరుణ, వీర, భయానక, బీభత్స, రౌద్ర, అద్భుత, శాంతము, అనునవి తొమ్మిది కావ్యరసములు.

క. రతిహాసశోకయత్నము
లతిభీతి జుగుప్స రోష మచ్చెరువు శమం
బతుల క్రమమున నివి సాం
ద్రతము రసస్థాయి భావభావనఁ జెందున్. 7

వ్యాఖ్య :- నవరసములకు వరుసగా శృంగార, హాస్య, కరుణా, వీర, భయానక, బీభత్స, రౌద్ర, అద్భుత, శాంతములు క్రమముగ స్థాయి భావములు అగును. స్థాయి భావమనగా సహృదయ హృదయములయందు వాసనా రూపమున ఉన్న భావనయే స్థాయిభావము.

క. రసములకుఁ దొమ్మిదింటికిఁ
బొసఁగిన యాస్థాయిభావములకు నొవర్తున్
రసికత లక్షణలక్ష్యము
లనద్యశరసశాస్త్రవేత్తలౌ నొ నఁనగన్. 8

వ్యాఖ్య :- రసములు తొమ్మిదింటికి, వాటి స్థాయి భావములకు లక్షణ, లక్ష్యములు వివరించబడును.

రతి :—

క. తరుణీమణులకుఁ బురుషుల
కరయఁగ సంభోగవిషయ మగు నభిలాష
స్ఫురణము మనములఁ బొడమిన
ధరలో నది రతి యనంగఁ దగు నెట్లన్నన్. 9

వ్యాఖ్య :- యువతీయువకులకు మనస్సు యందు కలిగిన సంభోగ విషయమగు అభిలాషను "రతి" అందురు.

ఉ. చల్లఁదనంబె చంద్రునకుఁ జక్కఁదనంబె ప్రసూనధన్వికిన్
సల్లలితోరుసౌరభమె చైత్రున కొక్కని కొక్క మేలిమే
తెల్లము గాక; నాపతి యుదీర్ణగుణాఢ్యుఁడు నారసింహభూ
వల్లభుఁ; డట్లు సర్వగుణవైభవ మెవ్వరికైనఁ గల్గునే. 10

వ్యాఖ్య :- ఒక నాయిక నరసభూపాలుని గుణములను ఇట్లు వర్ణించుచున్నది. చంద్రునకు చల్లదనము మాత్రమే గలదు. మన్మధునకు చక్కదనము మాత్రమే గలదు. చైత్రునకు ఒక్క సౌరభము మాత్రమే కలదు. కాని నా ప్రియుడగు నరసభూపాలుడు సర్వగుణములు కలవాడు. ఇట్టి సర్వగుణాఢ్యత్వము ఎవరియందైనను కలదా! ఇట నాయిక మనస్సునందు నరసభూపాలుని యెడ కలిగిన అనురాగభావము వర్ణింపబడినది. కావున "రతి"కి ఉదాహరణ.

హాసము :-

క. చేకొని యక్రూరము లగు
నాకారవికారచేష్ట లాలోకింపన్
గైకొను మహావికాస
స్వీకారమును హాసమయ్యె; విను మెట్లన్నన్. 11

వ్యాఖ్య :- అతి వికృతమగు ఆకారము, వికార చేష్టలు చూచుట వలన కలుగు మనో వికాసమే హాసము. ఇట "అక్రూరములగు" అను పాఠము కన్న" "అతి వికృతములగు"అను పాఠాంతరము సమంజసము.

చ. అదెయిదె వచ్చె వచ్చె నరసాధిపుఁ డాడి యటంచుఁ బాళెము
ల్బెదరి బరీదుఁ డేఁగు నెడఁ బెంపఖిల్లిఖానులు వెనక్కముందుగాఁ
గదిసి హయాళి నెక్కి హయకంధరము ల్వెదగాన కప్పుడే
చదిపిరివాజిమస్తములశత్రువులంటంచు భ్రమింతు రెంతయున్

వ్యాఖ్య : నరసాధిపుడు వచ్చెనని "బరీదు" ని యొక్క సైన్యం బెదరి పారిపోవుచుండగా, అతని సేనా నాయకులు గుర్రముపై వెనక ముందుగా కూర్చుండి గుర్రము యొక్క తలను కానక నరసరాజా సైన్యము తన గుర్రము తలను త్రుంచివైచిరని భ్రమపడుచుండిరి. ఇందు సేనా నాయకుల తొందరలో వెనకా ముందుగా కూర్చుండుటచే కలుగు వికారచేష్ట హాసమును కలిగించుచున్నది.

శోకము :-

క. హితజనవిరహవ్యథచే
నతిశయమై జనులమానసాంభోజమునన్
బ్రతిదినముఁ బొడము దుఃఖం
బతిభూమి వహింప శోక మగు నెట్లన్నన్; 13

వ్యాఖ్య : హితజన విరహ వ్యథచే, మనస్సులో కలుగు దుఃఖము శోకము. పుత్ర వియోగము, మరణము, ఇష్టజన వినాశము,

క్లేశము, బంధనము, వ్యసనము మొదలగు వానివలన శోకము కలుగు నని లాక్షణికులు వివరించిరి.

చ. పతుల నృసింహశౌర్యశిఖిపాలుగఁ జేసినయట్టి పాపపు
న్నతధృతి కింతటం జలము జాలదు; మమ్మును దావపావక
ప్రతతులపాలు చేసె నని పల్కుచు రోదనమందు విద్విషత్సతు
లకు బాష్పపూరములె చాలు వనానలముం హరింపగన్.

వ్యాఖ్య : మా భర్తలను నరసరాజు శౌర్యాగ్ని పాలు చేసినది చాలదా, మమ్ములను అడవిలోని దావాగ్నిపాలు చేయుచున్నావు అని శత్రురాజుల శోకము వర్ణింపబడినది.

ఉత్సాహము :-

క. అత్యున్నతలోకోత్తర
కృత్యంబులు సేయ వేఁడి కృతకృత్యు లిలన్
నిత్యము దలఁచు ప్రయత్నం
బత్యంతోత్సాహ మయ్యె; నది యె ట్లన్నన్ 15

వ్యాఖ్య :- లోకోత్తరములయిన పనులయందు కృత కృత్యు లగుటకు నిత్యము చేయు ప్రయత్నము ఉత్సాహము అందురు. లోకోత్తర కార్యములనగా దాన, ధర్మ, దయా, యుద్ధాదులు.

మ. అసిఁ జెండాడి విపక్షవృక్షముల శౌర్యాగ్నిచ్ఛటం బేల్చి శ
స్త్రసరిత్సీరములన్ రణోర్వీతలముం సంక్షుణ్ణముం జేసి వై
రస్రుంగార్ద్రిం బొనరించి ప్రోదిగొనఁ గద్యత్కీర్తిసస్యౌఘము
ల్వెసఁ సిద్ధించు నెయంచుఁ బల్కు నరసోర్వీనాథు యోధావళుల్.

వ్యాఖ్య :- శత్రువులనెడి వృక్షములను చెండాడి, శౌర్యాగ్నితో కాల్చి, శస్త్రములను నాగళ్ళతో దున్ని, శత్రువుల రక్తముతో తడిపినగాని

కీర్తి నశ్యము పందదు. ఇట సైన్యము యొక్క రణోత్సాహము వర్ణింప బడినది.

భయము :-

క. క్రూరాకారము చూచిన
నారయ నేజనునిహృదయమందు ననర్థాం
కూరాశంక నమగు నది
ధారుణిలో భయమనంగఁ దగు; నెట్లన్నన్. 17

వ్యాఖ్య : క్రూరమయిన ఆకారమును చూచుట వలన మనస్సునందు కలుగు మరణాది శంకలను భయము అందురు. వ్యాఘ్రాది జంతు దర్శనము వలన కలుగు మరణాది శంకలను భయమని లాక్షణికులు వివరించిరి. జనుని హృదయము నందు అనుటవలన పశుపక్ష్యాదుల భయమును గ్రహింపరాదని భావము. భయము వలన కలుగు శంక త్రాసము. ఇచట వ్యభిచారి భావము.

చ. అనఘ! నృసింహ! నీయరివనావళి కేఁగి గుహాగ్రసుప్తుఁడై
యుని మరలం గలం గని భయంపడి పాఱుచు నాజి కాదు కా
దని నతి దెల్పినం దెలియఁ డౌర! నిషాదులఁ జాపహస్తులం
గని విపినేభపంక్తిఁ గని క్రమ్మఱ నాజియకాఁ దలంచుచున్

జుగుప్స :-

క. కలలాస్థిశోణితాదులఁ
బలుమాఱును జూడ నపుచిభావము లోనం
దళుకొత్తి విగర్హణ మది
తలపోయ జుగుప్స యనఁగఁ దగు; నెట్లన్నన్. 19

వ్యాఖ్య :- రక్తమాంసాదులను చూచుటవలన కలుగు ఏవగింపు జుగుప్స.

చ. తలలునగోజము లెన్నెదడుతెండసము క్రొన్ననవం త్రజాలముల్
జలఫణు లస్థిఖండములు శంకసాలై తగునెత్తు చెర్లలో
గలభకపాలనౌచయము గ్రక్కున నెక్కి చరించు సంగర
స్థలుల నృసింహనిర్దళిత శత్రువసారసమ త్తభూతముల్. 20

వ్యాఖ్య :- చచ్చినవారి తలలే తామర పూవులుగా మెదడే మరువుగా, ప్రేగులే నీటి పాములుగా, ఎముకలే శంఖములుగా, ఏనుగుల కపాలములే నావలుగా, అచటి భూతములు నరసరాజుగారి శత్రువుల రక్తము త్రాగి మత్తెక్కి విహరించుచున్నవి. ఈ వర్ణనయందు జుగుప్సాకరమగు రక్త, అస్థి- వర్ణనలు చేయుటవలన జుగుప్సా రసము జనించుచున్నది.

## క్రోధము :-

క. అపకారకారు లగు నరు
లపరాధ మొనర్ప నే మహామహునిమనం
బు పరిజ్వలితం బగు నది
యపరిమితక్రోధ మయ్యె; నది యె ట్లన్నన్. 21

వ్యాఖ్య :- అపకారులవలన ఏ మహానుభావుని మనస్సు ప్రజ్వలించునో అది క్రోధము అగును గురు, బంధు వధాదుల వలన కలుగు చిత్త వృత్తి విశేషము క్రోధము.

చ. స్థిరభుజవిక్రమక్రమనృసింహ! భవత్కరాగ్రభీ
కరకరవాలసిద్ధుఁ డతిగాఢయశోరససిద్ధిఁగోరి బం
ధురహయసింధురావళులతో రణదుర్గ కసర్గళోన్నతి
స్నరబలి పెట్టుదుర్మదసహోధరిపుక్షితినాథయూథమున్ 22

వ్యాఖ్య:- ఓ నృసింహా! నీ చేతియందలి కత్తి అనెడి సిద్ధుడు యశోరస సిద్ధునికోరి రణమనెడి దుర్గకు ఏనుగుల, గుర్రములను మదిం

చిన శత్రురాజులను బలిపెట్టుచుండెను. ఇచట "నరబలి పెట్టు" అనుట వలన నరసరాజు యొక్క క్రోధము వ్యక్తమగుచున్నది.

విస్మయము :-

క. వివిధాపూర్వము లగు వ
స్తువులు గనుంగొనినయెడల సుజనునిమదిలోఁ
దవిలినప్రమోదవిస్తర
మవిరళవిస్మయ మనంగ నగు; నెట్లన్నన్. 23

వ్యాఖ్య :- అపూర్వములగు వస్తువులను చూచుటవలన కలుగు ప్రమోదమే విస్మయము.

చ. ధరణి నృసింహభూవరు ప్రతాపమహాతప మబ్జజాండక
ర్పరములు నిండి తీవ్రగతిఁ బర్వ నఖర్వసగర్వవైరిభూ
వరులు వడంకసాగుదు; రవార్యనవవ్యజనాతపత్రవై
ఖరులు దొలంగఁజేయుదురు కన్నులఁ జీఁకటికప్పుచుండఁగన్

వ్యాఖ్య :- నరసభూపాలుని ప్రతాపమనెడు ఎండ లోకమంతయును మిరుమిట్లు గొల్పుచు ప్రకాశించుచుండగా, శత్రురాజుల కన్నులు మిరుమిట్లు గొల్పుచుండగా, వడకుచు తమ ఛత్ర చామరాదులను తొలగించు కొనుచుండిరి. ఇట "కన్నులఁ జీకటి కప్పుచుండగన్" అనగ మిఱుమిట్లు గొనుటయే విస్మయము.

శమము:-

క. నిరుపమవైరాగ్యాదుల
కిరవై విశ్చలత పూని హృదయము తిరమై
నరులకుఁ బరిణతిఁ జెందిన
ధరలో నది శమ మనంగఁదగు; నెట్లన్నన్. 25

వ్యాఖ్య :- వైరాగ్యాదులచే మనస్సు నిశ్చలతో నిండి మనస్సు—విషయ సుఖముల నుండి నివృత్తియగుటయే శమము అగును.

**ఉ.** ఘోరభవాదిదుఃఖములఁగుందఁగనీక నృసింహశౌరి! దు
ర్వారఫలప్రదం బగు విరక్తిసుఖం బొనరించె నంచు నీ
వైరులు మౌనులై విపినవాటిఁ నీవ గురుండ వంచు నీ
పేరిటి యక్షరంబులె జపింతురు శ్రీ నృసింహభూవరా. 26

వ్యాఖ్య :- నరసింహ భూవరా! నీ శత్రువులు "ఘోరభవాది దుఃఖములు కలుగకుండగా విరక్తి సుఖము కలుగ జేసితివని ఆనందించుచు అరణ్యమునందు మునీశ్వరులై నీ నామజపమును చేయుచుండిరి.

ఇట శత్రువులు నామజపము చేయుట శమమునకు ఉదాహరణ. మొదట ప్రాణభీతితో అరణ్యమునకు చేరినను తదుపరి శమత్వమును పొందిరని భావించవలయును.

స్థాయిభావకారణము :-

**క:** ఈరసముల కుత్పాదన
కారణము విభావ మనఁగఁ గల; దది ద్వివిధం
బై రంజిలు నాలంబన
మారయ నుద్దీపనంబు నఁగ ధరిత్రిన్. 27

వ్యాఖ్య :- ఈ రసోత్పాదనమునకు కారణము విభావము. అది ఆలంబనము, ఉద్దీపనము అని రెండు విధములు.

విభావస్వరూపము :-

**క.** వనితయుఁ బతియునుఁ నాలం
బన మగు; నుద్దీపనంబు ప్రాయంబును సౌ
మ్యనుఁ జేష్టయు మదనాదుల
ననఁ దగు; నేర్పడుఁ జూడ వినికి గల లక్ష్యంబుల్. 28

ఇట్లు నాయిక యౌవ్వనము వర్ణింపబడినది, కావున ఉద్దీపన విభావమున ప్రాయము వర్ణింపబడినది.

సొమ్ము:—

క. వెలఁదికి మణి తాటంకము
లలరున్ దిగ్విజయకాంక్ష నతను(డు చూపుం
జిలుకులు విశాతములుగా
నలవడ నడిఁ దీను శాణయుగ్మము లనఁగన్. 31

వ్యాఖ్య :- ఆ యువతి యొక్క చూపులనెడి బాణములను నూఱుటకై యుంచిన సానరాళ్ళవలె చెవులకున్న కమ్మలు ప్రకాశించుచున్నవి.

ఇట నాయిక యొక్క సొమ్ములను నాయిక రతికి ఉద్దీపనముగా వర్ణించుటచే నిది ఉద్దీపన విభావము సొమ్ము (ఆభరణములు) వర్ణన అయినది.

చేష్ట:—

చ. సుదతి నృసింహునిన్ మరలఁ జూచె విలాసవివర్తితాస్యయై
వదలని ప్రేమ వెన్నవలి వచ్చె ముఖేందుఁ దలంచు భీతిచేఁ
జెదరి గిరీంద్ర దుర్గములు సేరిన చీఁకటివోలె వాసనా స్పద
మగువాలుఁగొప్పు వలిచన్నులపై నసియాడుచుండఁగన్. 32

వ్యాఖ్య :- ఒక యువతి పయ్యారముగా మొగమును త్రిప్పి నరసరాజును చూడగా, ఆమె కేశభారము స్తనములపై పడగా ముఖ చంద్రుడు తన్ను వెంబడించి వచ్చుచుండగా పర్వతములలో దాగెనా! అనునట్లున్నది. ఇందు నాయిక రతికి ఉద్దీపనమయిన నాయికా చేష్ట వర్ణింపబడినది. కావున ఇది ఉద్దీపన విభావము చేష్ట.

తటస్థములు:—

చ. చిగురుఁగటారితోఁ జొక్కపుసింగిణితో నలరంపకుంపుతో
నిగనిగమించు చెంగలువనేజముతో వడిఁ జిల్కతేజిపై

మగఁటిమి నెక్కి శూరుఁ డయి మారుఁడు కోకిలకంఠకాహ
ళుల్, నగడలతాంగిపై వెడలె నేఁడు నృసింహ! యెఱుంగఁ
జెప్పితిన్. 33

వ్యాఖ్య :- ఆ మన్మథుడు చిగురులనెడి కత్తితోను, చెఱుకు విల్లుతోను, పూవుటమ్ముల గుంపులతోను, నిగనిగమని మెరయుచుండెడి కలువ పూవులతోను, కోకిల కంఠకాహళులతోను మన్మధుడు ఆ తాంగిపై దాడి వెడలుచుండెను. ఇందు నాయికారతికి ఉద్దీపనములగు కోకిలాలాపములను వర్ణించెను.

క. కారణ మైన విభావము
చే రస ముత్పన్న మైనఁ జెలఁగెడిదానం
భ్రూయాధకటాక్షాదిక
మారయ ననుభావ మయ్యె; నది యెట్లన్నన్. 34

వ్యాఖ్య :- విభావముచే రసముత్పన్నమయిన చిమ్మట కటాక్షదులు అనుభావము లగును.

మ. అలసాలోలములై యచంచలములై యాకేకరాగ్రంబులై
యలఘువ్రీడములై యనిందితములై యానందపూర్ణంబులై
సులభాసూయములై సుతీక్ష్ణములై సువ్యక్తరాగంబులై
చెలువం బొందెడుచూపు లింతి నెఱపెన్ శ్రీనారసింహేంద్రుపై. 35

వ్యాఖ్య :- ఆ యింతి నారసింహునిపై ఏకాగ్రత కలిగిన అచంచల మైన, వోరచూపు కలిగిన, సిగ్గుతో కూడిన, అనిందితములైన, ఆనందంతో కూడిన, అతి తీక్షణమైన కాంతి కలిగిన, అనురాగయుతమైన చూపుతో, చూచుచుండెను. ఇందు నాయికానురాగయుక్తమైన చూపును వర్ణించెను. కావున ఇది అనుభావము.

క. పరగతసుఖదుఃఖాదుల
పరయఁగ భావించి యట్లు యులరుట సత్త్వ
స్ఫురణము; తద్భవభావము
లరయఁగ సాత్త్వికము లయ్యె; నవి యెట్లన్నన్. 36

వ్యాఖ్య :- పరులయొక్క సుఖదుఃఖాదులను తన మనస్సు నందు భావించి తన్మయత్వము నొందుట సత్వమనబడును. ఈ సత్యము యొక్క భావములే సాత్విక భావములు.

ఉ. స్తంభ మచంచలత్వ; మవశత్వ మగున్ బ్రళయంబు; దృగ్జలో, జృంభణ మశ్రు వౌఁ; జెమట స్వేదము; గద్గద వాక్యవైఖరీ, గుంభము నిస్వరత్వము; తగుం బులకం బన రోమహర్షణా, రంభము; కంప మా వడఁకు; రామకుఁ బాండురుచుల్ వివర్ణతల్. 37

వ్యాఖ్య :- ఇందు ఎనిమిది స్వాతిక భావములు, వాని లక్షణములు వివరింపబడినవి. స్తంభ మనగా అచంచలత్వము, ప్రళయమనగా అవశత్వము, అశ్రువ అనగా కన్నీరు, స్వేదమనగా చెమట, వైస్వర్య మనగా గాద్గద్యము, రోమాంచమనగా గగుర్పాటు, కంపనమనగా వడకుట, వేవర్ణ్యమనగా పాలిపోవుట.

క. తలఁపఁగ రసకార్యములై
జలజాక్షులయందుఁ బొడము స్వాత్త్వికభావం
బుల కెనిమిదింటి కేర్పడ
నలరింతుం గడఁకతో నుదాహరణంబుల్. 38

వ్యాఖ్య :- నాయికయందు జనించు ఈ సాత్విక భావములకు ఉదాహరణములు చెప్పబడును. నాయకుని యందును సాత్విక భావము ల వర్ణింపబడినవని గ్రహించవలెను.

స్తంభము:—

చ. కలికి నృసింహభూవరుఁ గన్గొని నిశ్చలగాత్రవల్లియై
యలరు విలాసచేష్ట లొలయుం గలయంగ నటింపఁ జేయునా
వలపులసూత్రధారుఁ డనవద్యనృపాకృతిఁ జూచి తాను ని
శ్చలతవహింపఁ గాఁగదలఁజాలనిజంత్రపుబొమ్మయో యనన్.

వ్యాఖ్య :- ఆమె నరసభూపాలుని చూచి నిశ్చలగాత్రవల్లియై ఉండగా మన్మధుడే నరసభూపాలుని ఆకృతి వహించుట చూచి నిశ్చలత్వము వహించుటచే ఆమె కదలని బొమ్మవలె నుండెను. అని వర్ణించుట వలన స్తంభమను సాత్త్వికభావము గోచరించెను.

ప్రళయము :-

ఉ. ఇత్తఱి నీతలోదరి వహించెన చేతనవృత్తి శారదా; చిత్త
ముఁ జూఱగొన్న నరసింహుఁడు నేఁడు వియోగపాండు, వా
గుత్తవుగుబ్బలాఁడిపలుకుంజవరాలివలెం జెలంగంగా
నిత్తరళాక్షిచిత్తము వహించనరసోన్నతిఁ జూఱవెట్టెనో. 40

వ్యాఖ్య :- నరసరాజు సరస్వతియందే అధికమోహము కలిగినవాడై యుండెను. అతనిని వరించిన నాయిక వియోగముచే తెల్లబాఱి సరస్వతివలె నున్నది. కావున నరసరాజుకు ఆమెపై వలపు కలిగినదేమో. ఇందు అచేతన వృత్తిరూపమగు ప్రళయము వర్ణించెను. అత్యధికమయిన సుఖము వలన అచేతనత్వము కలిగినదని భావింపవలెను.

అశ్రువు :-

చ. మగువకు సంగజానలసమ్రాసముతాసులివేఁడి యూరుపుం
బొగ లెగయ న్ద్రవించుగతి మొత్తెపుఁజిప్పలఁ బోలు ఱెప్పల
న్నెగడునుదశ్రుపూరములు నేత్రసరోరుహనాళచాతురిం
డిగియె; నృసింహ! యింకఁ దరుణీమణిఁ గౌగిట నాదరింపుమీ

వ్యాఖ్య : మదనాగ్నివలన కలిగిన వేడి నిట్టూర్పులకు పొగ లెక్కినవయి ముత్యపుచిప్పలవంటి కన్నుల నుండి కన్నీటి బిందువులు జాలువారుచుండగా, ఆ కన్నీటి బిందువులు నేత్ర కమలమునకు నాళము వలె కనబడుచున్నది. ఇందు విరహ దుఃఖముచే అశ్రువులు జనించిన ట్లుగా వర్ణించెను.

స్వేదము :-

చ. సతికిఁ జెమర్చె మేను జలజాతదళాక్షి చతుస్సముద్రము
ద్రితవసుధాధురంధరుని శ్రీనరసింహుని భావవీధిలోఁ
బ్రతిదినము న్వహించు నతిభారమువంకనో కాక సంతతా
వతదనమాత్రశస్త్రభవ పావకకీలల వేఁడివంకనో. 42

వ్యాఖ్య : ఆమె హృదయము నందు నరసింహుని భావించుట చేతనో లేక మన్మథ బాణముల వేడివలననో మేను చెమర్చి యుండెను. అని శ్రమవలన కలిగిన స్వేదము వర్ణించబడెను.

వైస్వర్యము :-

ఉ. అమరాంబరాంగనానఖముఖాంకితుఁడైన నృసింహభూవరుం
గమలదళాక్షి చూచి తమకమ్మున దూఱెద నన్న గద్గద
త్వమునఁ బొసంగ వయ్యె నతివాక్యము లాంతరమై చెలం
గు నె,య్యము హృదయేశు దూఱవల దంచు నిరోధ మొన
ర్చెనో యనన్. 43

వ్యాఖ్య :- నరసరాజు పరవనితాసక్తుడగుట తెలుసుకొని నాయిక ఆతనిని నిందింపదలచెను. కాని నోటమాటరాలేదు. ఆతనిపై గల ప్రేమ, ఆతనిని నిందింపవలదని అడ్డగించెనేమో, ఇందు నిరోధ రూపమైన బాధచే కలిగిన వైస్వర్యము వర్ణించబడినది.

## రోమాంచము :-

చ. కలికి నృసింహునిం దలఁచఁగా నలమిం బులకప్రకాండము
ల్మొలచె మనోజవాటికుఁ గుమోద మెసంగఁ గురంగనాభపం
కిల మగు వింతిగాత్రమను క్షేత్రమున న్వలయుంగఁ జేయున
స్ఖలితమనోరథనికాయము లీరిక లెత్తెనో యనన్. 44

వ్యాఖ్య :- మన్మథుఁడను కర్షకుడు కస్తూరి పూతగల నాయికా శరీరమను పొలములో జల్లిన మనోరథము మొలకలెత్తెనో అనునట్లు పులకలు జనించినవి. ఇట నాయిక నృసింహుని మనస్సున భావించుటవలన కలిగిన హర్షముచే రోమాంచము కలిగినదని వర్ణించెను.

## కంపము :-

ఉ. చెన్నగు శ్రీనృసింహవిభుఁ జిత్రపటంబున వ్రాసి బింకపుం
జన్నులమీఁదఁ జేర్చుకొని చాలనడంకఁ దొడంగె బాలదాఁ
గన్నులవింటివాఁడు త్రిజగంబు జయించెద నంచుఁ గోరి చే
సన్నకృపాణవల్లిక మహోజ్జ్వలితన్ ఝళిపించెనో యనన్. 45

వ్యాఖ్య : నాయిక నృసింహుని చిత్రపటము లిఖించి హృదయముపై చేర్చుకొని యుండగా, ఆ నృసింహుడు మూడు లోకములు జయించెదనని కత్తి ఝళిపించెనో ఏమో! ఆమె వడంక సాగినది. ఇందు నాయికకు రాగముచే కలిగిన కంపనము వర్ణింపబడినది.

## వైవర్ణ్యము :-

ఉ. మానవతీలలామ యొకమానసముజ్జ్వలగాత్రవల్లిపైఁ
గానఁగ నయ్యెఁ గాంచుతర కాంతి నిరంతరమై మనంబునన్
శ్రీనరసింహ భూవరు ధరింపఁగఁ దద్వదనేందుమండలీ
మానితచంద్రికారసనమాజము పై పయిఁ బర్వెనో యనన్.

వ్యాఖ్య : ఆ మానవతీలలామ నిరంతరము నరసభూపాలుని మనస్సునందు భావించుచుండుటచే ఆతని చంద్రకాంతిపై కులికెనో అను నట్లుగా ఆమె శరీరము తెల్లబాఱెను.

క. ఆహారహాము రసోత్పత్తికి
సహాయభావంబు లెలమి సంచారు లగుక్;
మహి నవి ముప్పదిమూఁడై
మహితము లగు; వీనికిం గ్రమం బేర్పఱతుఁ౯. 47

వ్యాఖ్య :- రసోత్పత్తికి సహాయపడు భావములను సంచారులన బడును. సంచారి భావములన్నను, వ్యభిచారి భావములన్నను ఒక్కటే. ఇవి ముప్పది మూడు రకములు.

శా. నిర్వేదశ్రమదైన్యజాడ్యములు గ్లానిత్రాసశంకార్తిరు
డ్గర్వావేగధృతిస్మృతు ల్చపలతోగ్రత్వావహిత్థాత్రపాం
తర్వైక్లబ్యమదోత్సుకత్వమతినిద్రామోహబోధాంతము
త్పర్వాలస్యవితర్కసుప్త్యసహతాధ్యానభ్రమాపస్మృతుల్

వ్యాఖ్య :- 1. నిర్వేదము, 2. శ్రమము, 3. దైన్యము, 4. జాడ్యము, 5 గ్లాని, 6. త్రాసము, 7. శంక, 8. ఆర్తి, 9. రోషము 10. గర్వము, 11. ఆవేగము, 12. ధృతి, 13. స్మృతి 14. చపలత, 15. ఉగ్రత్వము, 16. అవహిత్థ, 17. త్రప (లజ్జ), 18. అంతర్వై క్లబ్యము (విషాదము), 19. మదము, 20. ఉత్సుకత్వము (ఔత్సుక్యం) 21. మతి 22. నిద్ర, 23. మోహము, 24. బోధము, 25. అంతము (మరణము), 26. ముదము (హర్షము), 27. ఆలస్యము, 28. విత ర్కము, 29. సుప్తి (స్వప్నము), 30. అసహత (అసూయ), 31. ధ్యానము (చింత), 32. భ్రమము (ఉన్మాదము), 33. అపస్మారము ఇవి సంచారి భావములు.

క. ఈవరుసఁ ద్రయస్త్రింశ
ద్భావములకు లక్షణము లుదాహరణంబుల్
వావిరి నొనర్తు నిరయొడఁ
గేవల శృంగారసూత్రకీలిత ఫణితిన్. 49

వ్యాఖ్య :- వీనికి వరుసగా ఉదాహరణములు చూపబడును.

నిర్వేదలక్షణము:-

క. నిరుపమదుఃఖేర్ష్యాదుల
నిరతము జనియించు నరతి నిర్వేద మగున్;
సురతగమనాదిసంభవ
సరసస్వేదాంబులహరి శ్రమ; మెట్లన్నన్. 50

వ్యాఖ్య :- దుఃఖము, ఈర్ష్య మొదలగు వానివలన జనించు అరతియే నిర్వేదము.

సురత వ్యాపారము వలనను, గమనాది వ్యాపారము వలనను జనించు స్వేదము శ్రమమగును.

నిర్వేదోదాహరణము:-

క. శిలలు మణిభూషణంబులు
చెలువగు హారములు జలధిఁ జిందినచినుకుల్
తలిరాకుఁబోఁడి! నాకగు,
సులభదయానిధి నృసింహుఁ జూడక యున్నన్. 51

వ్యాఖ్య :- నరసింహుని చూడక యున్నచో మణిభూషణములు శిలలుగా, హారములు నీటిచినుకులుగా, ఆ నాయిక భావించుట నిర్వేదము. ఇచ్చట విరహము, విభవము, దైన్యాదులను భావములు. దీనిచే నిర్వేదము వ్యక్తమగుచున్నది.

శ్రమలక్షణము:-

క. నరసేంద్రుఁ జూడ రయమున
నరుదెంచి లతాంగి శ్రమజలాపూరిత యై
సరసేందుకిరణపరిణతిఁ
గరఁగిన నెలచట్టుబొమ్మకై వడి నమరెన్. 52

వ్యాఖ్య : నరసేంద్రుని చూడవచ్చిన యువతి శ్రమజలముతో కూడి యుండి చంద్రకాంత శిలాకృతమగు బొమ్మవలె నుండెను, ఇందు అరుదెంచుట విభావము, స్వేదము అనుభావము. వీటి వలన శ్రమ వ్యక్తమగుచున్నది.

దైన్యలక్షణము :-

క. బలమఱి యరికిఁ దయ రాఁ
బలుకుట దైన్యం బనంగఁ బరఁగు; స్మదిలోఁ
గల కోరిక చేకూఱిన
నల వెఱఁగక యునికి జాడ్య మగు; నెట్లన్నన్. 53

వ్యాఖ్య :- బలము తగ్గి శత్రువుతో కనికరము కలుగునట్లుగా పలుకుట దైన్యమగును.

మనస్సులోని కోరిక సిద్ధించినప్పుడు కలుగు మైమఱపు జాడ్యము.

దైన్యోదాహరణము :-

క. మదన! మదిరాక్షి లక్ష్యమె
మొదలఁ బురాంతకుని నిన్ను మోహించిన నీ?
కిది మొదలు కరుణఁ జూడుము
సుదతి స్మరసింపాఁ గూడ్పు; సుకృతము గల్గున్. 54

వ్యాఖ్య :- ఓ మన్మథుడా! త్రిపురాంతకునంత వానిని నీవు

మోయించిన నీకు స్త్రీ యొక లెక్క కాదు, కావున దీనిని దయతం సరసభూపాలునితో కూర్పుము, ఇట ప్రియురాలి విరహ దుఃఖము విభవము. స్వాపకర్ష భాషణము అనుభావము. వీటిచే దూతిక దైన్యము వ్యక్తము చేయుచున్నది.

జాడ్యము :-

క. ఉదన న్నృసింహుడు వచ్చిన
సుదతి కనుంగొనదు; చెలులఁ జూడదు; భాషిం
పదు; మిగులఁ జలింపదు; త
ద్వదనామృతపారణైకతాపరయుఁ బోలెన్. 5

వ్యాఖ్య :- నృసింహుడు వచ్చుటతోడనే ఆ యువతి ఆనందాతిశయముతో ప్రక్కలకు చూడదు. చెలులతో మాట్లాడదు, చలింపదు, అతని ముఖ చంద్రామృత పానమున ఏకాగ్రచిత్తయై ఉన్నట్లు తోచుచున్నది. ఇచట ప్రియుని దర్శనము విభావము. చెలులతో సంభాషింపకుండుట అనుభావములు. వీని వలన నాయిక జడత వ్యక్తమగుచున్నది.

క. కను శక్తి యొసలి బడలిక
నడలుట యది గ్లాని యయ్యె; నాకస్మికమై
పొడము భయంబునఁ జిత్తము
తడఁబడు టది త్రాస మనఁగఁ దగు; నెట్లన్నన్.

వ్యాఖ్య : శక్తి తగ్గి బడలికగా నుండుట గ్లాని యగును.

ఆకస్మికముగా కలిగిన భయము వలన కలిగిన తడబాటును త్రాసము అందురు.

గ్లాని:-

క. నిండదె బడలిక ? మును చను
గుండలబడు వ్రాఁగలేని కోమలి మేనం

కొండంత వలపు పుట్టెవ;
గండరగండాంక! మోబఘున నరసింహా. 57

వ్యాఖ్య : ఓ నరసింహా! ఆ కోమలి చనుకుండల బరువు మోయ లేని ఆమె శరీరముపై కొండంత వలపు పుట్టినది. ఇందు "నిండవే ఖచలిక" అని వాచ్యముగా గ్లాని తెలియబరిచెను.

త్రాసము :—

క. మరుఁ జిత్రలిఖితుఁ గని బి
త్తరి వెఱవఁ బరాగభూతిఁ దగ నిడి చిగురా
కరయ దిగఁదుడిచి యలులకు
విరిబోనము వోయుఁ దొలఁగె వెఱపు నృసింహా, 58

వ్యాఖ్య :- మన్మధుని చిత్రపటమును చూచి నాయిక భీతి చెందగా ఆమె చెలికత్తెలు పరాగ భూతితో దిగుదుడిచి, చిగురాకులతో దిగదుడిచి, అలులకు విరిబోనవోయగా, భయము పోయెను. మన్మధుడు విభావము, రోమాంచాదు లాక్షేప్యములు, వీటివలన త్రాసము వ్యక్తమయినది.

క. తనకు ననిష్టం బగునో
యని గొదుకుట శంక; హృదయమందలి తాపం
బినుమడి యై వెలిఁ బర్విన
ననయముఁ దనుపీడ యార్తియగు; నెట్లన్నన్. 59

వ్యాఖ్య : తనకు అనిష్టము కలుగునని సందేహించుట శంక. దీని వలన ముఖ వివర్ణత, కంపాదులు కలుగును.

హృదయమందలి వియోగతాపము అధికమయి బహిర్గతమయినచో ఆర్తియగును. ఇచట రోగవిరహాదులు విభావములు, గాత్రశైథిల్యము, నిశ్వాసము మొదలయినవి అనుభవములు.

శంక :-

క. చిలుకలపలుకో యని విని
వలుకుం జెలిపలుకుఁ దలఁకు నద్దము చూడం
గలవల చెలికాఁడో యని
చెలువ వియోగంబుకతన శ్రీనరసింహా. 60

వ్యాఖ్య :- ఓ నరసింహ! నీ చెలి చిలుక పలుకులను వినుటకు భయపడుచున్నది. మన్మథుడవని అద్దములో చూచుటకు భయపడుచున్నది వియోగము వలన ఆమె ఈ విధముగా బాధపడుచున్నది. ఇచ్చట అవిష్టము, విభావము, ముఖవివర్ణత కంపాదులు అనుభావములు దీనిచే శంక వ్యక్తమగుచున్నది.

ఆర్తి :-

క. వెడిదపుమదన జ్వరమున
మిడిసి పడుఁ హారలతలు మృగలోచనకుఁ
వెడవిలుతువింటికోలల
వడువ్రున; సఖి నింక నేఁచ వలదు నృసింహా. 61

వ్యాఖ్య : ఓ నృసింహ నీ చెలియ మదన జ్వరము వలన హారలతలు మన్మథ బాణములవలె ఎగిసిపడుచు బాధపడుచున్నది. ఇచట విరహము విభావము, అంగవిక్షేపాదులు అనుభావములు.... వీని వలన వ్యాధి వ్యక్తమగుచున్నది.

క. ఎందును గృతాపకారుల
యందు మనం బెరియ రోషమగు నది; యొరులన్
నిందించి తన్నుఁ బొగడు న
మందోన్నతి గర్వ మయ్యె మహిఁ; నెల్లన్నన్. 62

వ్యాఖ్య : అపకారము చేసిన వానిని చూచి మనస్సు ఆవేగము చెందుట అమర్షము.

ఇతరులను నిందించి, తన్ను పొగడుకొనుట గర్వమనబడును.

క. నిలునిలు మనంగ! యెచటికిఁ
బోలఁగెదు! నరసింహుఁడింతితోఁ గూడినఁ జా;
లలరు భవదీయచాపము
కలుగానుగఁ ద్రిప్పి పిప్పిగాఁ గావింతున్. 63

వ్యాఖ్య : నరసింహుని ప్రియురాలను బాధించినచో నీ చాపమును గానుగలో పెట్టిపిప్పి చేయగలదు" అని నాయిక చెలకత్తె పలుకుచున్నది. ఇందు తన సఖికి అపరాధము చేసిన మన్మధునిపై కోపమును వ్యక్తము చేయుచున్నది. ఇచట మన్మధాపరాధము విభావము, పరుష వచనములు అనుభావములు, దీని వలను రోషము వ్యక్తమగుచున్నది.

గర్వము:-

క. ప్రతియె కలంకాంకితునకు
సతి యగురోహిణియు సతనుసతి యగురతియుం
జతుర నృసింహునిఁ జెందిన
యతిధన్యకు నాకు నచుచు రంగన నవ్వెన్. 64

వ్యాఖ్య : కళంకి భార్యయగు రోహిణియు, అనంగుని భార్యయగు రతియు నాతో సమానులు కారు. నృసింహుని చెట్టి పట్టిన నేను అతి ధన్యురాలను. అని నాయిక నవ్వెను.

నాయిక నృసింహుని చెట్టపట్టుట అతిధన్యతగా భావించుట ఆత్మోత్కర్షము విభావము, అవహేళ అనుభావము వీనివలన గర్వము వ్యక్తమగుచున్నది.

క. క్రమమున నిష్టానిష్టా
గమజమనస్సంభ్రమంబు గన నా వేగం;
బమరఁగ మనము కృతార్థ
త్వముఁ జెందిన ధృతి యనంగఁ దగు; నెట్లన్నన్. 65

వ్యాఖ్య : పూర్వానుభవమును తలచుట స్మృతి.

రాగద్వేషము వలన కలిగిన చేష్టలు చాపలము.

ఇతరుల వలన కీడుకలుగగా జనించిన తీవ్రమైన కోపము ఉగ్రభావము, ప్రభువు చేసిన అపరాధము. లేనిదోషములను ఆపాదించుట, దొంగతనం ఆపాదించుట అనునవి విభావములు,బంధించుట, దండించుట, వధించుట అనునవి అనుభావములు.

స్మృతి:—

క. నాఁటిపరిరంభ సౌఖ్యము
నేఁటిబలెం బాయ దాత్మ నిండి తొలఁకుచుఁ;
బోఁటి! నృసింహునిఁ బాయని
పాటలసుమగంధు లెంత భాగ్యాధికలో. 69

వ్యాఖ్య :- ఓ చెలీ! నాటి నృసింహుని పరిరంభ సుఖము మనస్సును పిడిచిపెట్టకున్నది. నృసింహుని ఎడబాటు పొందని స్త్రీలు ఎంత భాగ్యవంతులో గదా! ఇందు పరిరంభ సౌఖ్యము విభావము. ఆనందాశ్రువులు, నేత్రనిమీలినాదులు అనుభావములు వీని వలన స్మృతి వ్యక్తమగుచున్నది.

చాపలము :—

క. వనిత నృసింహునిఁ గనుఁగొని
చనుగుబ్బలమీఁదిపలువ చక్కఁగ దిద్దున్;
జనఁ జూచు; మరలుఁ; జెలితోఁ
బనిలేకయుఁ బలుకు; నురముపయిఁ జేయిసేర్చున్. 70

వ్యాఖ్య :- నాయిక నృసింహుని చూచి స్తనములమీది పయట సరిదిద్దును, వెళ్ళుటకు ప్రయత్నించును, తిరిగి చూచుచుండును, చెలికత్తెతో కబుర్లు చెప్పును, హృదయముపై చేయి చేర్చుకొనుచున్నది. ఇందు నరసభూపాలునిపై అనురాగము విభావము, నాయిక చేయు చేష్టలు అను భావములు వీనివలన చాపలము వ్యక్తమగుచున్నది.

ఉగ్రత :—

క. వలదు వల దేఁచఁ గలువల
చెలికాఁడ! నృసింహుఁ గూర్పు చెలిఁ; గాకున్నన్
బొలఁతుక నిట్టూర్పుఁబొగ
ల్వొలువడి నీబింబ మెల్ల నెస మాయించున్. 71

వ్యాఖ్య :- ఓ చంద్రుడా! నీవు మా చెలియను బాధింపక నృసింహునితో పొందుకూర్పుము. అట్లుకానిచో ఆమె నిట్టూర్పులను పొగలచే నీ బింబము కప్పివేయబడును. ఇందు చంద్రకృత అపరాధము విభావము. "నీ బింబమెల్ల నెస మాయించున్" అనునది అనుభావము. వీని వలన ఉగ్రత వ్యక్తమగుచున్నది.

క. భువిలో నాకృతిగోపన
మవహిత్థ; మనంబు ముడుఁగుటది త్రప; మతికిన్
వివిధోపాయాభావా
ద్వివిరతభంగము విషాద మగు; నట్లన్నన్. 72

వ్యాఖ్య :- ఆకారమును దాచుకొనుట అవహిత్థ. సిగ్గువలన, ఆనందము వలన ఆకారము దాచుకొనుట అవహిత్థమగును. భయము, సిగ్గు, దార్ఢ్యము, కుటిలత్వము, గౌరవము మొదలగు వాటివలన జనించిన భావమును అవహిత్థమని లక్షణకారులు వివరించిరి.

మనస్సునందు కుంచించుకు పోవుట త్రప. స్త్రీలకు పరపురుష దర్శనము వలనను, పురుషులకు పరాభవము, ప్రతిజ్ఞాభంగము మొదలగు వాని వలన కలిగిన అధోముఖత్వము త్రప.

వివిధములైన ఉపాయములు లేకపోవుట వలన కలిగిన భంగపాటు విషాదమగును. ఇష్టమైనది సిద్ధింపకుండుట, రాజు, గురువుల యెడ చేసిన అపరాధము వలన కలిగిన అనుతాపము విషాదమగును.

అవహిత్థ :—

క. హారములు కరఁగ నరస
క్ష్మారమణునిఁ బాడి యొకసతి పులకలు మై
నీరిక లెత్తిన దాఁచును
సారెకు హారాంబుజనితశైత్యం బనుచున్. 73

వ్యాఖ్య :- నరసరాజు యొక్క సతికి పతిభావనచే పులకాంకురములు కలుగగా, వాటిని హారము ధరించుటచే పుట్టిన శీతలత్వముగా దాచుచున్నది. ఇట వ్రీడ విభావము, పులకాంకురములు దాచుట అను భావము దీని వలన అవహిత్థ వ్యక్తమగుచున్నది.

త్రప :—

క. వనిత నృసింహేంద్రుఁ బరా
కునఁ బేర్కొని శిరము వంచుకొనుఁ జెలియెదుటన్
గనిపించె భావ మని మో
మనయముఁ గుచదుర్గవసతి నాఁగినభంగిన్. 74

వ్యాఖ్య :- ఒక వనిత పొరబాటున నృసింహుని పేరును ఉచ్చరించుట వలన తన మనస్సులోని భావము తెలిసిపోయెనని సిగ్గుతో తల వంచుకొనసగా, తన భావము తెలిసి కుచదుర్గముల దాచుచు ఉన్నట్లుగా ఉండెను. ఇందు నరస భూపాలుని నామోచ్చారణము విభావము తలవంచుకొనుట అనుభావము. వీని వలన త్రప వ్యక్తమగుచున్నది.

విషాదము :—

క. అలరులు మరునమ్ములు; హిమ
జల మిందుకరోదితంబు; శత్రువు తలఁపఁ
జలిగాడ్పు; శ్రీనృసింహుం
డలిగినవాఁ డెట్లు మాను నతివకు గాఁకల్. 75

వ్యాఖ్య :- నృసింహునిపై కోపగించిన మన్మథుడు, [illegible]

యను పుష్పబాణములతోను, చల్లని నీటితోను, చల్లగాలులతోను బాధించు చుండెను. ఇచట నృసింహుని అలుక విభావము. ముఖసంకోచాదులు అనుభావములు. వీని వలన విషాదము వ్యక్తమగుచున్నది.

క. మదము మదిరాదికృతన
మ్మదమోహవ్యతికరంబు; మఱి యౌత్సుక్యం
బదన సమయాక్షమత్వము;
మది సర్థవినిర్ణయంబు మతి; యెట్లన్నన్. 76

వ్యాఖ్య :- మద్యము వలన కలిగిన సంతోషము మదము. మద్యము వలన కలిగిన నిద్ర, నవ్వు మొదలగునవి చిత్రవృత్తి విశేషము. మదము. ఈ మదము తరుణము, మధ్యమము, అధమము అని మూడు రకములు.

కాల విలంబనము సహింప లేకుండుట ఔత్సుక్యము. ఇష్టజన విరహాది రూపములగు ఆలంబనము చేతను, ప్రియసంస్మృతి రూపమగు ఉద్దీపన విభావము చేతను, నిద్రా, తంద్రా, గాత్రగౌరవము, చింత అను అనుభావములచే వ్యక్తమగునది ఔత్సుక్యము.

అర్థ నిర్ణయమును మతి అందురు. శాస్త్రాదులను అభ్యసించుట వలన కలిగిన కార్యనిశ్చయ జ్ఞానము మతి. ఇందు సందేహము లేకుండగ కార్యమును అనుష్ఠించుట, సందేహము తీరుట మొదలగునవి అనుభావములు.

మదము :—

క. అమరు నృసింహునివనమున
నమితావసరసము లాని యలియావళముల్
భ్రమియించు; నాడు; బాడును
రమణులతోఁ గూడి సాంద్రరాగప్రౌఢిన్. 77

వ్యాఖ్య :- మొగ తుమ్మెద పుష్పరసమును గ్రహించి ఆడ తుమ్మెదలతో ఆడుచు, పాడుచుండెను. ఇచట పుష్పాసవము విభావము. ఆట పాటలు అనుభావములు. కలయిక అను మదము వ్యక్తమగుచున్నది.

ఔత్సుక్యము :—

క. వరుఁ బిలువఁ బనిచి యెపు డె

డరుదెంచునో యనుచుఁ దలఁచి యభిముఖ యగు బి

త్తరి యింత పరాకై నను

నరయఁ దదాలోకవిఘ్న మగు భీతిన్. 78

వ్యాఖ్య : నాయిక తన ప్రియుని పిలుచుటకు కబురు పంపించి ఎప్పుడు వచ్చునా అని ఎదురుచూచుచు, పరాకు లేకుండగ ఉండెను ప్రియా విరహము ఆలంబనము. ప్రియస్మృతి ఉద్దీపనము. చింత, అభిముఖీ భావము అనుభావము. దీనివలన ఔత్సుక్యము వ్యక్తమగుచున్నది.

మతి :—

క. చెలువరో! శ్రీనరసింహుం

డలనాటి నృసింహమూర్తి యగుఁ గాకున్నన్

దలఁచినతావుల నెల్లను

నెలకొని సాన్నిధ్యమొందునిపుణత కలదే. 79

వ్యాఖ్య :- నరసింహుడు నృసింహమూర్తియే, కానియెడల తల చినచోట ఎట్లు అతడు ఏ విధముగా కనపడగలడు. ఇచ్చట శాస్త్రప్రమాణము విభావము. సంశయ విచ్ఛేదము అనుభావము. వీని వలన మతి వ్యక్తమగుచున్నది.

క. జగతిం జిత్తనిమీలన

మగు నిద్ర యనంగ; మూర్ఛ నందుట మోహం

బగు; బోధ మెఱుకఁ జెందుట;

యగణిస్మృతియత్న మంత మగు; నెన్నట్లన్. 80

వ్యాఖ్య :- మనస్సు మూసికొని పోవుటయే నిద్ర. ఇంద్రియ క్రమా

దులు విభావము. కండ్లు మూసుకొనుట, శరీరము కదల్పకుండుట మొదల గునవి అనుభావములు.

మూర్ఛను పొందుట మోహము. భయవియోగము వలనను, వస్తు తత్వమును గుర్తింపలేకపోవుటయు మోహము

తెలివిని పొందుట బోధము అగును.

మరణయత్నము అంతమగును.

నిద్ర :-

క. కలనైన శ్రీ నృసింహుని
గలయంగల నంచుఁ గలికి కన్నులు మొగిచెం
జెలి బాహ్యేంద్రియపథమున
నలరు మనం బరుగ కుండ నాఁగినభంగిన్. 81

వ్యాఖ్య :- కలలోనైన శ్రీనృసింహుని కలియుదునని ఎంచి, మనస్సు బయటికి పోకుండగ అప్పటికో అనునట్లుగా కనులు మూసుకొనెను. ఈ ఉదాహరణము స్వప్నమునకు తగిన ఉదాహరణగా నున్నది కాని, నిద్రకు కాదు.

మోహము :-

క. అతనుశరహతుల సొరిగెను
సతి విరహతపస్సమాధిజనితవ్రతయై
ధృతి శ్రీనృసింహుఁ దలఁపఁగ
మతి తన్మయ మగుచు మేను మఱచిన భంగిన్. 82

వ్యాఖ్య :- నాయిక విరహరూప తపోనియమము కలదై నరసింహుని తలచుచుండగ ఆమె మనస్సు తన్మయమైనదో అనునట్లుగా మన్మథ బాణములచే మూర్ఛను పొందును ఇందు ప్రియుని వియోగము విభావము. వస్తుతత్వమును గ్రహించుట అనుభావము. వీవి వలన మోహము వ్యక్తమగుచున్నది.

బోధము:-

క. తరణికులాధీశయశ
శ్శ్రీస్తరుణి జడత్వంబు మాని సంపుల్లసితాం
బురుహాక్షియు జృంభిత యై
చిరగతి మేల్కాంచియె శ్రీనృసింహుండు కలుగన్. 83

వ్యాఖ్య :- నృసింహుడు జన్మించుట వలన సూర్యవంశ కీర్తి విద్రనుండి మేల్కొనినది. ఇందు నరసభూపాలుని జన్మ విభావము. ఆవు లించుట అనుభావము. వీని వలన బోధము వ్యక్తమగుచున్నది.

మృతి :-

క. వల పెఱింగి రాఁడు, కౌఁగిట
వలమఁడు నరసావనీంద్రుఁ డని వగవఁ జుమీ!
చెలులును జిలుకయు నెవ్వతి
వల నగునో యనుచుఁ గొంత వగచెద నాత్మన్. 84

వ్యాఖ్య :- నరసావనీంద్రుడు వలపు గ్రహించి వచ్చి కౌగిట చేర్చుట లేదని విచారింపవలదు, చెలులును, చిలుకయు నెవ్వతివలనగునో యని కొంత విచారించెదము. నరసభూపాలునిపై గల విరహము విభావము. చెలులును జిలకయు ఎవ్వతివలన నగునో అని చింతించుట అనుభావము. వీని వలన మరణయత్నము వ్యక్తమగుచున్నది.

క. ముద మిష్టలాభభవస
మ్మద మగు; గర్తవ్యకార్య మందోద్యోగం
బది యలసత; సందేహా
భ్యుదయబహుత్వము వితర్క; మొగి నెట్లన్నన్. 85

వ్యాఖ్య :- ఇష్టము లభించుటవలన కలిగిన సంతోషము ముదము అగును.

చేయవలసిన పనులయందు అలసత్వము కలిగియుండుట అలసత అగును.

అనేక సందేహములు కలుగుట వితర్కము సందేహానంతరము కలిగిన యూహను వితర్కముగా వ్యాఖ్యాతల అభిప్రాయము.

ముదము :-

క. అలులై కింశుకశిఖలోఁ
జెలఁగుచు మున్నెంత తపముఁ జేసెనో చెలి వే
నలి; నరసింహానియురమునఁ
జెలు వగు చెంగల్వదండ చేరువఁ గలిగెన్. 86

వ్యాఖ : తుమ్మెదలు పూర్వ జన్మలో చెలియొక్క కొప్పులోవి మోదుగ పూవులనెడి అగ్నిలో తపస్సు చేయుటవలన మోక్షమును పొంది ఈ జన్మలో నరసభూపాలుని వక్షస్థలము నందున్న చెంగల్వదండను చేర గలిగెను. ఇందు దేవతానుగ్రహము విభావము అనుభావములు లేవు.

అలస్యము :-

క. చెలు లాహారాదులకుం
బిలిచిన నరగంటఁ జూచుఁ; బ్రియుఁడు నృసింహుం
డలఘున్నపకుంజరుఁ డని
యలికాంతల కుంభినీత్వ మందెనొ కానున్. 87

వ్యాఖ్య : నరస భూపాలుడు మొగఏనుగు కాగా ఆ యువతి ఆడ ఏనుగు అయినచో అనునట్లుగా చెలులు పిలిచినను అరగంట చూచు చున్నది. ఇచట విరహము విభావము. వీని వలన అలస్యము వ్యక్తమగు చున్నది.

వితర్కము :-

క. చెలు లెఱుఁగరాదు భావము:
చెలు లెఱుఁగక యున్న మఱునిచే రాయిడి యాఁ:
జెలులును మన సాకైనను
వల పెఱిఁగి నృసింహావిభుఁడు వచ్చునో రాఁడో. 88

వ్యాఖ్య : తన వలపును గ్రహించి నృసింహుడు వచ్చునో రాడో అని నాయిక సందేహము కలిగి ఉండుట వితర్కము.

క. అతినిద్ర సుప్తి; యితరుల
యతిశయము సహింప కుండు టది యీర్ష్య యగున్;
హితవస్తువు చేకూఱమి
నతులాధ్యానంబు చింత యగు; నెట్లన్నన్. 89

వ్యాఖ్య :-అతి నిద్రను సుప్తి అని అందురు. నిద్రలోని స్వప్నము వలన కలిగిన జ్ఞానమును సుప్తిగా వ్యాఖ్యాతలు అంగీకరించిరి. నిద్రకు నేత్రనిమీలనము, గాత్రనిష్క్రియత్వము అను భావములు.

ఇతరుల గొప్ప తనమును చూచి సహింపకుండుట అసూయ అనబడును.

ఇష్టమైన వస్తువు లభించక పోవుటవలన కలుగు ఆధ్యానము చింత అగును. వైవర్ణము, అధోముఖత్వము, భూలేఖనము మొదలగు చిత్తవృత్తి విశేషము చింత.

సుప్తి:—

క. లలన నృసింహుని కౌఁగిట
నలసియొ తన లెల్ల నిద్ర నడఁదెడి నెలమిన్
నెలపొందున రే ముద్దులు
గులికెడు నగ ల్నిద్రవోవు కుముదినివోలెన్. 90

వ్యాఖ్య :- రాత్రి అంతయు చంద్రుని ముద్దులతో గడిపిన కుము దిని, పగలంతయు నిద్రపోయినట్లుగా, నాయిక నృసింహుని కౌగిలిలో రాత్రి అంతయు గడిపి, పగలు నిద్రించుచున్నది. ఇందు నాయిక సుప్తి వర్ణింపబడినది.

అసూయ:—

క. ఈవికొలఁ దంతే; తనమే
నేవేళను బాండుశోభ; యెవయే నాకున్
వావిరిఁ గీర్త్యంగన యని
శ్రీవెలయు నృసింహునొద్దఁ జిరతరలీలన్. 91

వ్యాఖ్య :- ఇందు నరసభూపాలుని కీర్తి కాంతను చూచి లక్ష్మిదేవి సహించలేక దానిని నిందించుచు, నృసింహుని ఆశ్రయించుచున్నదని వర్ణింపబడినది. ఇందు నిందావచనములు అనుభావములు. వీనివలన అసూయ వ్యక్తమగుచున్నది.

చింత:—

క. సతి చెక్కిటఁ జేయి సేర్పఁగ
నతులకరాంగుళులు సాంజనాశ్రుయుతములై
రతిపతి బానట మించిన
శితపంచశరమ్ములనఁగఁ జెలఁగు నృసింహా. 92

వ్యాఖ్య :- నాయిక చెక్కిటపై చేయి చేర్చగా, ఆ చేతివేళ్ళు మన్మధునకు సహాయము చేయుటకు సహాయముగా నిలచిన బాణములవలె నుండెను ఇందు ప్రియా ప్రాప్తి విభావము, చెక్కిట చేయిచేర్చుట అనుభావము. వీనివలన చింత వ్యక్తమగుచున్నది.

క. అనయంబుఁ జేతనాచే
తనసదృశమనోభ్రమంబు ధర నున్మాదం

బనఁ బొల్చుఁ; ధాతుచలనము
తనర నపస్మార మనఁగఁ దగు; నెట్లన్నన్. 93

వ్యాఖ్య :- చేతనా చేతన వస్తువులయందు సమానముగా చిత్త భ్రాంతి ఉన్మాదము.

వియోగ, భయ, జుగుప్సాదులవలన కలిగిన వ్యాధి విశేషము, అప స్మారమనదగును. దీనికి వియోగ శోకాదులు విభావము, కంపము, భూపా తము మొదలగునవి అనుభావములు.

ఉన్మాదము:—

నినుఁ బ్రార్థించెద భ్రమరము!
చని నరసింహేంద్రుఁ దెమ్ము; చన వల దోహో!
చనిన నృపాలుముఖాంబుజ
ఘనవాసనఁ దగిలి నీవు గ్రమ్మఱవు గదా. 94

వ్యాఖ్య :- ఓ భ్రమరమా! నీవు వెళ్ళి నరసభూపాలుని తీసుకొని రమ్మ! నీవు అక్కడకు వెళ్ళినచో నరసభూపాలుని వాసనల తగిలి తిరిగి రావేమో! వెళ్ళవలదు అని నాయిక పలుకుచున్నది. ఇచట భ్రమరమునకు నాయకుని తీసుకురాగల శక్తిలేదని నాయికకు తెలియక పోవుటయే ఉన్మాదము.

అపస్మృతి:—

మదనగ్రహంబు సోఁకెను;
సుదతీమణి దీర్ఘదృష్టిఁ జూచెడుఁ జెలులన్;
ముదమొదవ రక్షఁ గట్టుఁడు
మదవతికి నృసింహనామమంత్రముకతనన్. 95

వ్యాఖ్య :- సుదతీమణికి మదనగ్రహము సోకినది, దీర్ఘదృష్టి తో చూచుచున్నది. కావున నృసింహనామ మంత్రముతో రక్ష కట్టుడు అని చెలి

కత్తెలు పలుకుచున్నారు. దీర్ఘదృష్టితో ఉండుటచే నాయిక అపస్మారము సూచించుచున్నది.

క. ఇరువగు నీభావంబులు
వరఁగెడు ననుభావములు విభావంబులు న
న్యరసంబులకుం గల; వవి
విరచింపఁగ నొల్ల నిందు విస్తరభీతిన్. 98

వ్యాఖ్య :- గ్రంథవిస్తరభీతిచే మిగిలిన రసముల విభావానుభావములను చెప్పుట మానివేసితిని

తే. ఇంక శృంగారచేష్టల నేర్పరింతు;
నవియు నష్టాదశాఖ్యలై యలరుచుండు;
లలితగతి వీనినామముల్ లక్షణములు
క్రమముతోఁ దెల్పి వీనిలక్ష్యము లొనర్తు. 9

వ్యాఖ్య :- పదునెనిమిది రీతులగు శృంగారచేష్టలు వివరించబడును.

క. ఇల భావహావహేలా
విలాసమాధుర్యధైర్యవిభ్రమలీలా
కిలికించిత మోట్టాయిత
లలితాదులు చేష్టలగుఁ దలంపఁగ మఱియున్. 98

వ్యాఖ్య :- భావము, హావము, హేల, విలాసము, మాధుర్యము, ధైర్యము, విభ్రమము, లీల, కిలికించితము, లలితము, బిబ్బోకము, విచ్ఛిత్తి, విహృతము, చకితము, హసితము, కుట్టమితము, కుతూహలము అని శృంగార చేష్టలు పదునెనిమిది.

తే. కేలియు బిబ్బోకవిచ్ఛిత్తి విహృతచకిత
హసితకుట్టమితకుతూహలాదు లనఁగ

గలవు మఱి; యందు భావంబు వెలయుచుండు
మహి రసజ్ఞానయోగ్యతా మాత్ర మగుచు. 99

క. అది యీషద్వ్యక్తముగా
నుదతులయెడ హావ మయ్యె: సువ్యక్తం బై
పొదలిన ననవరతంబును
నది మిక్కిలి హేల యయ్యె, నది యె ట్లన్నన్. 100

వ్యాఖ్య :- రసజ్ఞానయోగ్యత భావమనబడును. బాల్య యౌవన నడిమి కాలమున కలిగెడి శృంగార భావమును, భావమనబడును. నాయిక యందు ఈ చేష్టలు కొద్దిగా వ్యక్తమయినచో హావము అధికముగా వ్యక్తమయిన హేలయు అగును.

భావము :-

ఉ. వరుఁడని పేరొకన్నిరము వాంఛుఁదలోదరి; సాలభంజికా పరిణయ వేళ నెచ్చెలులఁ బాయక యెప్పటియట్ల కేళికాం తర మొనరింపఁబోదు; చనెనా యెదఁబయ్యెదఁ జేర్చిసిగ్గునం బరఁగుఁ బ్రియాంగనానుకృతి భావనకేలికిఁ గాఁగనిచ్చలున్

వ్యాఖ్య :- బొమ్మల పెండ్లి సమయమున ఒక బొమ్మను నరస భూపాలునిగాను, మరియొక బొమ్మను తన్నుగాను చేసి క్రీడించుచున్నప్పుడు, ఆమె తలవాల్చుచున్నది. కేళికాంతరమునకు పోవుటలేదు. ఒకవేళ వెళ్ళినను తన్నుగా భావించుకొని సిగ్గును పొందుచున్నది.

ఇట శిరము వంచుట మొదలగు చేష్టల వలన నాయిక మనోవికారము తెలియుచున్నది.

హావము :-

చ. వడఁతినృసింహుగీతములు పాడెడు వేళనృసింహునామము న్నుడువదు సిగ్గుతో; గురుజను ల్నరనాథుగుణప్రశంస లే

ర్పడు నొనరించుచో నుచితభక్తి మెయి న్గురుసేవసేయుకై
వడివడి నాలకించుఁదలవాంచుఁ;బరాకగుఁ గొంతవింతగన్.

వ్యాఖ్య :- నాయిక నృసింహుని గీతములు పాడెడు సమయమున నృసింహుని నామము పలుకదు, పెద్దలు నృసింహుని గుణములు ప్రశంసించు సమయమున, సేవచేయు నెపమున దగ్గరకుచేరి వినుచున్నది.

ఇట నృసింహుని నామము పలుక కుండుట మొదలగు చేష్ట నాయిక హావము వ్యక్తమగుచున్నది.

హేల:—

ఉ. మేలములాడుచుంగడున మేలములై చెలులెల్లఁ గూడి యో
బాలిక! శ్రీనృసింహనరపాలు వరించెదవే యటన్న నీ
లాలక యంగవల్లిఁ బులకాంకురముల్నన లొత్తె నే మనం
జాలక యూరకుండెనవిశేంబు త్రపావృతమైన కైవడిన్ 103

వ్యాఖ్య :- చెలులందరును వేళాకోళముగా "నృసింహుని వరించెదవే?" అని అడుగగా, ఆ కన్యకు గగుర్పాటు కలిగినది. యిందు మనోవికారము సువ్యక్తమగుచున్నది, కాన హేలాభావము వర్ణింపబడినది.

క. పతిఁ గనఁ దాత్కాలిక మగు
నతులవికారము విలాస మగు; సొమ్ములు లే
కతిరమ్యత్వము దలఁపఁగ
నతివలకు న్మధురభావ మగు; నె ట్లన్నన్. 104

వ్యాఖ్య:-పతికనబడగానే కలుగు మనోవికారము విలాసమనబడును. నాయిక నగలు అలంకరించుకొనక పోయినను అతిరమ్యముగా కనబడుట మాధుర్యమనబడును.

విలాసము :-

క. ఇరుగడల వెడలి సుడిగొని
తరళములై వెలికి వెలికి తళతళ మనుచుం
బరఁగు నుదారపుఁజూపుల
హారిణాక్షి నృసింహవిభుని కారతి సేసెన్. 105

వ్యాఖ్య :- సుడిగొన్నట్టియు, తరళములయినట్టియూ తళ తళ లాడుచున్నట్టియు చూపులతో నాయిక నరసభూపాలునికి ఆరతి విచ్చు చున్నది. ఇందు పెక్కువిధములగు చూపులను వర్ణించుటవలన విలాస మునకు ఉదాహరణమగుచున్నది.

మాధుర్యము :-

చ. కనుఁగవకెంపు సార్ద్రనఖగౌరత యుంజెలువొందు నొక్కయం
గన తతివేగశిథిలమణికంకణనూపురహారవల్లిమై
మును వటికన్నఁ బొల్పగు సముజ్జ్వలతం దగెఁ బాండువత్రిమై
కొనల నిగిర్చియున్న యతికోమలవల్లిమతల్లియో యనన్.

వ్యాఖ్య : రతి సమయమునందు నాయిక మణి కంకణము, నూపు రములు జారిపోయినను కనుగవ కెంపుచేతను, ఆర్ద్రనఖ గౌరతచేతను, సముజ్జ్వలాకృతితో కనబడుచున్నది. ఇట అలంకారములు లేకపోయినను సముజ్జ్వలాకృతితో ఉన్నట్లుగా వర్ణించుట వలన మాధుర్యము వ్యక్త మగుచున్నది.

క. కులశీలాద్యవిలంఘన
ములఁ ధైర్యం; బొడలఁ దొడవు లిడఁ దడఁబడినం

వెలయుఁగ విభ్రమ; మధిపుని
యలఘుగుణానుకృతి లీల యగు; నెట్లన్నన్. 107

వ్యాఖ్య :- కుల శీలాదులను అతిక్రమించకుండుట ధైర్యము.

హర్షాదుల వలన ఆభరణములను తారుమారుగా ధరించుట విభ్రమము అనబడును.

ప్రియుని గుణములను అనుకరించుట లీల అనబడును.

ధైర్యము :-

మ. అతులైశ్వర్యసమగ్రుఁడైన నరసింహాధీశ్వరుం డెడ? నీ
పితృవాచావరతంత్రతస్వతంత్రతతిం బెంపొందు నే నెడ? నా
క్షితిపాలాగ్రణిపైఁ బ్రసక్తముగ నాచిత్తంబు సంధించినాఁ
డతనుం డక్కరో! నేఁట నుండివిషమాస్త్రాళిఖ్యుఁడా నెంత
యున్.

వ్యాఖ్య:- నరసభూపాలుడెక్కడ, తల్లిదండ్రుల చాటున ఉన్న నేనెక్కడ. మన్మధుడు నా హృదయంపై విషమాస్త్రములను ప్రయోగించెను.

ఇందు "పితృవాచావరతంత్రురాలను" అని పలుకుటవలన అచంచలమగు మనోవృత్తి వ్యక్తమై ధైర్యమునకు ఉదాహరణమగుచున్నది.

విభ్రమము :—

చ. అదననృసింహభూమిరమణాగ్రణివచ్చినసంభ్రమంబుతో
సుదతి సభోవలగ్నమునఁ జుక్కలపేరిటికంఠమాలయుం
బొదలుకుచాచలంబుల సముజ్జ్వలమేఖలయుఙ్ ధరింపఁగా
నదిక్రమమయ్యెఁదోయ్యలికి, నక్రమమయ్యెవిలాసవైఖరిన్.

వ్యాఖ్య :- ప్రియుని ఆగమనము వలన సంభ్రమముతో నాయిక నక్షత్రమాలను కంఠహారమును, నడుమునకు దాల్చెను. ఒడ్డాణమును కుచములపై ధరించెను.

ఇందు నాయిక ప్రియాగమనమువలన కలిగిన హర్షముచే భూషణములను తారుమారుగా ధరించుట వలన విభ్రమము వర్ణింపబడినది.

లీల:—

చ. ధర నకలంకభావమునఁ దామరసాహితునిన్ జయించు; నా
హరిపదన క్రమైు వెలుఁగు; నారయఁ బ్రాజ్ఞులకు న్వసుంధరా
సురతరునూతనాభ్యుదయశోభయొనర్చు యశఃపురంధ్రి; యా
వరుఁ దగు శ్రీనృసింహగుణవాసనఁదానుఁ జెలంగుకై వడిన్.

వ్యాఖ్య :- నరసభూపాలుడు తన నిష్కళంక భావముచే కళంకియగు చంద్రుని, జయించెను. హరిభక్తుడు, కల్పవృక్షము వంటివాడు. అతనిని అనుకరింపదలచి, కీర్తికాంత అకళంకభావమునకు చంద్రుని జయించెను. హరిపద (ఆకాశ)ము ఆక్రమించెను. కల్పవృక్షశోభను (తెల్లదనమును) వహించెను. ఈవిధముగా నాయిక ప్రియుని గుణములను అనుకరించుటవలన లీలకు ఉదాహరణమయ్యెను.

క. అళుకు కలుక; ముదము నశ్రువుఁ
గలికినఁ గిలికించితంబు; కడు నిష్టకథా
దుల నింగిత మొఱఁగించుట
దలఁచఁగ మోట్టాయితంబు దగు; నెట్లన్నన్. 111

వ్యాఖ్య :- హర్షముచే కలిగిన భయము, కోపము, సంతోషము, కన్నీరు కలిసియుండుట కిలికించితము. ఇట "ప్రియాసంగమ సమయమున" అని గ్రహించవలయును.

ప్రియుని గూర్చి తన ప్రసంగములయందు మనోభావములను చేష్టలమూలమున తెలుపుట మోట్టాయిత మనబడును.

### కిలికించితము:—

చ. పతి రచితాగసుం డదిరిపాటున వచ్చి దృఢోపగూహన
స్థిర నధరప్రవాళము గ్రసింప ససంభ్రమలోలహస్తయై
మతకరి! చాలుఁజాలు నిఁక మాదెస రాకుమటంచు నల్కతో
పతివ బొమల్ముడించెనయనాంబువుతెప్పలనప్పళించుచున్.

వ్యాఖ్య :- అపరాధియగు ప్రియుడు హఠాత్తుగా వచ్చి కౌగలించు కొని మోవి కొఱకగా చేతులతో విదిలించుచు చాలు, చాలు, నా కడకు రాకు" అని కోపముతో అశ్రువులనాపుకొనుచు బొమలు ముడిచెను.

ఇట నాయకుని మతకరి (వంచకుడు) అనుట వలన ప్రియా పరాధ ముచే కలిగిన బొమముడులు, అశ్రువులుగా గ్రహింపవలయును.

### మోట్టాయితము:—

చ. చెలులు నృసింహాంగీతమును జేరికగా నవరంజివీణెలో
వలఁ బలికింప నూర్చ్చుచును బాలిక యూర్ప్పులచేత దీపికా
కలిక చలింప నెచ్చెలులు! కంటిరె మీమృదుగానలక్ష్మికిం
దెలియఁగ మెచ్చుచున్నయది దీపియ యంచు హసించు
నెంతయున్. 113

వ్యాఖ్య :- చెలికత్తెలు వీణతో నరసభూపాలునిపై గీతములు పాయించుచుండగా నాయిక నిట్టూర్పులకు దీపము చలించు చుండెను. చెలికత్తెలు గ్రహించకుండగా "మీ గానమును మెచ్చుకొని దీపము తలయూచు చున్నదని" నవ్వుచు పలికెను.

ఇందు నాయిక నిట్టూర్పులతో తన మనోభావమును వెల్లడించుట వలన మోట్టాయితమైనది.

క. భాసురతనువల్లీవి
న్యాసము లలితమ్ము; సొమ్ము లల్పము లయ్యున్
భాసిల్లెడుశృంగారవి
కాసము విచ్ఛిత్తి యయ్యెఁ గవ; నెట్లన్నన్. 114

వ్యాఖ్య :- ప్రకాశించుచున్న శరీరము యొక్క విన్యాసము లలిత మనబడును.

అలంకారములు అల్పముగా ఉన్నను శృంగారముగా కనిపించుట విచ్ఛిత్తి అనబడును.

లలితము: —

చ. వడియుశ్రమంబుతోఁ దిభుజవల్లి మృదంగముమీఁదఁ జేర్చి కే
లెడలిననూపురంబు ఘటియింపఁగ దూతికరారవిందమం
దడుగిడి కంపితస్తనరయంబున నూర్పరదోఁప నింతి య
య్యెడ నటియించి నిల్చె సభయెల్ల ననంగునిపాలు సేయుచున్.

వ్యాఖ్య :- అలసటవలన చెమ్మగిల్లిన తన చేతిని మృదంగముపై అనిచి, నూపురమును సంధించుటకై ఒక పాదమును దూతిచేత నిడి, స్తనకంపముచే వేగమును సూచించుచు, నిట్టూర్పులు విడుచు నాయిక నిల బడి యుండెను.

ఇందు నాయిక సుకుమార రూపమును వర్ణించుటవలన లలితము భాసించుచున్నది.

విచ్ఛిత్తి: —

చ. పరిమితభూషణంబులును ఫాలముపై నెలవంకనామముం
బరఁగ నొయారియై నయనపర్వ మొనర్చె వధూలలామ తా
విరళగణేయతారలు నవీనతరేందుకలావిలాసము
న్వరుస వెలుంగఁగా విదియనాఁటి విభావరి నొల్చుకై వడిన్.

వ్యాఖ్య :- పరిమితమైన అలంకారములను, చంద్రవంక బొట్టును ధరించిన నాయిక విదియనాటి చంద్రుని వలె శోభిల్లుచున్నది. అని వర్ణించుటవలన విచ్ఛిత్తి వర్ణితమైనది.

క. వరునికథయందు దనాదర
మరయఁగ బిబ్బోక మయ్యె; ననుమతిఁ బలుకం
దర మగు తగువేళల ను
త్తర మొసఁగమి విహృత మనఁగఁ దగు; నెల్లన్నన్.117

వ్యాఖ్య :- వరుని కథ యందు అనాదరము చూపుట బిబ్బోక మనబడును.

నాయకునితో పలుకవలసిన కాలమున పలుక కుండుట విహృత మనబడును.

బిబ్బోకము: —

చ. అతఁడుగుణాభిరాముఁ డతఁడంగజసన్నిభుఁడంచు నచ్చెలు
ల్పతి యగు శ్రీనృసింహనరపాలు నుతింప లతాంగి నీటుతో
శ్రుతులఁ గరాంగుళుల్గొని పె శోభనతచ్చరితాభిపూర్ణమై
యతిశయ మందు కర్ణయుగమందవకాశ మొనర్చకై వడిన్.

వ్యాఖ్య ;- నరసభూపాలుని గుణములను చెలికత్తెలు వర్ణించుచుండెగా నాయిక తన వ్రేళ్ళతోను చెవులను వెదల్పు చేయుటలో అను నట్లుగా జొనిపెను. ఇట నాయిక అనాదరము వ్యక్తమగు చున్నది కావున బిబ్బోకము.

విహృతము: —

ఉ. బాలికయల్కతో మరలి పల్కక యుండియుఁ బ్రాణనాథుఁ డ
వ్వేళ తఖుతం బొనర్పఁగను వేగబి రాయువటంచుఁ బల్కఁగాఁ

జాలక రోషమును బ్రణయసంభ్రమము స్మదిదొమ్ములాడ నీ
లాలక కుండలద్వయ ముదగ్రగతిక్ ఘటియించె వీనులన్ 119

వ్యాఖ్య :- నాయిక అలుకతో మాటలాడకుండిన నాయకుడు క్షుతంబొనర్చినను (తుమ్మట) చిరాయువని పలుకక, చెవులకు కమ్మలు చొడుగుకొనెను, అని వర్ణించుట వలన ప్రణయకోపము నున్న నాయిక పలుకకుండుట వలన వివృతోదాహరణమయ్యెను.

క. అలుకుట చకితము; నవ్వుచు
నలరుట హసితంబు; రతుల నతిసమృద్ధో
జ్జ్వలసౌఖ్యము కుట్టమితము;
లలనకుఁ జపలత కుతూహలం; బెట్లన్నన్. 120

వ్యాఖ్య : భయపడుట చకితమనబడును.

యౌవనోదయ కారణముచే నవ్వుటను హసితము అందురు. హాస్యము వలన కలిగిన హసితము వేరుగా గ్రహింపవలయును.

రతిశ్రమవలన కలిగిన సౌఖ్యము కుట్టమితము.

సుందరమైన వస్తువునను చూచుట కుతూహలము.

చకితము :-

చ. అడుగిడి నిల్చి నిల్చి చెలి శానలు పెట్టు నడల్చి సిగ్గునం
దడఁబడఁ గాంతుఁ డున్న మణిధామ మొగింజొరఁజాల
కంతయు, స్వదఁకు గృహంబు సొచ్చియుఁగవాటము చాపున
నిల్చి నెచ్చెలు, ల్వెడలఁ జనఁ జూచినం బెనఁగు వారిజలోచన
మాధ్యసంపదన్ 121

వ్యాఖ్య :- నాయిక వెళ్ళవలచి నిలబడి, చెలులకు ఆజ్ఞలు పెట్టుచూ సిగ్గుతో తడబడుచూ, ప్రియుని మందిరమునకు వెళ్ళుటకు భయపడి యింటికి తిరిగివచ్చి తలుపుచాటున నిలబడి, చెలులు వెళ్ళిపోవుటచూచి బాధపడుచున్నది.

ఇందు నాయిక "సిగ్గునంచదడబడు" అని వర్ణించబడినది. కాన భయమువలన తడబడలేదని గ్రహింపవలయును.

హసితము :-

చ. వదనసరోజవాసనకు వచ్చినతేఁటి నదల్చి చూడఁగా
నది యసితోత్పలంబు లనియక్షులఁ ద్రాలఁగఁ జే విదుర్పఁగా
నది మరలం బయోజ మని హస్తయుగంబున వ్రాలె; నవ్వేన
మ్మదవతి, యేమి సేసినను మానదిదేమి యటంచు నెంత
యున్. 122

వ్యాఖ్య :- నాయిక తన ముఖపద్మములపై వాలిన తుమ్మెదను ఆదలించవగా, నల్ల కలువని భావించి కన్నులపై వ్రాలెను. తిరిగి అదలించగా, పద్మమని భావించి, హస్తముపై వ్రాలెను. దీనిని చూచి చెలులు నవ్విరి. ఇందు నాయిక తుమ్మెద భ్రాంతిచే పొందిన చేష్టలను వర్ణించుట వలన హసితము అయినది.

కుట్టమితము :-

చ. కెరలి ప్రియుండు మోవిపయిఁ గెంపులునింపుటఁ బారవశ్యత
త్పరత నెఱుంగ లేక పిదప న్నిలువద్దము చూచి సిగ్గునం
దరుణి చెలుల్గనుంగొనినఁ దారింక నేమని యాడుకొందురో
యని నటించుఁ జిల్కకు నవారణ ముద్దులు వెట్టుసారెకున్
123

వ్యాఖ్య : ప్రియుడు రతియందు మోవిపై కెంపులు నింపగా, చెలుల నుండి దాచుటకై నాయిక అకారణముగా చిలుకలను ముద్దు పెట్టు కొనుచున్నది. ఇందు మోవిపై కెంపులను వర్ణించుటవలన కుట్టమిత మయినది.

కుతూహలము :-

చ. కలికి నృసింహభూవిభునిఁ గాంచినవప్రణయాభిరామయై
కలితకరాబ్జకేళిరమణంబు భ్రమింపఁగఁ జేసి విభ్రమం
బలవడఁ బ్రాణనాథహృదయాబ్జము నిన్నఁదఁబాయలేక యి
ట్లలమిభ్రమించుచున్నదని యేర్పడఁజెప్పెడిచందమందఁగన్

వ్యాఖ్య :- నాయిక రాజవీధి వెంటవెళ్ళుచున్న నరసరాజుని చూచి తన హృదయమున దప్పక చేర్చుకొందునని ప్రతిజ్ఞచేయుచున్నట్లుగా కేశములను తన చేతితో పట్టుకొని చూచుచుండెను. ఇందు నాయిక చాపల్యము వర్ణించబడినది,

తే. మఱియు శృంగార మంగనామణులయందు
నంకురితపల్లవితపుష్పితాది భేద
వర్ణితాకృతియై దశావస్థ మరియు;
వీని నామక్రమంబును విస్తరింతు. 125

వ్యాఖ్య :- అంకురావస్థ, పల్లవావస్థ, కోరకావస్థ. పుష్పావస్థ ఫలావస్థ, అని స్త్రీలయందు శృంగారావస్థలు ఐదు విధములు. ఈశృంగారావస్థలు దశావస్థలను పొందును. వీనిని క్రమముగా వివరింతును.

క. ఇలఁ జూచుట చింతించుట
తలఁచుట గుణవినుతి యరతి తాపము లజ్జా
స్ఖలనము గమనము మూర్ఛయు
నల ధన్యత యాన నవస్థలగు; నెట్లన్నన్. 126

వ్యాఖ్య :- చూచుట, చింతించుట, తలఁచుట, గుణతినుతి, అరతి తాపము, లజ్జాత్యాగము, గమనము, మూర్ఛధన్యత అనునవి దశావస్థలు.

చక్షుఃప్రీతి :-

మ. అనురాగాంబుధియుబ్బి వెల్వడినయట్లా పూర్ణఘర్మాంబుబుల్
దనువల్లిం దిగజాఱఁ గనుఁగవలేఁదళ్కుల్విసాళించుచుఁ
దన విల్కానిపురప్రవేశకలనానాళీకదామంబులై
తనరం గోమలి నిన్నుఁ జూచె నరసేంద్రా! సాంద్రతేజోనిధీ 127

వ్యాఖ్య :- అనురాగసముద్రము ఉబ్బినట్లుగా ఆమె శరీరమునుండి చెమట బిందువులు దిగజారగా, మన్మధునిపుర ప్రవేశ సమయమున కట్టిన తామర పువ్వులదండలనెడి చూపులతో ఆ యువతి నిన్ను జూచు చున్నది అని నాయిక నాయకుని చూచినట్లు వర్ణించుట వలన చక్షుప్రీతి ఆయినది.

చింత :-

మ. అరవిందంబు విలాసమందిరము; నీహారాంశుఁడే సోదరుం
డరయ న్గోత్రవిరోధ మేటికి? నసహ్యం; బంచునూహించి యి
ర్వురఁ బొందించుపయోధికన్యక్రియఁ జేర్చుం గేలు గండస్థ
లిం; దరుణీరత్నము చింతచేత నరసేంద్రా! సాంద్రతేజోనిధీ 128

వ్యాఖ్య - పద్మము నా విలాసమందిరము, చంద్రుడు నా సోద రుడు. వీరిరువురకును వైరమేల ? వీరిరువురకును సఖ్యత చేకూర్చుటకై చెక్కిట చేయిజేర్చి చింతించు లక్ష్మిదేవివలె నాయిక ఉన్నది. ఇట చింతిం చుట యున్నది కావున సంకల్పము.

సంస్మృతి:—

మ. వరభూషాదులపై మనంబిడక దృగ్వ్యాపారమొంకేని బర
స్పరసందర్శనాతిభిన్నమయి నాపట్టెంగఁ గార్యాంతర
స్మరణం బేమియు లేక నిశ్చలత నీసాంగత్యముం గోరి మా
వారిణేలోచన యాత్మయందు నరసేంద్రా! నిన్ను భావించెరా.

వ్యాఖ్య :- ఓ నరసభూపాలా నీ ప్రియురాలు, ఆభరణములపై మనస్సు పోనీక, పరస్పర సందర్శనాతి భిన్నమయి, కార్యాంతరమేమియు లేక, నీ సాంగత్యమునే కోరియున్నది. ఇందు నాయిక నాయకుని తలచి నట్లుగా వర్ణితమైనది కావున సంస్మృతి.

గుణకీర్తనము:—

మ. పలుకుం దోడగు వీణలోఁ జెలియనీపై గీతము ల్మీటఁ దో
య్యలిమైనీడ మెఱుంగుఁగాయనిని పై యవ్వీణలో వాణి యో
లలితాంగీ! మనచిత్తముం బ్రియుఁడు కొల్లల్వెట్టెఁగా యంచు
వెల్వలికెం దానుబుసాడ వచ్చెననఁ గన్పట్టు నృసింహాధిపా.

వ్యాఖ్య :- నాయిక వీణపై నరసరాజుపై గీతములు ఆలపించుచుండగా, నాయిక యొక్క ప్రతిబింబము వీణకాయపై పడెను. ఆ ప్రతిబింబముతో సరస్వతి నరసభూపాలుడు "మన చిత్రము కొల్లగొట్టెను కదా!" అని పలికినట్లుగా యున్నది. ఇందు నాయిక, నాయకునిపై గానము చేయుచున్నట్లు వర్ణించుటవలన గుణవినుతి కలదు.

అరతి:—

మ. నిరతం బాత్మకరాంఘ్రిభావాలునఖ కాంతిస్ఫూర్తికిం దిగ్గుడై
శరణం బొందు ప్రవాళపద్మబిసపుష్పశ్రేణికిం గ్రమ్మఱన్

శరణంబందుట హీన మంచునో మదిక్ శైత్యోపచారక్రియా
గరిమం బొల్లదు మానినీమణి కడంకన్ శ్రీనృసింహాధిపా. 131

వ్యాఖ్య :- తన చేతులు, పాదములు, బాహువులు, గోళ్ళు, వీని కాంతితో సరిపోలుచున్న చిగురాకులు, తామరతూండ్లు, తామర పూవులను శరణ వేడుట హీనమని భావించి శైత్యోపచారములు అంగీకరించుటలేదు. ఇందు శైత్యోపచారముల యందు, ఇష్టము చూపకపోవుట అరతి.

తాపము:-

మ. ధవళాక్షీమణి మేను హేమలతయన్ తత్త్వంబు మున్నెల్లఁద
త్కవిలోకోక్తియటంచునుంటి; పదితథ్యం బయ్యె; నెట్లన్న భ
వ్యవియోగానలతప్తమై నిబిడబాష్పాసిక్తమై డస్సియు
న్నవశోభాతిశయంబుఁ జెందె నరసేంద్రా! సాంద్రతేజోనిధీ,

వ్యాఖ్య :- ఓ నరసేంద్రా ఆయువతి మేను బంగారు తీగ'' అను మాటలు కవిప్రౌఢోక్తిగా భావించితిని, కాని నేడు ఆమె శరీరము వియోగాగ్ని తప్తమై, బాష్పాసిక్తమై కృశించు నూతన శోభను వహించుచున్నది. ఇందు నాయిక విరహతాపమును వర్ణించుటవలన తాపమైనది.

లజ్జాత్యాగము:-

మ. చెలినీమూర్తి లిఖించిచిత్రఫలకంజెన్నొందుబాష్పాంబుసి
చ్ఛలమా పయ్యెదమీఁదఁ జేర్చుకొన నా చిత్రం బలక్ష్యం
బుగా, బళిరే! కట్టినచీరయుఁ బగయు కాఁ బాటించె దైవం
బటం, చలినీలాలక యార్తిఁ జెందు నరసింహా! యింకఁ
బాలింపుమీ. 133

వ్యాఖ్య :- ఓ నరసభూపాలా! మా చెలి నీ చిత్రము లిఖించుచుండగా, చిత్రఫలము కన్నీటి బిందువుల తడసిన పైటపై పెట్టుకొనగా చిత్రము కరిగిపోయినది నా చీరయే నాకు పగగా దైవము చేసెనని

బాధను పొందెను. అని వర్ణించుట వలన నాయిక లజ్జాత్యాగము చేసి చిత్రము లిఖించినట్లు భావింపవలయును.

గమనము:-

మ. చెలికత్తెల వంచన చేసి యొక్కతియు తాఁ జెన్నొందనీ యొద్దకు
న్నళినాక్షీమణి రాఁ దలంచి నవరత్నప్రోతసౌధాంగణ
స్థలినాల న్వెన్నని వచ్చు నిర్మలతనుచ్ఛాయ న్నిరీక్షించి నె
చ్చెలి యేతెంచె ననుంగఁ బోలు నని నిల్చెన్ శ్రీనృసింహా
ధిపా. 134

వ్యాఖ్య :- ఓ నృసింహాధిపా! చెలికత్తెలను వంచించి, తానొక్కతియె నీ యొద్దకు రాదలచి రత్నసౌధ ప్రాంగణమునకు రాగా, తన నీడను చూచి తన చెలికత్తె వచ్చుచున్నదని భ్రమపడినది అని వర్ణించుట వలన గమనము కానవచ్చుచున్నది.

మూర్ఛ:—

మ. బలితంబైన యనంగ వేదనలచేఁ బల్మారు నిల్పోపలే
కలికీలాలక ప్రాణము ల్వెడలి నేత్రాంభోజమార్గంబునం
గలయం ద్రొక్కుచు వచ్చియున్నలవునం గన్నీటియే అడ్డమై
నిలుపన్నిల్చె నృసింహభూరమణ! మున్నెంతయుం గాఁ బాడించెటన్.

వ్యాఖ్య :- నృసింహభూరమణా, మన్మథ వేదనను సహించలేక నాయిక యొక్క ప్రాణములు కన్నుల మార్గమునుండి పోవునేమో యను భయము వలన కన్నీటియేలు అడ్డముగా నిల్చెను. ఇందు నాయిక మూర్ఛ స్థితిని వర్ణించెను.

ధన్యత:—

మ. శుకవర్గం బొకమాటలో మెలఁగ నాసూనాయుధుం డాంత
రంగికుఁడై యుండె మరాళి యొక్క ప్రేళ్ళుబ్బి

వర్తించెం బాయక వేడ్కన్ సుముఖత్వ మొందె శశి మాయ
జ్ఞాక్షి నేమంబుతో, నకలంక స్థితినీవు గూడ నరసింహా! రాజ
కంఠీరవా. 136

వ్యాఖ్య :- ఓ నరసింహ! నీవు నా చెలిని కలియగా చిలుకలు దాని మాటలలో మెలగేను. మన్మధుడాంతరంగికుడై వర్తించెను. హంసలు అనుకూలముగా ప్రవర్తించెను. చంద్రుడు సుముఖుడుగా ఉండెను. ఇందు నాయిక, నాయకుని చేరుట వలన ధన్యత చెందినట్లుగా వర్ణింపబడినది.

తే. తెలియ శృంగార మిదియును ద్వివిధ మగుచుఁ
బరఁగు సంభోగవిప్రలంభంబు లనఁగ;
నందు బహుభేదముల నగణ్యంబుకాక
యేకవిధ మయ్యె సంభోగ మెట్లటన్న. 137

వ్యాఖ్య :- శృంగారము, సంభోగ శృంగారమనియు, విప్రలంభ శృంగారమనియు ద్వివిధము. సంభోగ శృంగారము ఏకవిధము.

సంభోగము :-

మ. మరుఁడాచార్యుఁడు గా విశీర్ణకబరీమాల్యాళి పుష్పాంజలి
స్ఫురణ ల్గాఁ దదుపేతభృంగనినదస్తోమంబు గానంబుగా
వరమంజీరరవంబు తాళగతి గా వర్ధిల్లు శాతోదరి
సురత న్నృత్యయవేగ తాండవ మొనర్చుం జాతితాభిష్టముల్
138

వ్యాఖ్య :- మన్మధుడే ఆచార్యుఁడుగా, వీడిన కొప్పులో నుండి జారెడి పుష్పములే పుష్పాంజలిగా, పూలలోని తుమ్మెదల ఝుంకారములే గానముగా, అందెల చప్పుడే తాళముగా నాయిక పురుషాయితము వర్ణింప బడినది. కావున సంభోగ శృంగారము.

క. పురుషులకుఁ దలోదరులకు
నరయుంగా విప్రలంభ మభిలాషేర్ష్యా

విరహప్రవాసకారణ
పరిణతిచే నాల్గుగతులఁ బరంగుచు నుండున్. 139

వ్యాఖ్య :- విప్రలంభ శృంగారము అభిలాష, ఈర్ష్య, విరహ, ప్రవాస భేదములచే నాలుగు విధములుగా నుండును.

క. కలయుటకు మున్ను కోరిక
యిల నభిలాషంబు; మాన మీర్ష్య; విరహ మాఁ
గలసి యెడఁబాయు హృదయో
త్కలిక; ప్రవాసము విదేశగతిఁ యెట్లన్నన్. 140

వ్యాఖ్య : నాయిక, నాయకుని కలిసికొనుటకు ముందు కలిగిన కోరికయే అభిలాషమనబడును.

ఈర్ష్య అనగా మానము. యిట మానమనగా కోపమని గ్రహించవలయును.

నాయికా, నాయకుల ఎడబాటు విరహమగును.

నాయికా, నాయకులు భిన్న దేశముల నుండుట తటస్థించినచో ప్రవాస విప్రలంభము.

అభిలాషము :-

చ. అనయము శ్రీనృసింహులలితాంక తలంబున నుండ వచ్చు;నా
యనఘునఖాంకసంగతుల నందఁగ వచ్చు; నృపాలమౌళితోఁ
జనువునఁ గులకఁ వచ్చు; గుణసంగతి మెచ్చులు చూడ వచ్చు;
నో. వనజదళాక్షి! యాకనకవల్లికి నైనను ధన్యనౌదుగా. 141

వ్యాఖ్య : ఇందు నరసభూపాలునితో సుఖింపవలయునను కోరికను నాయిక వ్యక్తము చేయుచున్నది. కావున అభిలాష విప్రలంభము వర్ణితము.

ఈర్ష్య :-

మ. వదనాగ్రంబున వాణియున్న దిమము న్వాక్రువ్వనీ; సందిరా
మదిరాక్షీమణి యున్నదక్షులఁ, మము న్మన్నించి వీక్షింపనీ;
దదియుంగాక నృసింహ! నీవిపులబాహాశ్లేష మే నొందనో
ర్వదు భూదేవి; బహుప్రియారతుని నిన్ బ్రార్థింపనింకేటికిన్ 142

వ్యాఖ్య :- వదనాగ్రమునందు వాణియుండి మాట్లాడనీయుటలేదు. కనులయందు లక్ష్మీదేవి యున్నది. బాహువులయందు భూదేవి యున్నది. కావున నిన్ను ప్రార్థింప ప్రయోజనమేమని నాయిక నరసభూపాలునిపై ఈర్ష్యను పొందుచున్నది.

విరహము :-

ఉ. నచ్చెలు లీనృసింహధరణీవరుఁ దెచ్చెద మంచుఁ బోయి రా
రిచ్చట నీవునుం గరుణ యించుక లే కలరంపుగుంపులం
గ్రుచ్చెద వేల? మత్ప్రియునిఁ గూర్పుము మన్మథ; నీకు మద్భుజం
దెచ్చుటకై యొసంగెద మదీయకటాక్షము లన్నమహాస్త్రముల్ 143

వ్యాఖ్య :- ఓ మన్మథా నృసింహుని తెచ్చెదమని వెళ్ళిన చెలులు తిరిగి వచ్చుటలేదు. నా ప్రియుని తెచ్చుటకై నా కటాక్షములనెడి అస్త్రములు నీకు ఇచ్చెదను. నరసభూపాలునితో ఎడబాటు పొందుచున్న నాయిక యొక్క వచనములో విరహ విప్రలంభము గోచరించుచున్నది.

ప్రవాసము :-

చ. చిరయశ! యోబభూవరనృసింహ! భవద్రిపుకాంత కాననాం
తరమున కేఁగి యందు నిజనాథునిఁ గానక మన్మథార్తయై

వరుని సరోజపత్త్రమున వ్రాయుచునెవ్వెంగరము ల్సెమర్పఁగా
సరయనిజాంగకంబె వగయయ్యెనటంచుఁదలంచు దైవమున్
144

వ్యాఖ్య : ఓ భూవరా! నీ శత్రుకాంత అరణ్యమున సంచరించుచు భర్తను కానక, మన్మథార్తయై ఏ రోజు పత్రము వ్రాయు సమయమున చేయి చేమర్థగా తన హస్తమే తనకు శత్రువయినదని బాధపడుచుండెను ఇందు నాయికా, నాయకుల భిన్నదేశస్థితిని వర్ణితమైనది.

రసాభాసము :-

క. పలువురకొక భామినిపైఁ
దలఁపును, నొకవారసతికిఁ దగఁ బలువురపై
వలపును, మృగవిహగాదుల
కెలవు రసాభాస మయ్యె క్షితి; నెట్లన్నన్. 145

వ్యాఖ్య : అనేకమంది యువకులకు ఒక యువతిపై ప్రేమ యుండుటయు, ఒక వారాంగనకు పలువురిపై ప్రేమ యుండుటయు, మృగ విహారాదుల ప్రేమయు రసాభాసమగును.

చ. అలఘువిశీర్ణపక్షయుగమైయమితోన్నమితోర్ధ్వకాయమై
గళరవము ల్దలిర్పఁ బ్రియకాంతకు ముద్దులు వెట్టియుబ్బునం
బలముఖ మేడపై కెగసి పక్షము ద్రిప్పుచుఁ గుంచితాస్యమై
పొలఁతుకఁ బిల్చువిభ్రమకపోతముహుంకృతనాదమాధురిన్
146

వ్యాఖ్య : ఇందు కపోతముల రతి వర్ణింపబడినది. కావున రసాభాసము.

క. భావింప భావశాంతియు
భావోదయభావసంధిభావశబలతల్
భావం బడఁగుట పుట్టుట
ద్వైవిధ్యము బహుత యనఁగఁ దగు; నెట్లన్నన్. 147

వ్యాఖ్య :- భావశాంతి, భావోదయము, భావసంధి, భావశబలత, అని భావములు నాలుగు విధములు, భావమడగుట భావశాంతి, భావము పుట్టుట భావోదయము భావద్వయముండుట భావసంధి. పెక్కు భావము లొకచోట నుండుట భావశబలత అనబడును.

భావశాంతి:—

చ. తలఁపఁగ రాజశేఖరుఁ డతండు, తలోదరి! సర్వమంగళా
కలితవు నీవు; మీర లొకగాత్రము లై వడిఁ గూడి యాడుచుం
జెలఁగుటయొప్పుఁగా, కలుఁగఁ జెల్లునె మీకు? కనిబోటి
ప్రమోక్తిఁగా
లలనకుఁ దోఁచె బాష్పసలిలంబు నివారితమానపంకమై 148

వ్యాఖ్య :- అతడు రాజశేఖరుడు (పరమేశ్వరుడు), నీవు సర్వమంగళవు (పార్వతివి) మీరు ఒకచోట కలసి యుండుట ఒప్పగును అని చెలికత్తియ పలుకగా నాయికకు బాష్పసలిలములు కలిగినవి అని చెలికత్తియ ప్రార్థనవలన నాయికకు భావశాంతి కలిగినట్లుగా వర్ణింపబడినది.

భావోదయము:—

ఉ. మేలములాడు వేళ నసమేలము లై చెలు లెల్లఁ గూడి యో
బాలిక శ్రీనృసింహనరపాలు వరించెదవే? యటన్న నీ
లాలకయంగవల్లిఁ బులకాంకురము ల్మనలొత్తనే మనం
జాలక యూరకుండె నని శంబువినమ్రముఖాంబుజాతయై 149

వ్యాఖ్య :- చెలులు వేళాకోళము చేయు సందర్భమున శ్రీనృసింహుని వరించదవే" అని పలుకగా నాయికకు పులకాంకురములు కలిగినవి. అని వర్ణించుట వలన నాయికకు భావోదయము కలిగినట్లుగా గోచరించుచున్నది.

భావసంధి:—

మ. హరి కానంగ శరాళి యై, యరికవేలాభీలదివ్యాశుగో
త్కరమై, శౌరికిఁ బాటలాబ్జకలికాదామంబులై, వైరికి

న్నిరతాగ్నిప్రభలై వెలుంగునరకానీకాధికోల్లాసభా
సురసత్యారమణీకటాక్షములు ప్రోచున్ శ్రీనృసింహాధిపున్

వ్యాఖ్య :- సత్యభామ కటాక్షములు హరికి శృంగారాత్మకము గాను, నరకాసురునకు వీరరసాత్మకముగాను ఆనందమును కలిగించు చున్నట్లుగా వర్ణించుట వలన భావసంధి కలదు.

భావశబలత:-

మ. చెలులేమందురొ? భావవీధి, నకటా! శ్రీనారసింహేంద్రు కౌఁ
గిలినా కెన్నఁడుగల్గునో? నృహరితోఁ గ్రీడింపఁగాఁ బోవుచం
చలపుంజిత్తము నేమిసేయుదు? గురున్సద్భక్తిఁ బ్రార్థింతునో?
యల ప్రాణేశ్వరుఁ జూడకున్నఁ బరితాపాటోపముల్మానునే.

వ్యాఖ్య :- నారసింహుని నెన్నడు కౌగలించుకొందునో నృసింహుని తో క్రీడింపగాపోవు మనస్సును ఏమిచేయుదును, గురుని ప్రార్థింతునా? ప్రాణేశ్వరుని చూడకున్న పరితాపము మానుట లేదు. నన్ను చూచి చెలు లేమను కొందురో అని నాయిక పెక్కు భావములు కలిగి యుండుటచే భావశబలత.

నవరససంకరము:—

మ. జయలక్ష్మీస్మరతప్తమై, ప్రతాపయుతమై, శత్రుచ్ఛిదాధుర్యమై,
ప్రయతార్తావనమై, కపీంద్రగతియై, రక్తార్థియై, నిర్ఘనో
దయవిద్యున్నిభమై,నకంపమయి, వందారుస్పృహాశూన్యమై,
నయమొప్పన్నరసింహుఖడ్గమమరున్నానారసప్రక్రియన్.

వ్యాఖ్య :- నృసింహుని ఖడ్గము జయలక్ష్మియందు కోరిక గలదై, శౌర్యము గలదై, శత్రువులను జయించుట యందు సమర్థమై, ఆర్తులను రక్షించునదై, చంచలమై, ప్రణతులను సంహరింప కోరిక లేనిదై యుం డెను. అని వర్ణించుటలో శృంగారాది నవరసములు వర్ణితమైనది.

ములవిస్తరిల్లుచున్నది. ఈ క్రమమున విటీవిటులయందు సుఖ, దుఃఖాదులు సహృదయులకు పూర్ణానందము కలుగుచున్నది.

తే. అల పదార్థంబు లగు విభావానుభావ
సాత్త్వికాదులఁ గూడి రసత్వ మొందు
నవని భావంబు వాక్యార్థ మనఁగ నెగడి
తంతువులు గూడి పట మనఁ దనరు కరణి. 157

వ్యాఖ్య :- రత్యాది స్థాయి భావము పదార్థములగు విభావాదులతో కూడి వాక్యార్థరూపమగు రసముగా పరిణమించుచున్నది.

మ. రమణీయోల్బణతాసమేత మగు నీరత్యాదిభావాబ్ధిలో
నమరం బుట్టుచు మున్గుచుం దగుఁదరంగారూఢి సంచారిసం
ఘము, లీతత్ప్రతిపన్న మా రసము తత్కాలంబునందై నన
త్యము రామాదులయందు; నాట్యమున సభ్యావాసమై
భాసిలున్.

వ్యాఖ్య :- సముద్రమునందు అలలవలె స్థాయిభావనగు రత్యాధికము విభావానుభావ స్వాతికభావములచే సంచారిభావములు వచ్చుచూ, పోవుచుండును. ఈ సంచారి భావములు తొలుత నాయికా, నాయకులయందుండి, పిదప వారి చరిత్ర ప్రదర్శించునప్పుడు ఆ రసము ప్రేక్షనకు కలుగును.

శా. శేషేశప్రతిమానవైభవ! భవాశ్లిష్టస్రవంతీమరు
చ్ఛాఖిస్ఫూర్తియశఃపరంపర! పరక్ష్మాపాలకప్రాజ్యరా
జ్యాఖర్వస్మయపుంజభంజనకృపాణాకల్ప! కల్పాంతవే
లాఖేలత్ప్రబలారవశ్రమమహోలంఘిప్రతాపోదయా.

అచలజిహ్వము :-

క. భోగాంబువాహవాహవి
భాగేహాభావు కాంగభావభవమహా

భాగమహీ భాగమహా
భోగావహ బావాబ్జభోగిపుంగవభోగా. 160

కవిరాజవిరాజితము

నిరుపమరూప! దిలీపమనూపమనీతికలాప! కలాపధర
స్మరణభవానుభవానిశమానితమానసపద్మసపద్మరట
త్కరివరఘోటకకోటికరంభితకాంత! నిశాంత నిశాంత మహా
హరిహయదిక్తరణిస్ఫురణైకవిభాధికలాభ కలాభవనా. 161

గద్యము. ఇది శ్రీహనుమత్ప్రసాదలబ్ధకవితాసారసారస్వతాలంకారనిరంతరప్రతిభాబంధుర ప్రబంధపరనరచనాధురంధర ప్రబంధాంక వేంకటరాయభూమణసుపుత్త్రి తిమ్మరాజపౌత్త్రి సకలభాషావిశేష నిరుపమావధానశారదామూర్తి మూర్తిప్రణీతంబైన కావ్యాలంకారసంగ్రహంబను మహాప్రబంధంబునందు రసస్థాయి సామాన్య లక్షణంబును, దద్వ్యవహార కరణంబును, విభావాను భావ సంచారిభావ ప్రపంచంబును, శృంగార చేష్టాప్రకరణంబును, నవస్థానిర్ణయంబును, సంభోగవిప్రలంభభేదంబును, రసాభాసభావశాంతి భావోదయభావసంధి భావశబలతా సంకరతలును, రస వర్ణాధిదేవతావిశేషంబును నన్నది తృతీయాశ్వాసము.

—(0)—

శ్రీ ర స్తు

# కావ్యాలంకారసంగ్రహము

## నరసభూపాలీయము

....)o(....

### చతుర్థాశ్వాసము

క. శ్రీకర! గభీరగుణర
త్నాకర! కటకాధిరాజహయపతిసేనా
భీకర! భుజప్రతాప
స్వీకృతజయసాంద్ర! నాగసింహనరేంద్రా.

తే. అవధరింపుము దోషంబు లవి వచింతు;
నవియు శబ్దార్థగతము లై ద్వివిధము లగు;
నందుఁ బదవాక్యగతములౌ నరయ శబ్ద
దోషములు; వీనిలోఁ బదదోషతతులు. 2

వ్యాఖ్య :- కావ్యమునందు దోషములు శబ్ద దోషములు, అర్థ దోషములు అని రెండు విధములు. అందు శబ్దదోషములు పదగతములు, వాక్యగతములు అని రెండు విధములు. అందు పదదోషములు ఎట్టివనగా.

సీ. అప్రయుక్తం బపుష్టార్థంబు నేయార్థ
మసమర్థకంబు నిరర్థకంబు
గ్రామ్యంబు విగతసంస్కారంబు గూఢార్థ
మన్యార్థ మశ్లీల మప్రతీత
మప్రయోజనము క్లిష్టార్థబంధంబు సం
దిగ్ధంబు విపరీతధీప్రదాయి

యవిమృష్టవిధేయాంశంబు పరుషంబు
ననఁగఁ గావ్యంబులం దరసి చూడ

తే. పదగతంబులు వెలయు సప్తదశ సంఖ్య
గడలుకొనఁ; వీనిలక్ష్యలక్షణము లెల్ల
విస్తరించెదఁ గవితాప్రవీణసుకవి
నివహనిరతోపకారసత్క్రియఫణితి. 3

వ్యాఖ్య :- 1) అప్రయుక్తము, 2) అపుష్టము, 3) నేయార్థము, 4) అసమర్థము, 5) నిరర్థకము, 6) గ్రామ్యము, 7) చ్యుతసంస్కారము 8) గూఢార్థము, 9) అన్యార్థము, 10) అశ్లీలము, 11) అప్రతీతము, 12) అప్రయోజకము, 13) క్లిష్టము, 14) సందిగ్ధము, 15) విరుద్ధమతికృత్తు, 16) అవిమృష్టవిధేయాంశము, 17) పరుషము అని పదగతదోషములు పదునేడు.

క. ఈకవితాదోషోత్కర
మేకడ నీ వొనఁగుమాడ్కి నియ్యకొ ఖలులౌ
నా కుకవులుదాతలకు ను
పాకుకవు లొనర్చు కృతులయందు వసించున్. 4

వ్యాఖ్య :- ఈ దోషములు కావ్యములయందు కవులు చేయుచుందురు.

అప్రయుక్తము:-

క. కవులు ప్రయోగింపని పద
మవనిం దగ నప్రయుక్త మగు; నెట్లన్నన్
ద్రవిణైలబిలుం డల దు
శ్చ్యవనమహాభోగిఖేటనం స్తుతుఁ డనఁగన్. 5

వ్యాఖ్య :- కవులు ప్రయోగింపని పదములు ప్రయోగించుట అప్ర

యుక్తమగును. ఇలబిల, దుశ్చ్యవన, ఘేట, శబ్దములు అప్రయుక్తదోషములుగా చెప్పబడెను.

అపుష్టార్థము:—

క. ఎనయఁ బ్రకృతోపయోగం
బును జెందక యున్న పద మపుష్టార్థంబౌ;
దని వెను వింశత్యర్థా
నను వింశత్యర్థరథునిసందనుఁ డనఁగన్. 6

వ్యాఖ్య :- ప్రకృతమునకు ఉపయోగింపని పదములు ప్రయోగించుట అపుష్టార్థమను దోషమగును. ఇట రావణాసుడు అనుటకు "వింశత్యర్ధాననుఁడని" ప్రయోగించుటయు దశరథుడనుటకు "వింశత్యర్ధరథుఁడని" ప్రయోగించుట అపుష్టార్థ దోషము కలిగినది.

నేయార్థము:—

క. ఇలఁ దనసంకేతంబున
నిలిపినపద మెంచి చూడ నేయార్థం బౌ;
బలు తేనెడిండిగమి నగు
నల సాగరకర్ణయానయులక లనఁగన్. 7

వ్యాఖ్య :- కవి స్వయముగా కల్పించుకొన్న సంకేతమున పదము ప్రయోగించుట నేయార్థము అనబడును. ఇందు "సాగరకర్ణయాన" (మదగజగమ) తేనె దిండిగమి (తుమ్మెదల గమనము)అని ప్రయోగించుట నేయార్థము.

అనమర్థము :—

క. ధర నప్రసిద్ధయోగం
బని ప్రయోగించు పదము యనమర్థం బౌ;
శరధరధాజనికేతను
గురుపంకజ చక్రహస్తుఁ గొలుతు నటన్నన్. 8

వ్యాఖ్య :- కవి ప్రయోగించు పదమునకు వ్యుత్పత్త్యర్థమును బట్టి రెండర్థములున్నను, పదమును ప్రసిద్ధార్థమునందే ప్రయోగింపవలయును. అప్రసిద్ధార్థమున ప్రయోగించుట అసమర్థదోషము. ఇందు "శరధర" పదము సముద్రార్థము, పంకజము, శంఖము అర్థమున ప్రయోగించుట దోషము.

నిరర్థకము :,

క. ఇలఁ బాదపూరణార్థం
బలవడిన పదంబు కృతి నిరర్థక మయ్యెన్;
దలఁపఁగ వెలయుచు లలి ను
జ్జ్వల మగునీతనిఖిలానసౌష్ఠవ మనఁగన్. 9

వ్యాఖ్య :- పాదపూరణార్థము ప్రయోగించు పద్యములు నిరర్థకము. తలపగ, వెలయుచు, లలి,ఉజ్జ్వలమగు, మొదలగు పదములు నిరర్థకములు.

గ్రామ్యము :-

క. పామరులభాష గ్రామ్యము;
భామినికటిగల్లములు విభాసిల్లు ననన్,
గోమలిచన్నులుఁ గన్నులుఁ
గామునికందువు లొసర్చెఁ గడువడి ననఁగన్. 10

వ్యాఖ్య :- పామరుల భాషను ప్రయోగించుట గ్రామ్యమను దోషము. చన్నులు, కన్నులు, గ్రామ్యపదములుగా కవి సూచించెను.

చ్యుతసంస్కారము :-

క. వ్యాకరణదుష్ట మగు పద
మేకడఁ జ్యుతసంస్కృతాఖ్య; మిది యెట్లన్నన్
శ్రీకమలకాంతవదనే
వాకర్ణరుఁ డనఁగఁ గరుణ వారిధి యనఁగన్. 11

వ్యాఖ్య :- వ్యాకరణ దుష్టమగు పదములను ప్రయోగించుట చ్యుత సంస్కారమను దోషముగును. కమలకాంత (కమలాకాంత) కరుణ వారధి (కరుణావారధి) అని ప్రయోగించుట దోషము.

గూఢార్థము, నన్యార్థము :-

క. కృతి నఖ్యాతము గూఢం;
బతిశయరూఢివ్యపేత మన్యార్థంబై
క్షితిఁ దగు; 'శోణితనయా-నం
ఊతఁ' డనఁగ 'సమానుఁ డతఁ డహీధ్యక్షుఁ' డనఁగన్. 12

వ్యాఖ్య :- కావ్యమునందు గూఢార్థమున అన్యార్థమున ప్రయోగించుట అన్యార్థమను దోషము. ఇందు రుధిరమునకు శోణిత శబ్దమును పాటల వర్ణముగా ప్రయోగించుట గూఢము, సమానుడను శబ్దమును మానసహితుడను అర్థమునందు ప్రయోగించుట అన్యార్థము.

అశ్లీలము :-

క. వ్రీడజుగుప్సామంగళ
శీలము లగు పదము లొకటఁ జేర్చిన నవి య
శ్లీలము లగుఁ గృతి; నేత
న్మూలము లగు త్రివిధభేదములఁ దెలిఁగింతున్. 13

వ్యాఖ్య :- వ్రీడా, జుగుప్సాకరము అమంగళకారకము అని అశ్లీలము మూడు విధములు.

క. వసుదేవయోని గోపీ
వినరమహాపీనకుచనవీనాశ్లేషో
ల్లసితుం డనఁ, గాలిందీ
రసవిహారణకరణనిత్యరసికుం డనఁగన్. 14

వ్యాఖ్య :- ఇందు యోని, మహాపీన, కాలింది పదములు వరుసగా వ్రీడా, జుగుప్సా, అమంగళకారకములు.

అప్రతీతము :-

క. అల శాస్త్రపురాణములనె
కల శబ్దం బప్రతీతకం బగుఁ గృతులం;
దలఁతు వృషాకపిఁ ద్రిజగము
నెలమి నజావృతముఁ జేయు నీశ్వరు ననఁగన్. 15

వ్యాఖ్య :- శాస్త్ర, పురాణములలోనే ప్రసిద్ధమగు పదమును ప్రయోగించుట అప్రతీతికము. ఇందు వృషాకపి, (శివుడు, విష్ణువు) అజా (మాయ) అనుశబ్దములు లోక వ్యవహారమున కానరావు.

అప్రయోజనము :-

క. అవిశేషవిధాయకమై
కవిసిన పద మప్రయోజకము; భూతివిభా
ధవళితహరసుతుఁ గొలుతును
నవనలినహరద్విపాస్యు నయముగ ననఁగన్. 16

వ్యాఖ్య :- ప్రయోజనము లేని విశేషణ పదమును ప్రయోగించుట అప్రయోజకమగును ఇందు హర శబ్దమునకు "భూతివిభాధవళిత" అను విశేషణము, ద్విపద శబ్దమునకు "నవనళినహర" విశేషణమును ప్రయోజన రహితమైనవి.

క్లిష్టము :-

క. దూరార్థము క్లిష్టం బగు;
ధారుణిఁ బవనాశనేంద్రధరమకుటాలం
కారమణిజనకవరవు
త్రీరమణకుమారరూపనిఁ బితుఁ డనఁగన్. 17

వ్యాఖ్య :- తాత్పర్యమును నిర్ణయించుటకు సామాగ్రి లేక దూరార్ధముగా నుండుట క్లిష్టము అను దోషము పవనాశవేంద్ర ధర=శివుని యొక్క, మకుటాలంకారమణి=చంద్రుని యొక్క, జనక=సముద్రుని

యొక్క, వరపుత్రి=లక్ష్మీదేవియొక్క, రమణ=విష్ణుమూర్తి, కుమార=మన్మథుని, రూప=రూపముతో, దీపితుఁడు=శోభిల్లువాఁడు ఇందు అర్థ క్లిష్టత ఉన్నది.

సందిగ్ధము:—

క. సందిగ్ధ మనఁగఁ జెలఁగును
సందేహాస్పదపదంబు; సమరధరిత్రీ
సందీపితజయశాలి పు
రందరనుతవిక్రముండు రాముఁ డనంగన్. 18

వ్యాఖ్య :- అర్థ నిర్ణయమునకు సందేహము కలిగించునట్లు వర్ణించుట సందిగ్ధము. ఇందు రాముడనగా శ్రీరాముడా, పరశురాముడా అను సందేహము కలుగుచున్నది కావున సందిగ్ధమను దోషము కలదు. కాని ఈ పద్యము ప్రకరణమునుబట్టి అర్థము నిర్ణయింపదగును.

విపరీతధీప్రదము:-

క. జగతి న్విరుద్ధమతికర
మగునది విపరీతధీప్రదాఖ్యం బనఁగాఁ
దగుఁ గృతుల; నకులహీనుం
డగు నితఁ డన, నంబికావిటానక్తుఁ డనన్. 19

వ్యాఖ్య :- ఉద్దేశించిన అర్థమునకు, విరుద్ధమైన అర్థమును కలిగించు పదములను ప్రయోగించుట విపరీత ధీప్రదము. అకులహీనుడు, అంబికా విటానక్తుడు, అను పదములు క్రమముగా కులము లేనివాడు, తల్లికి మిండడగు వాని చుందానక్తుఁడని, విరుద్ధార్థములనిచ్చు చున్నవి.

అవిమృష్టవిధేయము:-

క. అవిమృష్టవిధేయం బగుఁ
దవిలిన వర్ణ్యాంశ మప్రధానం బైనన్;

నవనవసంఫుల్లలతాం
తవసంతము వచ్చె నిపుడు ధరణి కనంగన్. 20

వ్యాఖ్య :- ప్రధానభూతమగు వర్ణ్యాంశమును అప్రధానముగా వర్ణించినచో అవిమృష్ట విధేయాంశము. ఇందు "నవనవ సంపుల్లల తాంత వసంతము" అను స్థలమునందు విధేయము ముందును, అనువాద్యము తరువాతను వచ్చినవి కావున అవిమృష్ట విధేయాంశము.

పరుషము :-

క. శ్రుతికటువు లైన పదములు
కృతిఁ బరుషము లనఁగఁ జెలఁగు నిలఁ; గుధ్రేడ్జా
పతిమూర్ధధృతార్ధోద్వృధి
పతిఁ గొల్తు నభీష్టసిద్ధిఫలముఁ గనఁగన్. 21

వ్యాఖ్య :- శ్రుతికటువులైన పదములను ప్రయోగించుట పరుష మనబడును "కుధ్రేడ్జా" వంటి పదములు పరుషము.

వాక్యదోషములు:-

సీ. అక్రమంబు విసంధి ప్రక్రమభంగంబు
పునరుక్తి యుతి మనఃపూర్ణ తరము
వాక్యసంకీర్ణంబు వ్యాకీర్ణ మధికప
దంబు వాచ్యవివర్జితం బరీతి
న్యూనోపమం బధికోపమంబు సమాప్త
పునరాత్త మస్థానఘనసమాస
మనియతచ్ఛందంబు యతిభంగము పతత్ప్ర
కర్షంబు భిన్నలింగంబు భిన్న
తే. వచన మక్రియసంబంధవర్జితములు
వాక్యగర్భితమును నన వాక్యదోష

వితతు లిరువది రెం డయి వినుతిఁ గాంచు;
విని లక్షణలక్ష్యము ల్విస్తరింతు. 22

వ్యాఖ్య :- 1. అక్రమము, 2. విసంధి, 3. ప్రక్రమ భంగము, 4 పునరుక్తి, 5. అసంపూర్ణము, 6. వాక్యసంకీర్ణము, 7. వ్యాకీర్ణము, 8. అధికపదము 9. వాచ్యవివర్జితము, 10. అరీతికము, 11. న్యూనోపమము, 12. అధికోపమము, 13. సమాప్త పునరాత్తము, 14. అస్థానసమాసము, 15. అనియతచ్ఛందము, 16. యతిభంగము, 17. పతత్ప్రకర్షము 18. భిన్నలింగము, 19. భిన్నవచనము 20. అక్రియము, 21. సంబంధ వర్జితము. 22. వాక్యగర్జితము అని వాక్యదోషములు ఇరువది రెండు.

అక్రమము:—

క. క్రమహీన మక్రమం బగు;
సమధిక మగు నితనికీర్తిశౌర్యచ్ఛాయా
సముదయమునకుఁ దినకర
హిమకరకిరణోత్కరంబు లెనయే యనఁగన్. 23

వ్యాఖ్య :- క్రమమున విడచుట అక్రమమనబడును. ఇందు "దినకర హిమకరకిరణోత్కరంబు" అనుటవలన అక్రమ దోషము కలదు. "చంద్రసూర్య" అని అనవలసి ఉన్నది.

విసంధి:—

క. అపగతలక్షణమును, గ్రా
మ్యపుసంధియుఁ దగ విసంధి యనఁ దగు; నరిగే
న్నపరగిరి కిపుడు దపనుం
డ్రపు లొకన్నెను రధికగుణవినిద్ర తనంగన్. 24

వ్యాఖ్య :- లక్షణ దోషమగు సంధియు, గ్రామ్యపు సంధియు విసంధి దోషమనబడును. "అరిగేన్నపరగిరి" అనునప్పుడు అరిగేన్+అపరగిరి="అరిగేనపరగిరి" అని యుండవలెనుగాని, నకారమునకు ద్విత్వము వచ్చుట లక్షణము కానరాదు.

ప్రక్రమభంగము :-

ఆ. ప్రక్రమంబు విడువ బ్రక్రమభంగంబు
శౌరి దానవారిఁ జక్రధారి
సభవు నమితవిభవు ననవద్యచారిత్రు
విష్ణుఁ గొల్తు జిష్ణుఁ గృష్ణు ననఁగ, 25

వ్యాఖ్య :- ప్రారంభించిన మార్గమును విడచుట ప్రక్రమమనబడును. రెండవ పాదమున "శౌరి, దానవారి, చక్రధారి" అను పదములు "రి" వర్ణాంతములుగా చెప్పబడినవి. మూడవపాదమున అభవు, అమిత విభవు, అనవద్యచారిత్రు" అని వు వర్ణాంతములతో ఆరంభించి, నాల్గవ పాదమున "విష్ణుగొల్తుఁ జిష్ణుఁ గృష్ణుఁ ననఁగ" అను విశేషణముల నడుమ "గొల్తు" అని ప్రయోగించుట ప్రక్రమభంగము,

పునరుక్తియుతము :-

క. ఎనయఁగ శబ్దార్థంబులు
పునరుక్తము లైన నదియె పునరుక్తియుతం
బనఁదగుఁ; జక్రాంచలమున
దనుజావళిఁ ద్రుంచుఁ జక్రధరుఁడిలఁ డనఁగన్ 26

వ్యాఖ్య :- శబ్దమును, అర్థమును పునరుక్తమైన దోషమగును. "చక్రాంచలమునఁ జక్రధరుఁడు దనుజావళిఁద్రుంచును" అనుచోట "చక్ర" పదము అదే అర్థమున పునరుక్తమయినది.

అపూర్ణము :-

క. ధరలోఁ గ్రియాన్వయంబుల
సరిపోని దపూర్ణ మనఁగ సన్నుతి కెక్కున్:
నరపతి యొసఁగును ద్రవ్యము
పరఁగఁగ నౌదార్యశాలి బహుళము ననఁగన్. 27

వ్యాఖ్య : క్రియాన్వయము సంపూర్ణముగా లేనిది అపూర్ణము. "నరపతి.... ననఁగన్" అనుచోట క్రియాపదము లేదుగనుక అపూర్ణము.

### వాక్యసంకీర్ణము :-

క. ఏకడ వాక్యాంతరితప
దాకీర్ణము వాక్యకీర్ణ మగుఁ; బొగడుదు రీ
భూకాంతుని జను లెల్ల న
నేకగుణాన్వితుఁ డటంచు నిలలో ననఁగన్. 28

వ్యాఖ్య :- వాక్యాంతర పదములతో, వాక్యాంతరములు కలియుట వాక్య సంకీర్ణము అగును. "పొగడుదు.... నిలలో" అను వాక్యములలోని పదములు సంకీర్ణత నొందినవి.

### వ్యాకీర్ణము :-

క. భ్రాంతికరం బగు నన్వయ
మెంతయు వ్యాకీర్ణమయ్యె; నిడుఁడు తిలకముం
గుంతలములఁ గాంతకును ల
తాంతంబులు సెరువుఁ జెప్పు డంగన! లనఁగన్. 29

వ్యాఖ్య :- అన్వయము భ్రాంతికరముగా నున్నచో వ్యాకీర్ణమను దోషము కలుగుచున్నది. "తిలకమిడుడు.... సెరువఁజెప్పుడు" వాక్యమును ప్రయోగించుట సరియగు అన్వయము.

### అధికపదము :-

క. తలఁపఁగ మిక్కిలి పదములు
గలిపినయది యధికపదము; కమలారికలా
కలితవిలాసము లలన
దలఘుయశోవిభవశాలి యగు నితఁ డనఁగన్. 30

వ్యాఖ్య :- చెప్పదలచుకున్న భావమునకు మించి అధిక పదములను ప్రయోగించుట అధికపదమను దోషమగును. "కమలారి.... నితఁడనఁగన్" అనుచోట "కమలారియశ్శాలి" అనిన చాలును. మిగిలిన పదములు అధికపదమను దోషమగును.

వాచ్యవివర్జితము :-

ఆ. వాచ్య ముజ్జగింప వాచ్య వివర్జితం
బనఁగ నెగడు; నాజి నభవు నైనఁ
దెగడు నితని బాహుదీప్తాసి యనునెడ
"నాజి నభవుఁ దెగడు" ననుచుఁ బలుక. 31

వ్యాఖ్య :- చెప్పవలసిన దానిని విడిచివేయుట వాచ్య వివర్జితము. "ఆజి నభవునైనఁదెగడు నతని బాహుదీప్తి" అను వాక్యము నందు "ఐన" అనుదానిని విడిచిపెట్టుట వాచ్య వివర్జితమను దోషము.

అరీతి :-

క. రసమున కనుచితమగు కవ
విసర మరీతి యనఁ బొల్చు; విటజనహృదయ
గ్రసనాగ్రహాగ్రహీదశదృ
ష్టిసముగ్రోదగ్ర మతివశృంగార మనన్. 32

వ్యాఖ్య:- రసమునకు అనుచితమగు విధముగా నున్నచో "అరీతి" అనుదోషమగును. "విటజన హృదయ.... శృంగారమనన్" అను వాక్యమునందు కోమల పదములు, అల్పసమాసములు, లేకపోవుటచే "అరీతి" అను దోషము కలిగినది.

న్యూనోపమము, అధికోపమము :-

తే. ఉపమ చాలకున్న న్యూనోపమము; నధి
కోపమాఖ్య మధిక మూని యైన;
హైమవసనుఁడైన హరి మేఘునిభుఁడన,
నతివ పల్లవితలతాభ యనఁగ. 33

వ్యాఖ్య :- ఉపమానము చాలకున్న న్యూనోపమ, అధికమయిన చో అధికోపమను దోషమగును. ఇందు మేఘనిభుఁడనుట వలన "బం

గొరు చేలకు" తగిన పదము లేకపోవుటవలన న్యూనోపమ అయినది. "అతివ పల్లవిత, లతాభ" అనుచోట "భూషణములు ధరించిన అతివ" అని లేకపోవుట వలన "పల్లవిత" పదము "అధిక" కోపమను దోషమయినది.

సమాప్తపునరాత్తము:—

క. క్రమము ముడిగి మరుడం బూనిన
సమాప్తపునరాత్తమయ్యె; శాశ్వతు సభవుం
గమలాక్షుం గమలనాభుం
గమలాపతిం గొల్తు ముక్తికై విభు ననఁగన్. 34

వ్యాఖ్య :- సమాప్తమయిన దానిని పునరావృత్తము చేయుట సమాప్త పునరాత్తమను దోషమగును. "కమలాక్షు....ముక్తికై" అనుచోట తిరిగి "విభున్" అని ప్రయోగించుట దోషమగుచున్నది.

అస్థానసమాసము:—

క. అపదసమాసం బస్థా
నికటునసమాసంబు; రిపులు ననిం దునిమెద నే
నపు డని వికటభ్రుకుటీ
విపులక్రోధాంధుం డయ్యె వీరుం డనఁగన్. 35

వ్యాఖ్య :- స్థానము కానిచోట సమాసమును ప్రయోగించుట అస్థాన సమాస దోషమగును ఇందు "రిపులదునిమెద" అని వీరుడు పలికెడి స్థలమునందు సమాసమును ప్రయోగించుటను విడిచిపెట్టి కవివర్ణితమునందు "వికట భ్రుకుటీ విపులక్రోధాంధుఁడు" అని వర్ణించుట అస్థాన సమాసమను దోషమగుచున్నది.

ఛందోభంగము యతిభంగము:—

క. ఛందము యతియుం దప్పిన
ఛందోయతిభంగము లగు; సంగతి నితఁడు

కుందేందువిశదయశుఁడై
ముందుగఁ బూజించినాఁడు నరహరి ననఁగన్. 36

వ్యాఖ్య :- ఛందో భంగము, యతి భంగము కలిగిన దోషమగును. ఇందు రెండవ పాదము చివర గురువు లేకపోవుట దోషము. నాలుగవ పాదమున యతిదోషమున్నది.

పతత్ప్రకర్షము:—

క. క్షితి నుత్కర్షము దక్కినఁ
బతత్ప్రకర్షంబు; గవయ భల్లూకమృగీ
వితతివిశేదనగర్వా
యతసింహాభీల మీ మహాటవి యనఁగన్. 37

వ్యాఖ్య :- పద్యమునందలి యెత్తుగడ క్రమముగా పడిపోవుట పతత్ప్రకర్షమను దోషమగును. ఈ పద్యమున పతత్ప్రకర్ష దోషము కాన రాదు.

భిన్న లింగము, భిన్న వచనము:—

ఆ. ఉవిదఁ బురుషుఁ బోల్చి, నొకని బలువురఁ బోల్చ
భిన్న లింగ మనఁగ, భిన్న వచన
మనఁగఁ జెల్లఁగు; నింతి వనజారివలె నను,
ఖడ్గ మురగవరులకరణి ననఁగ. 38

వ్యాఖ్య :- ఉపమానోపమేయములు భిన్న లింగములో నున్న భిన్న లింగ దోషము, భిన్న వచనములో నున్న భిన్న వచన దోషము సంభవించును. "ఇంతి వనజారివలె" ఇంతి స్త్రీ లింగము, వనజారి పులింగము కావున భిన్నలింగ దోషము. ఖడ్గము సర్పములవలె ఉన్నది" అను నప్పుడు ఖడ్గము ఏక వచనములోను, సర్పములు బహువచనములోను ఉన్నది కావున భిన్న వచన దోష.. న్నది

అక్రియము లేక అశరీరము:—

క. తొదలం గ్రియాశూన్యము లగు
పదంబు లశరీర మనంగం బరంగు; న్విభవా
స్పద మగుమధుమాసంబునం
బొదలు తరూత్కరము కుసుమపూర్ణం బనంగున్. 39

వ్యాఖ్య :- క్రియాపదములేని వాక్యము అశరీరదోషమగును. "పొదలు తరూత్కరము" అనునప్పుడు "పొదలు" శబ్దము తద్ధర్మార్థక విశేషణము: కాసిలు అనునట్టి క్రియ లోపముయినది.

సంబంధవర్జితము:—

క. సంబంధవర్జితం బగు
సంబంధము విడువం; గరులు శైలములు తురం
గంబులు భంగంబులు నను
రాంబుధివరతరణి యితనియసిలత యనంగన్. 40

వ్యాఖ్య :- చెప్పవలసిన సంబంధమును విడిచిపెట్టుట సంబంధవర్జితము ఇందు సమరమే సముద్రము, ఏనుగులే సముద్రమందలి కొండలు, గుఱ్ఱములే అలలు, కత్తియే నడప" అని సంబంధ నిబంధన పూర్వకముగా చెప్పవలసియుండగా, సమరాంబుధి" అని ప్రధానపదమగు సమర పదము అప్రధానముగా నుండుటచే సంబంధమును బోధించుట లేదు.

వాక్యగర్భితము:—

క. నడుమ నొకవాక్యపద్ధతి
తొడరిన నది వాక్యగర్భదోషము; ఖలులౌ
వెడమతులతోడిసంగతి
కడుహీనే మది సికొనవద్దం గా వల దనంగన్. 41

వ్యాఖ్య :- ఒక వాక్యము నడుమ వేఱొక వాక్యమును దూర్చి చెప్పుట వాక్యగర్భితమను దోషమగును. ఇందు "ఖలులౌ విడమతుల తోడి

సంగతి నీ కొనర్పఁగా వలదనఁగన్" అను వాక్యము నడుమ "నీకిది కడుహితము" అను వాక్యాంతరము ప్రవేశించినది కావున వాక్యగర్భిత దోషము.

## అర్థదోషములు:—

క. క్రమమున నిఁక నర్థజదో
షముల నెఱింగింతు సుకవిజనులకు హీనో
పమ మధికోపమ మసమో
పమ మఖ్యాతోపమంబు పరుషము మఱియున్. 42

తే. వ్యర్థ మేకార్థము ససంశయం బపక్ర
మము విరుద్ధంబు విరసాతిమాత్ర హేతు
రహిత నిరలంకృతాశ్లీల సహచరచ్యు
తములు భిన్నంబు నన వీనిక్రమ మొనర్తు. 43

వ్యాఖ్య :- 1) హీనోపమము, 2) అధికోపమము, 3) అసమోపమము, 4) అఖ్యాతోపమము, 5) పరుషము, 6) వ్యర్థము, 7) ఏకార్థము, 8) ససంశయము, 9) అపక్రమము. 10) విరుద్ధము. 11) విరసము 12) అతిమాత్రము, 13) హేతురహితము, 14) నిరలంకృతము, 15) అశ్లీలము, 16) సహచరచ్యుతము 17) భిన్నము. అని అర్థదోషములు పదునేడు.

### హీనోపమము, అధికోపమము :-

తే. ఉర్వి ఘను నల్పుఁ బోల్ప హీనోపమంబు;
శ్వానమునుబోలె నితఁడు విశ్వాసి యనఁగ
నరయు నధికోపమం బల్పు నధికుఁ బోల్పఁ;
బునుకవట్టినపే నీశుఁ బోలు ననఁగ. 44

వ్యాఖ్య :- గొప్పవానిని అల్పునితోఁబోల్చినహీనపనోమ, అల్పుని అధికునితో పోల్చిన అధికోపమ అను దోషములు కలుగును. "ఇతడు శ్వానమువలె విశ్వాసి" అనుచోట శ్వానము అల్ప వస్తువు, ఇతడు అధికుడు, కావున హీనోపమ అయినది "పునుకపట్టిన పేనీశుఁబోలు" అనుచోట పేనుఅల్ప వస్తువు, ఈశ్వరుడు అనల్పవస్తువు కావున అధికోపమ దోషమయినది.

అసమోపమము, అఖ్యాతోపమము :—

తే. ఉపమ సరిలేని దిల ననమోపమంబు;
హాలధరుఁడు మేరుగిరిబోలె నలరు ననఁగ;
విను ప్రసిద్ధంబు గాని దవిఖ్యాతోప
మంబు; వదనంబు కుముదంబుమాడ్కి నుననఁగ 45

వ్యాఖ్య :- పోలిక కుదరనిచో అసమోపమ, బలరామునకు మేరుగిరితో సామ్యము కుదరదు. అప్రసిద్ధమయిన ఉపమానము అఖ్యాతోపమ "మొగము కుముదమువలె నున్నది" ముఖ కుముదములు అప్రసిద్ధము. కావున అఖ్యాతోపమ.

పరుషము :—

క. పరుషార్థంబులు గలయది
పరుషం బను దోష మయ్యెఁ; బరఁగెడు నీభూ
వరు సౌందర్యమునకు నే
మఱు సరియౌ మంటఁ బడ్డ మదనుం డనఁగన్. 46

వ్యాఖ్య :- అతి పరుషమయిన అర్థము కలది పరుషదోషమగును మన్మథుడు అనేక మారులు మంటలలో భస్మమయినచో బంగారము వలె వన్నె పెరిగి ఈ రాజుతో సమానమగును అని భావము. ఇందు "మంటఁ బడ్డ" అను పదము రూక్షాక్షరము.

### వ్యర్థము, ఏకార్థము :—

తే. అప్రయోజనంబు వ్యర్థ మౌ, ఫేనిలం
బైన జలధి దాఁటె ననిలతనయుఁ
డన్న; నభిన్న వాక్య మరయ నేకార్థ మౌ;
సుగుణఖని చరిత్రశోభి యనఁగ. 47

వ్యాఖ్య :- ప్రయోజనములేని అర్థము "వ్యర్థము" అను దోషమగును. ఇందు "ఫేనిలము" అను పదము వ్యర్థము. ఒకే అర్థము గల వాక్యముగాని, పదముగాని మరల ప్రయోగించుట ఏకార్థము. ఇందు "సుగుణఖని", చరిత్రశోభి" అను పదములు ఏకార్థములు.

### ససంశయము :—

క. క్రమమతి పదములు సంది
గ్ధము లైన ససంశయంబు; ధరణీ వరుధై
ర్యము నగము గెల్చు ననఁగా,
నమరెడు సతిమేను మించు హాసియించు ననన్. 48

వ్యాఖ్య :- వాక్యమునందలి, పదములు(కర్తృ, కర్మములయందు) వలన అర్థ సంశయము కలుగుట సంశయమనుదోషమగును. "ధరణీవరు ధైర్యము నగము గెల్చు, సతిమేను మించు" అను వాక్యముల యందు కర్త, కర్మలు నిర్ణయింపవీలు కాకున్నది. కాన ససంశయమను దోషం కలిగినది.

### విరుద్ధము :—

క. క్రమ మెడలి దేశకాలం
సముచితము విరుద్ధమయ్యె; సమదవిలోల
భ్రమరము చంపకవన మున,
సముదంచితకైరవంబు చైత్రం బనఁగన్. 49

వ్యాఖ్య :- లోక విరుద్ధమైనది, విరుద్ధమనుదోషమగును, ఇందు "చంపకవనమున భ్రమరము చరించుచున్నదనుట దోషమగును. "మొగలి పువ్వు చైత్రమాసమునందు" ఉండదు. ఇది కాలవిరుద్ధము.

విరసము :—

క. ధర ననుచితరసభావము
విరసం బగు; నితనిసమదవిద్వేషితలో
దరులు దరులందుఁ గుందఁగ
సరసము లాడుదురు ప్రేమ శబరు లటన్నన్. 50

వ్యాఖ్య - అనుచితమగు రసభావమును వర్ణించుట విరసమగును శత్రుకాంతలు గుహలలో విచారించు చుండగా కిరాతులు వారితో సరసము లాడుచుండిరి అని వర్ణించుటలో ఔచిత్యము లేకపోవుటను విరసమను దోషము గలదు.

అతిమాత్రము, హేతురహితము :—

క. క్షితిలో లోకాతీతం
బతిమాత్రము; నింగి నిండె నబ్జాక్షికుచ
ద్వితయ మన; హేతుశూన్యము
సతిఁ గనుఁగొని భృంగపంక్తి చనుదెంచె ననన్. 51

వ్యాఖ్య :- లోకాతీతమగు అర్థమున ప్రయోగించుటఅతిమాత్రము అను దోషము, "అయువతి స్తనద్వయము" నింగి నిండెను అని వర్ణించు టవలన లోకాతీతమను దోషము. హేతువును చెప్పకుండుటవలన హేతు శూన్యమను దోషమగును. "సతిఁ గనుఁ గొని, భృంగపంక్తి చనుదెంచె ననన్"అని వర్ణించుటలో భృంగపంక్తి వచ్చుటకుహేతువు చెప్పబడలేదు.

నిరలంకృతి, అశ్లీలము :—

క. ధర జాతిమాత్ర శూన్యము
నిరలంకృతి, బాహుయుగుఁడు నృపుఁ డన; లజ్జా

కర మశ్లీలము; పద్మిని
సరసాంగజగృహము పద్మసౌరభ మనఁగన్. 52

వ్యాఖ్య :- అలంకార రహితముగా వర్ణించుట నిరలంకృతి అను దోషమగును. "ఈ రాజు బాహుబలుఁడు" ఇందేయలంకారము లేదు. లజ్జాకరమయిన వర్ణన అశ్లీల మగును. "పద్మిని సరసాంగజ గృహము పద్మసౌరభమనఁగన్" ఇందు "సరసాంగజ గృహము అను పదము అశ్లీల దోషము.

సహచరచ్యుతము ;—

క. సరిగా సరి గానిది యు
ర్వరపైఁ బొందింప సహచరభ్రష్టం బౌఁ;
బరఁగు నెలచేత గగనం
బరుదుగ ఫేనంబుచేత నంబుధి యనఁగన్. 53

వ్యాఖ్య :- సరికాని దానిని కూర్చుట సహచరచ్యుతము. "చంద్రుడు లేని రాత్రి" ఉత్కృష్టము, నురుగులేని సముద్రము అప కృష్టము.

భిన్నము :—

క. భిన్నం బగు సంబంధవి
భిన్నం; బీతనివిరోధపృథివీశ్వరుఁడా
పన్నుం డై తననుదురున
నన్నలినజు వ్రాఁత శూన్య మని పలుకన్. 54

వ్యాఖ్య : సంబంధము లేని దానిని వర్ణించుట భిన్నమను దోష మగును. శత్రువు ఆపన్నుడనుటకును, బ్రహ్మవ్రాతకును సంబంధము లేకుండుటచే భిన్నమనుదోషమగుచున్నది.

క. రసములు వాచ్యము లైనను
వెస నదియును దోషమయ్యె; విపులోగ్రరణం

బసద్భ్రశబీభత్సరసో
ల్లసితము శృంగారసహితలలన యనంగన్. 55

వ్యాఖ్య :- రసముగా వాచ్యములైనచో వాచ్యత్వమను దోషము కలుగును. "విపులో(గ్రరణంబసద్భ్రశబీభత్సరసోల్లసితము" ఇందు బీభత్స రసముమ పేరును వాచ్యము చేయుటవలన దోషము కలిగినది.

గుణములు :—

తే. ఇంక గుణముల వివరింతు; నివియుఁ గృతుల
దొరసి శ్లేష ప్రసాద మాధుర్య సౌకు
మార్య సమతార్థదీపనౌదార్య కాంతు
లనఁగ నోజస్సమాధులు నగఁ జెలంగు. 56

వ్యాఖ్య :— శ్లేష, ప్రసాద, మాధుర్య, సౌకుమార్య, సమతా, అర్థదీపన, ఉదాత్తా, కాంతి, ఓజస్సు, సమాధులు అను పది గుణములు కావ్యములందు గలవు.

క. ఇల సంధిఁ గూడి పదములు
నెలకొని యొకపదము రీతి నిలిచిన శ్లేషం
బలరుఁ; బ్రసిద్ధపదంబుల
నలఘుస్ఫూర్తి బ్రసాద మయ్యె; నది యెట్లన్నన్. 57

వ్యాఖ్య :- సంధి వశమున పదములు ఒక్క పదమువలె భాసిల్లిన శ్లేషమను గుణమగును.

ప్రసిద్ధపదములను కావ్యములందు వాడుట ప్రసిద్ధమను గుణము అగును.

శ్లేషము :—

శా. ఆలావణ్యమగణ్య; మాగుణగణం బవ్యాజ; మాతేజ ము
ద్వేలం; బావినయం బమేయతర; మావీర్యంబనిర్వాచ్య; మా

యాలాపం బతిసత్యు; మాచిత్రిణాం జాశాంతవిశ్రాంత మా
శీలం బార్జవమూల; మెన్నఁదరమే శ్రీ నారసింహాధిపున్. 58

వ్యాఖ్య : ఇందు ఊకారం సంధిసంబంధ పదములు ఏకపదములుగా
భాసిల్లుచున్నవి గాన శ్లేషమను గుణము కలిగినది.

ప్రసాదము :—

ఉ. ముంగిటి పెన్నిధానము; మిలుకుఁ బటికల్పక; మర్థకోటిమం
గొంచు నిండి: చెంగటన కూడిన బంగరుకొండ; దొడ్డిలో
నం గల కామధేను వదనం బెయి యొంగలు లేవి చొక్కము
న్నం గెటి జూన్న నీ వితరణంబు; నృసింహనృపాలశేఖరా 59

వ్యాఖ్య : ఈ పద్యమునందు ప్రయోగించిన పదములు అన్నియు
ప్రసిద్ధములే కావున ప్రసాదమను గుణము కలదు.

క. సరసము లగు వాక్యంబులు
పరుసను వేర్వేరు మించువగ మాధుర్యం;
బరయఁగ బొట్లు పిఱుందుల
సరుదగునది సౌకుమార్య; మది యెట్లన్నన్. 60

వ్యాఖ్య : దీర్ఘసమాసములు లేని సరసమగు పదములను ప్రయో
గించినచో మాధుర్యమను గుణము కలుగును.

బిందు పూర్వకమైన పదములు ప్రయోగించిన సౌకుమార్యమను
గుణము అగును.

మాధుర్యము :—

చ. అనయము యంత్రమత్స్యము నొక్కన్న శ్రీనరసింహుఁడేఁ
యుఁగా, వెనుకకుఁ బాఱి పుల్లలచి వేమము మూర్ఛ బింబము
దూఱి తా, నసమున కేఁగి సిగ్గున నణంగి భరంపడి వీఁగి తా

విమలఁ; బెనసి నతి స్ఫుజించి పసు లీఁది భ్రమించెను రాసు
లన్నియున్. 61

వ్యాఖ్య :- నరసభూపాలుడు మత్స్య యంత్రమును ఛేదింపగా మిగిలిన రాసులన్నియు వెనుకకు పరుగులెత్తెను ఆయారాసుల సహజ స్వభావమును వర్ణించుచు, దీర్ఘసమాసములు లేకుండగా పద్యము రచించుట వలన మాధుర్యమను గుణము లభించినది.

సౌకుమార్యము:—

ఉ. చెందొవవిందు మందువలెఁజిందురుచిందగఁజందనంబు వె
చ్చందన మొందు నిందుముఖి చందము డెందమునందలంప నీ
యందమునందె నందనమునందు ములిందము పొందు పొంది
కం, జెందె నృసింహా! కౌఁగిటను జేర్పుము ముందుగ మంద
గామినిన్. 62

వ్యాఖ్య :- ఇందు బిందు పూర్వక దకారముతో కూడిన పదములు ప్రయోగించుటవలన సౌకుమార్యమను గుణము కలుగును. పరుషత్వము లేని పదములు ప్రయోగించుటయు సౌకుమార్యము.

క. లలితార్థభంగిఁ బాదం
బులు నాల్గిట నేకసరణిఁ బొదువ సమత యౌ;
నిల నర్థము వ్యక్తం బై
నలు వొందిన నర్థదీపనం; బెట్లన్నన్. 63

వ్యాఖ్య :- సుకుమారమగు అర్థముతో నాలుగు పాదములు ఒకే విధముగా ఉండునట్లు ప్రయోగించిన సమతయగును.

అర్థము స్పష్టముగా గోచరించినచో అర్థవ్యక్తి అనుగుణము అగును.

సమత:—

సీ. శరవేగములు లేవె చలయంత్ర పాఠీన
పాటనక్రియకు నేర్పడవు గాక;

చాతుర్యములు లేవె శారదాభండార
చోరకారశ్రీకిఁ జోరవు గాక;
వితరణంబులు లేవె వివిధయాచకనృపా
లకకంఠదఘ్నము లాకవుగాక;
సామర్థ్యములు లేవె సరిదన్యపథయాన
శాసనప్రౌఢికిఁ జనవు గాక;
తే. తొలుత గడిదుర్గముల నున్న దొరలు లేరె?
మహిమ నీమాడ్కిఁ గదనమర్మదనపాద
సారసప్రాంగవారణులు లేరు గాక;
నరనుతాటోప! యోబయనరసభూప. 64

వ్యాఖ్య :- పద్యమంతయు ఒకే విధముగా నడచుటవలన సమతకు ఉదాహరణమయినది.

అర్థవ్యక్తి :—

సీ. నలువొందు నమరేంద్రునాగంబుసాటిగా
సామజంబుల నెల్ల నంతరించి
విఖ్యాతి కెక్కిన వలిమావుసాటిగా
సైంధవముల నెల్ల నవరణించి
మహిమ మించిన మంత్రిమాకులసాటిగాఁ
బాదపంబుల నెల్లఁ బాముకొల్పి
వన్నె కెక్కిన దేవవాహినిసాటిగా
నిల నెల్ల యేఱుల నిరవుకొల్పి
తే. స్వర్గసృష్టికి బ్రతిసృష్టి సలుపుకీర్తి
వసుధఁ గౌశికగోత్రపావనుఁడవైన

నీక తగుఁగాక! మఱి యన్యనృపుల కగునె?
సరసగుణహార! యో బయనరసధీర. ౯౯

వ్యాఖ్య :- నరసరాజు కీర్తి అన్ని లోకములకు వ్యాపించగా దాని తెల్లదనమువలన ఏనుగులు ఐరావతములుగాను, గుఱ్ఱములు ఉచ్చైఃశ్రవసములుగాను, చెట్లు కల్పవృక్షములుగాను, నదులు ఆకాశ గంగవలెను, విశ్వామిత్రుని గోత్రమునందు జన్మించుట వలన, నరసరాజు కీర్తి సృష్టికి ప్రతి సృష్టి చేయుచున్నది. ఇందు అర్థము స్పష్టముగా గోచరించుట వలన అర్థవ్యక్తి అయినది.

క. కతిపయసంయుక్తాక్షర
వితతం బౌదార్య మయ్యె; విమలవిచిత్రా
యతివర్ణావృత్తులు గల
యతిమృదుబంధంబు కాంతి యగు; నెట్లన్నన్. ౧౦౦

వ్యాఖ్య :- కొన్ని సంయుక్తాక్షరములు గల పదబంధము ఔదార్యమగును.

వచ్చిన వర్ణమే మరల వచ్చునట్లుగా ప్రయోగించుట "కాంతి" యగును.

ఔదార్యము:—

చ. ఎదిరిన యోబశౌరి నరసేంద్రునికీర్తినిజాంశుపంక్తికిన్
మదనవిరోధి భీతుఁడయి మార్కొన కేఁగినఁ దద్రథంబు ద
త్సదనము నాక్రమించి రభసంబున నావృషభాధిపధ్వజున్
వెదకఁ జుమీ యజాండములవే వెడలెంగడ లేనియీసునన్.

వ్యాఖ్య :- నరసరాజు శివుని ఎదుర్కొనగా అతడు పారిపోయెను. అంత నరసరాజు కైలాసమునాక్రమించెను. ఇందు సంయుక్తాక్షర పదములను ప్రయోగించుటవలన ఔదార్యమను గుణము కలదు.

కాంతి:—

సీ. నెలవంకతోఁడి వెన్నెలవంక గలమేటి
నెలవంక రహితాంశునియతిఁ దెగడి
వనయమ్మువానిఁ గన్నవయమ్ము గలయింతి
వనయమ్ము దాల్చువానన్నఁ జెనకి
కడలేక తరిగొండ కడలేకడలఁ ద్రోయు
కడ లేకమైనమీఁగడల గెల్చి
కపురాలవన్నె చొక్కపురాల నగుమేని
కపురాలపోతు బింకంబు నణఁచి

తే. తనరుచులు లోకములు నిండఁ దనరుచుండు
లాటకరపాటలలనాలలాటఫలక
మలయజము లైన నీదునిర్మలయశంబు
లమితగుణసాంద్ర! నారసింహక్షితీంద్ర. 68

వ్యాఖ్య :- ఈ పద్యమున నరసరాజు కీర్తి వర్ణింపబడినది ఇందు కొన్ని వర్ణములు ఆవృత్తి యగుట వలన కాంతి యనుగుణము కలిగినది.

క. విలసితసమానభరితో
జ్జ్వలబంధం బోజ మయ్యె సరి; యన్యగుణం
బులు మఱి వేఱొకటిపై
నలరింప సమాధి యయ్యె; నది యెట్లన్నన్! 69

వ్యాఖ్య :- దీర్ఘ సమాసములు గల బంధముతో ఓజస్సు అగును. ఒకదాని ధర్మములు వేరొక్క దానియందు ఆరోపించుట "సమాధి" అను గుణము అగును.

ఓజము:—

సీ. మందారబిసకుందకుందానినిధిబృంద
బృందారకాప్తశోభితయశుండు
హేలావిజితహాలహాలాశనోత్తాల
తాలాంకభుజదండతాండవుండు
దీనావననిదానదానాంబుజదీన
దీనాథకరిణాపుస్థితిస్థాయి
భీమాసురవిరామారామాతిశయధామ
ధామాంబకనిభాసిదారికారి
తే. రాజమాత్రుండె వసుధాధిరాజమకుట
నికటవికటమహానీలనికరసుకర
మధుకరకరంబితాంఘ్రిపద్మద్వయుండు
నరసగుణహారి రోబయనరసశౌరి. 70

వ్యాఖ్య :- నరసరాజును వర్ణించుపద్యము ఇందు దీర్ఘసమాసములు ప్రయోగించుట వలన ఓజస్సు అనుగుణము కలిగినది.

సమాధి:—

సీ. అల బలీంద్రునిచేత నడుగు వెట్టఁగ నేర్చి
ధారాధరముచేత నీరు మోచి
కానీనుచేఁ గంచుకముఁ బూనఁగా నేర్చి
యొలమి దధీచిచే నెమ్ము బలిసి
క్షీరాంబురాశి ద్రచ్చినవెన్న నీడేరి
నైలింపగవిచన్నుఁబాలఁ బెరిఁగి
కల్పపాదపఫలోత్కరములఁ జవిగాంచి
వనజారి నెమ్మేన ననఁగి పెనఁగి

తే. ధరణిఁ బ్రోది వహించిన దానకన్య
సకలయాచకబాంధవు ల్సంతసిల్ల
నీకరగ్రహణావాప్తి నెరసె నౌర!
వైరిగజసింహ! యోబయనారసింహ. 71

వ్యాఖ్య :- ఇందు దానకన్యను వర్ణించెను, అడుగు పెట్టుట, నీరు మోయుట, కంచుకముఁ బూనుట, ఎమ్ముబలియుట, అనుధర్మములు, బలి, ఆకాశమ్ము, కానీన, దధీచి మునులకు సంబంధించినవి. ఈ లక్షణములు దాన కన్యయందు ఆరోపించుట వలన సమాధి గుణము కలిగినది.

## శబ్దాలంకారములు:—

తే. ఇఁక నలంకారనికరంబు లేర్పరింతు
సవియుఁ గవితాలతాంగిక హారకటక
కంకణాదులక్రియ నలంకరణకరణ
పరిణతులచే నలంకారభావ మొందు 72

వ్యాఖ్య :- ఇక కావ్యకన్యకు ఆభరణముల వంటిదగు అలంకారములు వివరింతును.

క. ఇవియును శబ్దార్థంబుల
ద్వివిధములై క్రమముతోడ వెలయు ననుప్రా
సవిశేషంబుల నుపమా
దివిశేషమ్ములను గావ్యదీపితసరణిన్. 73

వ్యాఖ్య :- అలంకారములు, శబ్దార్థ భేదములచే రెండు విధములుగా నుండును. అనుప్రాసాదులు శబ్దాలంకారములు. ఉపమాదులు అర్థాలంకారములు.

తే. అం దనుప్రాసభేదంబు లైనశబ్ద
భవదలంకారముల మున్ను ప్రస్తుతింతు;

నడర నడ లేక రెండు రెండక్షరంబు
లెనయు నియమంబు ఛేకమా; నట్లటన్న. 74.

వ్యాఖ్య:- వ్యవధానము లేకుండగా రెండేసి హల్లులు ఆవృత్తి కలిగినచో ఛేకాను ప్రాసయగును

ఛేకానుప్రాసము

స్ఫురత్కృపాబల ప్రతాపభూతి త్రైక్యభూధరా
ర్చిరంగ దానబుద్ధిసార్ ఖరి స్వారిస్వారి స్ఫూర్తా
హారు హారు గ్గిరిగ్గిరి స్మహానలు స్నలు ప్రసమా
గురు స్గురు స్జయింతు వౌ; దగు స్నృసింహభూవరా. 75

వ్యాఖ్య :- ఇందు "అరిస్వారి, హారుహారు" "గిరినిరి" అను పదములు వ్యవధానము లేకుండగా, రెండేసి హల్లులను ప్రయోగించుటవలన ఛేకాను ప్రాస ఆయినది.

తే. ఒక్క వర్ణంబు కడకాంగ నుద్ధరింపఁ
బరఁగు వృత్త్యనుప్రాసమయ్యెఁ;
దలఁపఁ బునరుక్తి యయ్యుఁ దాత్పర్యభేద
మొనయు నియమంబు లాట మా; నట్లన్నన్. 76

వ్యాఖ్య :- ఒకే వర్ణము అనేకమారులు ఆవృత్తి చేసినచో వృత్త్యను ప్రాసాలంకారమగును.

శబ్దములు పునరుక్తి అయినను తాత్పర్య భేదమున్నచో అది లాటానుప్రాసమగును.

వృత్త్యనుప్రాసము :—

చ. సమదవిపక్షశిక్షణవిచక్షణదక్షిణదోరనుక్షణ
భ్రమదపిదుర్నిరీక్ష సమరక్షపితక్షితిపక్షతక్షర

త్సమధికశోణితక్షురకృతక్షణరక్షితభక్తలోక నిర్
గమలదళాక్షుఁ డేలు బలగౌరవసింహా! నృసింహా భూవరా.

వ్యాఖ్య :- ఇందు క్ష కారము అనేక పర్యాయములు ఆవృత్తి చేయబడినది. కావున వృత్త్యను ప్రాసాలంకారము అయినది.

లాటానుప్రాసము :—

చ. ఘనతన్నృసింహుఁ జూడఁగలకన్నులు కన్నులు; వాని కౌఁగిటం
జనువున నేపు చూడఁగల చన్నులు చన్నులు; వాను మోవికిం
జొనిపిన పాటలాధరముజున్నులు జున్నులు;వానిమేనఁ జే
ర్చిన సరసాంగవల్లికలచెన్నులు చెన్నులువో తలోదరీ.78

వ్యాఖ్య :- ఇట "కన్నులు, కన్నులు, చన్నులు చన్నులు, జున్నులు జున్నులు, చెన్నులు చెన్నులు" అను శబ్దములు, అర్థములు సమానమయిన, తాత్పర్య భేదము కలిగి ఉండుటవలన లాటాను ప్రాసమ యినది. కన్నులు శ్రేష్ఠమయినవి, చన్నులు శ్రేష్ఠమయినవి, ఈ రీతి మిగి లిన పదములను ప్రయోగించబడినవి.

క. సమవర్ణ యుగాధికమై
యమరిన నియమంబు యమక మగుఁ గృతులం; దా
యమకం బనేకవిధ మగుఁ;
గ్రమమున నొక రెండు మూఁడుగతు లెఱిఁగింతున్; 79

వ్యాఖ్య :- సమానమైన వర్ణములుగల పదములను జంటను, ఆవృత్తి చేయుట యమకము. యిందు అనేక విధములున్నను, రెండు మూడు విధములు మాత్రము తెలుపబడును.

క. మేలిమి రెండవపాదము
నాల్గవపాదంబు నొక్కసలువునఁ దనరం

జాలిన యమకము కృతులం
దాలింపఁగఁ బాదయమక మగుఁ నెట్లన్నన్. 80

వ్యాఖ్య : రెండు నాలుగు పాదములయందు ఒకే విధముగా ప్రయోగించిన పాదయమకమనబడును.

పాదయమకము :-

క. ఔరా! యోబన్నృపాలకు
మారా! మను మదనసమర మాధుర్యుఁడవై
ధీరా! నృసింహా! కూడితి
మారామను మదనసమరమాధుర్యుఁడవై 81

వ్యాఖ్య :- యిందు రెండు, నాలుగు పాదములు సమానముగా ప్రయోగించుటవలన పాదయమకమైనది.

క. ప్రస్తుతమగు ముక్తపద
గ్రస్తం బన; నదియుఁ గృతులఁ బతఁగు బదాంతో
దస్తము పాదాద్యంతసు
విస్తృతము, పదాంతసింహావీక్షణ మనఁగన్. 82

వ్యాఖ్య :- పాదాంతమందలి పదముతో తరువాతి పాదము ప్రారంభమగుట ముక్తపదగ్రస్తమనబడును. సింహావలోకన ముక్తపదగ్రస్తమని మరియొక విధముగాను విభజించెను.

పాదాంతపాదాదిముక్తపదగ్రస్తము:—

క. సుదతీనూతనమదనా!
మదనాగతురంగపూర్ణ మణిమయసదనా!
సదనామయగజరదనా
రదనాగేంద్రనిభకీర్తిరసనరసింహా. 83

వ్యాఖ్య :- ఇందు పదాంతమగు "మదనా" అను పదమే ద్వితీయ పాదాదియందును, ద్వితీయ పాదాంతమగు "సదనా" పదము, తృతీయ

పాదాది యందును, తృతీయ పాదాంతమగు "రదనా" పదము చతుర్థ పాదాది యందును ప్రయోగించుట వలన ముక్తపదగ్రస్తమయినది.

సింహావలోకనముక్తపదగ్రస్తము:—

కం. మన లేటికి నూతనమా
తనమాయెడఁ బ్రేమ? దనకుఁ దక్కితి ననుమా!
నను మానక దయ దనరం
దనరంతులు మాని నరసధవు రమ్మనవే. 84

వ్యాఖ్య :- ఇందు వెనుకటి పద్యమువలె పాదాంత పదమును, పాదాదియందు ప్రయోగించుచు, పద్య ప్రారంభములోని "మనవే" అను పదమును, నాల్గువ పాదము చివర "రమ్మనవే" అని ప్రయోగించుట వలన సింహావలోకన ముక్తపదగ్రస్తమయినది.

పద్మబంధము:—

చ. కనుఁగొన రేకులెన్మిదియుఁ గర్ణిక చుట్టిడి స్రగ్ధరాంఘ్రిల
న్మనుపటి యేడు వర్ణములు నా గడ యేడుఁ బ్రవేశనిర్గతు
ల్పనుపడ నాల్గు దిగ్దళముల న్లిఖియించి విదిగ్దళంబులం
దెనయఁగ బాదమధ్యగము లేడును వ్రాయఁగ బద్మబంధమౌ.

వ్యాఖ్య :- మొదట కర్ణికను వ్రాయవలయును. పిదప ఏనిమిది దిక్కులవైపు ఏనిమిది రేకులు వ్రాయవలయును, అందు స్రగ్ధరావృత్త పాదములోని మొదటి ఏడు అక్షరములు చివరి యేడక్షరములు వ్రాయవలయును. ఆ యేడు అక్షరములు ప్రవేశ, నిర్గమన భేదములచే పదు నాలుగు అగుచుండును. నాల్గు మూలల యందును స్రగ్ధరా పాదమున నడుమ నున్న ఏడక్షరములు వ్రాయవలయును. కర్ణిక నుండి వ్రాత ప్రారంభించ వలయును.

## స్రగ్ధర

రామాకశ్రీసమగ్రాగారణాకృతభయముత్రాసనక్త్రారమారా
రామారక్త్రాసనద్రాష్ట్రీభరణకటిమాత్రాసకుస్త్రీకుమారా
రామాకుస్త్రీకుసత్రాక్షకటతరవిచిత్రావివత్రాసమారా
రామాసత్రాపవిత్రాశ్రేయనరసరుచిగ్రామసశ్రీకమారా. ౮౮



## చక్రబంధము:—

క. పదిచుట్లు నాఱురేకులు
పదిలకుఱిచి సుకవిపేరు, కృతిపేరును లోఁ
బొదలఁగ నేవంవిధగుణ
విదితం బగు చక్రబంధవిధ మా; నెటనన్. 87

వ్యాఖ్య :- పదిచుట్లు, ఆరు రేకులు ఉండునట్లు చక్రమును గీయవలయును, పాదముల యందలి పదవ అక్షరము మధ్యకు రావలయును. శార్దూల విక్రీడితముతో నింపవలయును. పడమటి దిక్కు నుండి, తూర్పునకు మొదటి పాదము, వాయువ్యము నుండి ఆగ్నేయమునకు గల రెండు రేకులయందు, రెండవ పాదము. ఈశాన్యము నుండి నైఋతికి గల రెండు రేకుల యందు మూడవ పాదము, ఈ మూడు పాదముల యందు పదవ అక్షరము 'ఒకటే ఉండ వలయును, నైఋతి దిక్కున గల రేకు మొదలుకొని, రేకులకు నడుమ నున్న భాగములందు నాల్గవ పాదపు 2, 3, 5, 6, 8, 9, 11, 12, 14, 15, 17, 18, అక్షరములు అపసవ్య పద్ధతిని పూరించవలెను.

మూడవ పాదము చివరి అక్షరము, నాల్గవ పాదము మొదటి, తుది అక్షరములు అభిన్నములు. పద్యమున కవిపేరు, కృతిపతి పేరు ఇమిడి యుండవలయును.

శా. రక్షానాకవమూర్తి భాసురగభీరావిక్రమోపాస్పదా
దక్షారమ్యమతిస్థిరాభరణవిద్యాకృత్యశజ్కన్వనా
వక్షస్సింధుపకన్యకా నరసభవ్యా తిగ్మధీతంత్రదా
దాక్షిణ్యారతనాదవైభవవినోదా హేమనాగాశ్వదా. 88



వృత్తకందగర్భసీసము

మహితవిద్వజ్జనమండలీవినుతసా
హిత్యప్రియంభావుకాత్యుదార
వితతభీమాహవవిక్రమక్రమసము
ద్యద్వైరినిర్భేదనాభిరాము
వినుతవిశ్రాణనవిభ్రమామదహసితా
నూనామరక్ష్మారుహా నృపేంద్ర

వినతభూపాలక విస్ఫురన్మకుటర
త్నద్యోతి శోంచత్పదా మహాత్మ
తే. 'నిరుపమదయాప యోనిధినిగతభరిత
చారుచరితనిర్మలతరసత్యరుచిర
తరణికులమణీవరసింహాధరణీరమణ
ఘనతరగుణనిధీ' మని జనులు వొగడ 89

వ్యాఖ్య :- ఈ పద్యమందలి నాల్గు పాదముల ప్రథమ వర్ణము ను, పాదాంతమందలి మూడు వర్ణములను విడిచి చదివినచో మత్తేభ వృత్తము వచ్చును అదే విధముగ గీత పద్యమందలి నాల్గవ పాదమందలి 'గుణనిధి' అన్నంతవరకు కందపద్యము వచ్చుచున్నది. కావున గర్భ కవిత్వ మగుచున్నది.

ఓష్ఠ్యనిరోష్ఠ్యసంకరము: —

శా. భూనాథోత్తమ! జంభభంజనమహాభోగాభిరామక్రియా!
దానోజ్జృంభితవారిపూరభరితోద్యద్వార్ధివీచివ్రజా!
మానాత్మ జయ! సుధాబ్ధినిర్మలగుణా! మాద్యన్మహాయూథప
శ్రీమానోన్నత ప్రథమానభాగ్యవర! వైరివ్రాతభేదివ్రతా. 90

వ్యాఖ్య :- ప్రతి పదమునందు పవర్గీయాక్షరములు (ఓష్ఠ్యములు) చక్కని అక్షరములు కలిసి యుండునట్లు కూర్చుట ఓష్ఠ్య, నిరోష్ఠ్య సంకరమనబడును.

క. సీహారశిఖరిశిఖర
వ్యూహామితతుహినకణమహామహిమ! మహా
మోహాపహావిమతవరా
రోహామణిహారినరూఢవిహారా. 91

వ్యాఖ్య :- ఇందు ఓష్ఠ్య, నిరోష్ఠ్య వర్ణములతో సంకరము సమ కూర్చబడినది.

లయగ్రాహి
మిత్రకులభూషణ! యమిత్రకులభీషణ! వి
చిత్రమృదుభాషణ! చరిత్ర మణిహారా!
జైత్రవిశిఖాసన! జెలిత్రిపురశాసన! ప
విత్రగుణభాసన! సగోత్రభృతిధీరా!
క్షాత్రశుభలక్షణ! సుపాత్ర జనరక్షణ! కు
శాత్రవవిశిక్షణ! యశ్రుతిమవిహారా!
గోత్రసమసింధుర! కళత్రి తవసుంధర! ప
తత్త్రిరథబంధుర తనుత్రభుజసారా! 92

గద్యము. ఇది శ్రీహనుమత్ప్రసాదలబ్ధకవితాసారసారస్వతా లంకారలికంకుశప్రతిభాబంధుర ప్రబంధషరసరచనాధురంధర ప్రబంధాంక వేంకటరాయభూషణ సుపుత్త్రి తిమ్మరాజపౌత్త్రి సకలభాషావిశేష నిరుపమావధాన శారదామూర్తి మూర్తి ప్రణీతం బైన కావ్యాలంకారసంగ్రహం బను మహాప్రబంధంబునందుఁ ద్రివిధదోష నిర్ణయంబును, గుణప్రకరణంబును, శబ్దాలంకారసంగ్రహంబు నన్నది చతుర్థాశ్వాసము.

—(0)—

శ్రీ ర స్తు

# కావ్యాలంకారసంగ్రహము

## నరసభూపాలీయము

....)o(....

### పంచమాశ్వాసము

క. శ్రీసదనసౌందర్య! బు
ధానందనకీర్తివిజితహారిచందన! మే
ధానయనిధాన! దానే 1

తే. అవధరింపుము లక్ష్మలక్ష్యముల నెల్ల
ననఘ! భవదీయనామధేయాంకితముగ
బహువిధోక్తుల నొనరింతుఁ బద్యవితతి;
నింకఁ జతురార్థభవదలంకృతులు వరుస. 2

వ. ఉపమానన్వయోపమేయోపమాస్మరణరూపకపరిణామ
సందేహభ్రాంతిమదపహ్నవోల్లేఖోత్ప్రేక్షాతిశయోక్తి
సహోక్తి వినోక్తి సమాసోక్తి వక్రోక్తి స్వభావోక్తి
వ్యాజోక్తి మీలన సామాన్య తద్గుణాతద్గుణ విరోధా
భాసవిశేషాధిక విభావనావిశేషోక్త్యసంగతి విచిత్రాన్యోన్య
విషమ సమతుల్యయోగితా దీపకప్రతివస్తూపమాదృష్టాంత
నిదర్శనా వ్యతిరేక శ్లేష పరికరాక్షేప వ్యాజస్తుత్యప్రస్తుత
ప్రశంసా పర్యాయోక్తి ప్రతీపానుమాన కావ్యలిం
గార్థాంతరన్యాస యథాసంఖ్యార్థావృత్తి పరిసంఖ్యోత్తర
వికల్ప సముచ్చయ సమాధి భావిక ప్రత్యనీక వ్యాఘాత
పర్యాయ సూక్ష్మోదాత్త పరివృత్తి కారణమాలైకావళీ

మాలాదీపకసార రసవత్ప్రేయ ఊర్జస్వి సమాహితంబు లన నెబ్బది యలంకారంబులు. ఉపమారూపక పరిణామ సందేహ భ్రాంతిమదుల్లేఖాపహ్నవోత్ప్రేక్షా స్మరణ తుల్యయోగితా దీపకప్రతివస్తూపమా దృష్టాంత సహోక్తి వ్యతిరేక నిదర్శనా శ్లేషంబులు పదియాఱును ప్రతీయమానౌపమ్యంబులు; సమాసోక్తి పర్యాయోక్త్యాక్షేప వ్యాజస్తుత్యుపమేయోపమానన్వయాతిశయోక్తి పరికరా ప్రస్తుత ప్రశంసానుక్తనిమిత్తవిశేషోక్తులు పదియును ప్రతీయమాన వస్తుకంబులు; రసవత్ప్రేయ ఊర్జస్వి సమాహిత భావికంబులేనును ప్రతీయమానరసభావంబులగు; కడమ యుక్తనిమిత్తవిశేషోక్తిసహితంబు లగు నుపమాద్యలంకారంబులు నలువదియునస్ఫుట ప్రతీయమానౌపమ్యరస భావంబులగు;

సం౧దు.

వ్యాఖ్య :- అలంకారములలో ప్రతీయమాన ఔపమ్యలు 16, ప్రతీయమాన వస్తుకములు 10, ఉపమాదులు 40, రసవత్, ప్రేయస్, ఊర్జస్వితో, సమాహితాలు 4, మొత్తము 70 అలంకారములు.

సీ. అవని సాధర్మ్యంబు త్రివిధమౌ; భేదప్ర
 ధాన మభేదప్రధాన మరయ
నుభయప్రధాన మై; యోగి దీపకము తుల్య
 యోగితయుఁ బ్రతివస్తూపమయును
దృష్టాంతమును సహోక్తియు నిదర్శన ప్రతీ
 పము వ్యతిరేకంబు ప్రబలు భిన్న
సామ్యము; ల్లూపక సందేహ పరిణామ
 ములు భ్రాంతిమదపహ్నుతులు నభిన్న

తే. సామ్యధర్మంబు లుల్లేఖసంగతముగ;
నుపమ యుపమేకోపమయును ననన్వ
యంబు స్మరణంబుఁ దలఁప భేదావిభేద
సహితసాధర్మ్యగుణవిశిష్టములు; మఱియు.

వ్యాఖ్య :- సాధర్మ్యములు మూడు విధములు, భేద ప్రధానము, అభేద ప్రధానము, భేదా భేద ప్రధానము అవి సాదృశ్యములు మూడు విధములు, దీపకము, తుల్యయోగిత, ప్రతివస్తూపమ దృష్టాంతము, సహోక్తి, నిదర్శనము, ప్రతీపము, వ్యతిరేకము, అను ఎనిమిదియు, భేద ప్రధానమగు సాదృశ్య అలంకారములు, రూపక, సందేహ, పరిణామ, భ్రాంతిమత్, అపహ్నవ, ఉల్లేఖాలంకారములు భేదప్రధానమగు సాదృశ్యముగల అలంకారములు ఉపమానోపమేయములకు భేద ప్రధానమగు సాదృశ్యముగోచరించును. అభేదప్రధానమున ఉపమానోపమేయములకు అభేదము ఉన్నట్లుగా గోచరించును. ఉపమ, ఉపమేయోపమ, అనన్వయము, స్మరణము, భేదా భేద ప్రధానమగు సాదృశ్యముగల అలంకారములు.

సీ. అతిశయోక్త్యుత్ప్రేక్ష లప్పవసితమూల;
లొగి విభావన విశేషోక్తివిషమ
ములు ససంగతిచిత్రము లతద్గుణాన్యోన్య
ములు భావికవిశేషములు విరోధ
జన్యము; ల్వ్యాఘాతసహితంబుగాఁగ స
ముచ్చయంబు వికల్పముఁ బరిసంఖ్య
ముల యథాసంఖ్య మర్థాపత్తి పర్యాయ
భవములు; పరివృత్తి ప్రత్యనీక

తే. తద్గుణసమాధులు వినోక్త్యుదాత్తసమము
లును స్వభావోక్తి లోకవర్తనభవములు;

గరిమ ననుమాన కావ్యలింగములు తర్క-
జంబు లర్థాంతరన్యాససంగతముగ. 5

వ్యాఖ్య :- అతిశయోక్తి, ఉత్ప్రేక్ష, అనునవి అధ్యవసాయ మూలకములు విభావన, విశేషోక్త, విషమ, అసంగతము, చిత్ర, అతద్గుణ, అన్యోన్య, భావిక, విశేష, వ్యాఘాతములు విరోధ మూలకములు, సముచ్చయ, వికల్ప, పరిసంఖ్య, యథాసంఖ్య, అర్థాపత్త్యలంకారములు వాక్య న్యాయ మూలకములు, పరివృత్తి, ప్రత్యనీక, తద్గుణ, సమాధి, వినోక్తి, ఉదాత్త, సమ, స్వభావోక్తులు, లోక వ్యవహార మూలకములు. అనుమానము, కావ్యలింగము, అర్థాంతరన్యాసము తర్క- న్యాయమూలకములు.

సీ. కారణమాలికైకావళీసార మా
లాదీపకంబు లుల్లసితశృంఖ
లావిచిత్రతత్త్వమూలములు; వ్యాజోక్తి వ
క్రోక్తి మీలన మపహ్నుతిభవములు;
పరఁగు సమాసోక్తిపరికరంబులు విశే
షణజాతచాతుర్యసంభవములు;
కడమ శ్లేషాద్యలంకారము లూహ్యోర్వోది
తన్యాయనిరపేక్షతాయుతంబు;

తే. లీయలంకారముల కెల్ల నిలఁ బ్రధాన
మైన యుపమయె ముందుగా ననువు కొల్పి
యొకటి కొకటికి భేదము ల్ప్రకటములుగ
నరవి నెఱిఁగింతు లక్ష్మలక్ష్యమ్ము లెలమి. 6

వ్యాఖ్య :- కారణమాల, ఏకావళీ, సార, మాలాదీపకాలంకారములు, శృంఖలావిచిత్ర తత్త్వమూలములు, వ్యాజోక్తి, వక్రోక్తి, మీలనము అపహ్నుతి మూలకము, సమాసోక్తి, పరికరము విశేషణ వైచిత్రి మూలకము శ్లేషాది అలంకారములు ఎట్టి న్యాయమును అపేక్షింపవు. ప్రధాన

మైన ఉపమాలంకారమును తేనియబరిచి, మిగిలిన అలంకారములు తెలుప బడును.

సీ. ఉత్ప్రేక్షవలె నసిద్ధోపమానము కన
నన్వయముకైవడి నభిన్నంబు గాక
హీనోపమయుఁబోలె నిల నహృద్యము గాక
యుపమాన మనఘమై యుండెనేని
శ్లేషంబువలెఁ బద శ్లిష్టమాత్రము గాక
సార్థమై యల రూపకాదుల క్రియ
వ్యంగ్యంబు గాక సామ్యము వాచ్య మగునేని
యౌపమ్యము ప్రతీప మట్లు తలఁపఁ
తే. క్రమవిపర్యాసనహితంబు గాక యున్న
నలరు నుపమేయకోపమయట్లు సామ్య
ధర్మమిరుమాఱు పరునలఁ దడవ కున్న
నుపమ యగు; దీని భేదంబు లుగ్గడింతు. 7

వ్యాఖ్య :- ఉత్ప్రేక్షయందు ఉపమానము ప్రసిద్ధముగా నుండదు. అనన్వయాలంకారమున ఉపమానోపమేయములు అభిన్నములు. హీనోపమయందు ఉపమానము హృదయముగా నుండదు. శ్లేషయందు శబ్ద సామ్యమేగాని, అర్థసామ్యముండదు. సందేహాదులయందు సామ్యము వ్యంగ్యముగాను, ప్రసిద్ధముగాను, ఉపమానోపమేయములు భిన్నముగాను హృద్యముగాను అర్థసామ్యముతోను ఉండును.

తే. ఒనరు నది పూర్ణయును లుప్తయును ననఁగ;
నందు నుపమాన ముపమేయ మలరు సమత
సామ్యవాచకమును గూర్పఁ జాలుఁ బూర్ణ;
కొన్ని కడ మైన లుప్తయై కొమరు మిగులు. 8

వ్యాఖ్య :- ఈ ఉపమాలంకారము పూర్ణోపమా, లుప్తోపమా అని

రెండు విధములు. ఉపమానము, ఉపమేయము, సామాన్య ధర్మము, సాదృశ్యవాచకము అను నాలగు అంశములలో ఏది లోపించినను లుప్తోపమ అగును. అన్నియు కలిగి ఉన్నది పూర్ణోపమ అగును.

తే. అందు నుభయాఖ్య యగుఁ బూర్ణ యార్థి శ్రౌతి
యనఁగ; రఘురామసన్నిభుఁ డనెడిచోట
నార్థి; కందర్పుదుపోలె నలరుచుండు
నధిపుఁ డనుచోట శ్రౌతియై యతిశయిల్లు. 9

వ్యాఖ్య :- ఆర్థే, శ్రౌతి అను భేదములచే పూర్ణోపమను రెండు విధములు. ఆతడు రఘురామ సన్నిభుఁడు అనుచో "సన్నిభ" "ఆర్థి" అయినది. అధిపుఁడు కందర్పుఁడును పోలె నలరుచుండు" అనుచోట "పోలెన్" పద ప్రయోగముచే శ్రౌతియు అగును.

క. ధరయం దార్థియుఁ ద్రివిధాం
తర మయ్యె సమాసవాక్యతద్ధితగతియై;
తిరముగ వాక్యసమాసా
చరణంబుల ద్వివిధ యగుచు శ్రౌతియుఁదనరున్. 10

వ్యాఖ్య :- సమాసగతము, వాచ్యగతము, తద్ధితగతము అని ఆర్థి పూర్ణోపమ అను మూడు విధములు. వాక్యగతము. సమాసగతము అని శ్రౌతి రెండు విధములు.

క. అల తద్ధితములయందుం
దెలియ వతిప్రత్యయంబు తెలుఁగున లేమిం
గలిగిన కల్పప్రత్యయ
మలరుచు నయ్యార్థియంద యది గనుపట్టున్. 11

వ్యాఖ్య :- సంస్కృతమునందువలె "వతి" తద్ధితప్రత్యయము తెనుగు నందు లేమింజేసి, ఆక్రమమున "కల్ప" ప్రత్యయ ప్రయోగమే "ఆర్థి" యందు ప్రయోగించబడును.

ఉ. కావునఁ బూర్ణ పంచవిధ; కర్ణోనలుప్తయు సామ్య ధర్మమిా
ప్తావిధిఁ గూర్చ కున్నయెడ శ్రౌతియునార్థియునై యథో క్తసం
భావనవాక్యయుక్తయు సముస్తయు వాక్యసమానతద్ధిత
శ్రీవిశదాత్మలై ధరణిఁ జెన్నగు సాయకసంఖ్య; నెల్లన్నన్. 12

వ్యాఖ్య :- పైన చెప్పిన విధముగా పూర్ణోపమ ఐదు విధములు. లుప్తోపమ సాధారణ ధర్మము ప్రయోగించునపుడు శ్రౌతి, ఆర్థి, భేదము లచే రెండు విధములు. శ్రౌతి వాక్యగత సమానగత భేదములచే రెండు విధములు. ఆర్థి వాక్యగత, సమాన తద్ధితగల భేదములచే మూడు విధ ములు. ఈ విధంగా లుప్తోపమ ఐదు విధములు.

సమానగతపూర్ణార్థి:-

క. ఈవియుఁ జల్లఁదనంబును
కేవల సౌందర్యగుణము గిటికొనఁగఁ గళా
భావకుఁడైన నృసింహ
క్ష్మావల్లభుఁ డమరుఁ బూర్ణచంద్రోపముఁడై. 13

వ్యాఖ్య :- ఈ పద్యమునందు నృసింహుడు ఉపమేయము పూర్ణ చంద్రుడు ఉపమానము. "ఉపమ" అను పదము ఉపమావాచకము. కళా భావుకత్వము సాధారణ ధర్మము. నాలుగు ధర్మములు పాటించుటవలన పూర్ణోపమ. "ఉపమ" అను పదము ప్రయోగించుటవలన "ఆర్థి" యు అయినది. పూర్ణచంద్రోపముఁడై " అని సమాసము ప్రయోగించుట వలన సమాసగతము అయినది.

వాక్యగతపూర్ణార్థి :—

క. వెలయుఱవరాంధ్రుడు తలఁపుల
వలపును నిలుపంగఁ జాలు వరరూపమునం

తెలుఁగుచు నృసింహుఁ డలరుల
విలుకానికి సాటి యయ్యె విశ్రుతలీలన్. 14

వ్యాఖ్య :- "నృసింహుండలరు విలుకానికి సాటియయ్యె" అను వాక్యమున ఉపమాన, ఉపమేయ, సాధారణ ధర్మ ఉపమావాచకములు కలవు. కావున పూర్ణోపమ అయినది "సాటి" అను పదము సమానుడు అను ధర్మిని తెలిపి, పిదప అర్థసిద్ధి అగునట్లు చేయుచున్నది. వ్యస్తముగా నుండుటవలన వాక్యగతమగుచున్నది. "సాటి" పదమువలన ఆర్థి అగుచున్నది.

తద్ధితగతపూర్ణార్థి :—

క. ఏయెడల నియ్యనియ్యం
గాయలు గాచిన నృసింహుకర మర్థులకుం
బాయని వేడ్కఁ ఫలించుచు
నాయతగతిఁ గల్పకల్పమై విలసిల్లున్. 15

వ్యాఖ్య :- దానమును చేయగా, చేయగా, కాయలు కాచిన నృసింహుని కరము ఫలించుచు కల్పకమయి విలసిల్లుచున్నది" అనునప్పుడు నృసింహుని కరము ఉపమేయము. కల్పకము ఉపమానము, "కల్ప" ప్రత్యయము ఉపమావాచకము "కల్పకల్పః" అనునది తద్ధితగత పూర్ణార్థి ఇందు శ్లేషతో గూడిన ఉపమయుగలదు.

వాక్యగతపూర్ణశ్రౌతి ;—

క. దివియును భువియు భుజంగము
భువనంబును నిండి విమలభూరిప్రభతో
దివిజేంద్రతటినియో యన
నవిరళగతిఁ బొల్చు నీదుయశము నృసింహా. 16

వ్యాఖ్య :- నరసరాజు కీర్తి ముల్లోకములు నిండి ఆకాశగంగను పోలుచు అవిరళగఁ బొల్చుచున్నది" అను ఉదాహరణమున "కీర్తి" ఉపమేయము. దివిజేంద్రతటి (ఆకాశగంగ) ఉపమానము. "దివియు,...

వెండుట భూరిప్రభ కలిగియుండుట సాధారణ ధర్మము. "ఓ యన" ఉపమావాచకము. కావున పూర్ణోపమ.

సమాసగతపూర్ణ శ్రౌతి:—

క, కరముల శంఖము చక్రము
నెరవుగ నురమందుఁ జెంది యిందిర దనరన్
హరివలె వెలయుదు వౌరా!
నరసాహసయోబరాజవరసింహనృపా. 17

వ్యాఖ్య :- నరసరాజు కరమున శంఖచక్రములను, ఉరమున ఇందిరను ధరించినహరివలె నున్నాడు" అనునప్పుడు నరసింహుడు ఉపమేయము. హరి ఉపమానము. శంఖ చక్రధారణ, సాధారణ ధర్మము. "హరివలెనె" సమాసము కాన సమాసగతపూర్ణోపమ అయినది.

పంచవిధానుపాత్తధర్మలుప్తోపమలు :—

శా. నీదోఃఖడ్గమహీంద్రుఁడో యనఁదగు; నీ దివ్యతేజో
భరం
బాదిత్యుండునుబోలెఁ బొల్చు;భవదీయాలాపము ల్వల్లకీ
నాదబ్రహ్మమునాటి; నీకరము మందారోపమానంబు; నీ
ప్రాదుర్భావము మాధవాభ్యుదయకల్పంబౌ నృసింహా
ధిపా.

వ్యాఖ్య :-

1. వాక్యగత-శ్రౌతి-అనుపాత్త ధర్మలుప్తము
"నీ దోఃఖడ్గమహీంద్రుడో" అనుచోట దోఃఖడ్గము ఉపమేయము, అహీంద్రుఁడుపమానము. "డోయనన్" ఉపమావాచకము. సాధారణ ధర్మము లుప్తము.

2. సమాసగత-శ్రౌతి- అనుపాత్త ధర్మలుప్తము
"నీ దివ్యతేజోభరంబాదిత్యుఁడును బోలె" ఇందు తేజస్సు ఉప

మేయము. "ఆదిత్యుండును బోలె" సమాసగత ఉపమానము. ఇందు ధర్మవాచకము లేదు.

3. వాక్యగత-ఆర్థీ-అనుపాత్త ధర్మలుప్తము.
"భవదీయాలాపము వల్లకీ నాదబ్రహ్మముసాటి" ఆలాపము ఉపమేయము. వల్లకీ నాద బ్రహ్మమూ ఉపమానము. "సాటి" ఉపమా వాచకము. సాధారణ ధర్మము లుప్తము. నాద బ్రహ్మము తోడ సాటి" అన్నచో వాక్యగతమగును.

4. సమాసగత-ఆర్థీ-అనుపాత్తధర్మలుప్తము
"నీ కరము మందారోపమానంబు". కరము ఉపమేయము; మందారము ఉపమానము, ఉపమా పదము ఉపమా వాచకము "మందారోపమానంబు" అనుచో సమాసగతము.

5. తద్ధితగత-ఆర్థీ-అనుపాత్తధర్మలుప్తము
"ప్రాదుర్భావము మాధవాభ్యుదయకల్పంబో" ప్రాదుర్భావము ఉపమేయము- మాధవాభ్యుదయము ఉపమానము- "కల్ప" "ప్రత్యయము ఉపమావాచకము. ధర్మములుప్తము.

అనుపాత్తోపమానలుప్త:—

సీ. జలదంబుగతి నిచ్చి వెలవెల్లఁ బోలక
కలశాంబునిధిరీతిఁ గసరుకొనక
యాగ్రమాన్వలె ఫలం బిడి జిగి దప్పక
సురభికై వడిఁ గొలు వరసి యీక
కమలారివలె నిచ్చి క్రమ్మఱఁ గైకోక
బలిమాడ్కి నర్థిచే భంగపడక
చండాంశుసుతుపోల్కిఁ గుండమార్పులు గాక
వాసవమణిభాతిఁ ద్రాసమంద
తే. కొసఁగ నేర్తువు యాచకవ్యూహమునకు
భూనుతానూనదానవిద్యానిరూఢిఁ;

బోసఁగ నీతోడ నెవ్వానిఁ బోల్ప వచ్చు?
నరసగుణహార! యోబయనరసధీర. 19

వ్యాఖ్య : నరసభూపాలుడు ఉపమేయము. "ఒసగనేర్చుట" సాధారణ ధర్మము. "పోల్చవచ్చు" ఉపమావాచకము. పోల్చదగిన వారు లేరని చెప్పబడుటవలన వుపమానము లుప్తమయింది.

అనుపాత్తవాచకలుప్త :—

సీ. దర్పితాహితనృపోత్తములు నిన్నాదరింపఁ
గలరె ధీరోత్తమగండబిరుద!
విమతకీర్తిప్రతాపములు నీచే సమ
య్యునె యుభయరగండబిరుద!
యరివధూతాటంకగరిమంబు నీచేతఁ
గలుగునే గండరగండ బిరుద!
పరిపంధిగంధసింధురపంక్తి నీప్రోల
నుండునే గండభేరుండబిరుద!

తే. యరుణపరిణతధామ! రామాభిరామ!
రామణీయకవిర్జితప్రసవబాణ!
బాణసాహిత్యపరిపాక! పాకవైరి
విభవసౌభాగ్య! యోబభూవిభునృసింహ. 20

తే. 'అరుణపరిణత ధామ రామాభిరామ'
యనెడిచో భానుకైవడి నలరు కాంతి
పంక్తిగలవాఁడు, రామునిపగిదిఁ బోల్చు
వాఁడు నను వాచకంబవివక్షితంబు. 21

వ్యాఖ్య :- నరసభూపాలుఁడు ఉపమేయములు అరుణ పరిణతధామ, రామాభిరామ, ఉపమానములు, పరిణతధామత్వము, రామాభిరామత్వము సాధారణ ధర్మములు. "ఇవ, వలె" ఉపమావాచకత్వములు లుప్తములు కాన వాచక లుప్తమైనది.

అనుపాత్తవాచకధర్మోపాదానలుప్త:—

సీ. ఇటు వేసితేజీల నెనయు మిన్నులతేరి
జోడు పుట్టినకొండఁ జూచినాఁడ;
నిటు నేలజేజేల కెఱుకైన చెంగావి
సుదసంజఁ దగు కొండఁ జూచినాఁడ;
నిటు కోడెకాతు మైవిడ్డ సామ్ములమేఁత
సొంపు లీనెడుకొండఁ జూచినాఁడ;
నిటునల్ల దేవరయింట నంటినతెల్ల
జోటి వా యని కొండఁ జూచినాఁడ;

తే. నెందు నందును నీతోడియీడువానిఁ
గడకతోఁ గానఁగానను గాన ననుచు
నిక్క మేబాస కైనను నిల్పువాఁడ
నరసు తాటోపు! మొటయనరసభూప. 22

వ్యాఖ్య :- నరసభూపాలుఁడు ఉపమేయము, ఉదయాద్రి, పశ్చిమాద్రి, హిమాద్రులయందు నీసాటి వాడులేడనుట వలన ఉపమావాచకము లేదు ధర్మవాచకము లుప్తము.

అనుపాత్తవాచకధర్మోపమానలుప్త:—

మ. మహితప్రాభవమానధుర్య! మితవాఙ్మర్యాద! మీనాంకవిగ్రహ! ముఖ్యాన్వయమూర్తి! శౌర్యరసమేఘత్యాగ!
మైత్రీరఘూ

ద్వహ! మేధాన్విత! మాతృకాభరణ! మంత్రప్రౌఢ! మస్తాగ్రన
్యస్త హరిశ్రీచరణాబ్జ! వర్ధిలు గుణాధారా! నృసింహాధిపా. 23

తే. అలర 'మీనాంకవిగ్రహుం' డనెడిచోట
నిందు మీనాంకునట్టివలె నింపు మీఱు
విగ్రహము గల్గువాఁ డన వెలయు సామ్య
వాచకోపమానంబు లసూచితములు. 24

వ్యాఖ్య :- "మీనాంకవిగ్రహుఁడు" అనుచో "మీనాంకుని యొక్క విగ్రహము వంటి విగ్రహము కలవాడు" అని విగ్రహవాక్యము మొదటి విగ్రహవాక్యము ఉపమానవాచకము. "వంటి" ఉపమావాచకము- సాధారణ ధర్మము లుప్తము.

క. ద్వివిధం బగు సాధర్మ్యము
భువి నుపమానోపమేయముల కొక్కటియై
తవుటయు, రెంటికి ద్వివిధం
బవుట యున; ద్వితీయగతియు నలరు ద్వివిధమై. 25

క. శ్రుతి నేకార్థము శబ్ద
ద్వితయుంబున సంఘటించ వెలయును వస్తు
ప్రతివస్తుత; యగు బింబ
ప్రతిబింబత యర్థశబ్దపార్థక్యమునన్. 26

వ్యాఖ్య :- ఉపమాలంకారమున సాధారణ ధర్మములు ఉపమానోపమేయములకు ఒకటే యుండుట, రెండింటికి రెండు విధములుగా నుండుట జరుగుచుండును. ఈ రెండవ విధానము నందు సాధారణ ధర్మమా శబ్దద్వయమునకు నేకార్థమునే చెప్పినచో వస్తు ప్రతివస్తు భావము, అర్థ, శబ్ద భేదములచే చెప్పినచో బింబ ప్రతిబింబ భావమనియు చెప్పవలయును.

వస్తుప్రతివస్తూపమ:—

క. అవనిఁ బరిష్కృత మయ్యెన్
రవివంశం బోబళౌరినరసింహునిచే
దివిచరతరుభూషితమై
నవనవగతిఁ బొల్చు నందనవనం బనంగన్. 27

వ్యాఖ్య :- కల్ప వృక్షములచే నందన వనము "భూషిత"మయినట్లు గానే, సూర్యవంశము నరసరాజు చేత అలంకరింపబడినది. ఇందు రవి వంశము ఉపమేయము, నందన వనము ఉపమానము. "పరిష్కృతము, భూషితము" అను పదములు ఏకార్థమున సామాన్య ధర్మములుగా చెప్ప బడినవి కావున వస్తు ప్రతి వస్తూపమ అయినది.

బింబప్రతిబింబోపమ:—

క. గురుశౌర్యయుతము నాయత
కరవాలము నగు నృసింహునృపభుజ మలరున్
దరళఫణామణికిరణ
స్ఫురణము జిహ్వాలమైన భోగియుఁ బోలెన్. 28

వ్యాఖ్య :- శౌర్యము కలిగి, గొప్పకత్తిని ధరించిన నరసరాజు కరవాలము, పడగయందలి మణికాంతులతో, పొడవైన నాలుకలు గల సర్పమువలె ఉన్నదని భావము. ఇందు ఉపమేయము నరసరాజు కరము. ఉపమానము సర్పము, శౌర్యము కలిగి యుండుట, ఆయత కరవాలము ధరించుట ఉపమేయ ధర్మములు. "మణి కిరణ స్ఫురణము, జిహ్వాలము" ఉపమాన ధర్మములు. ఇందు ఉపమాన, ఉపమేయముల ధర్మములకు అభేదము చెప్పుట వలన బింబ ప్రతి బింబోపమ అయినది.

అనన్వయము:—

క. సరసం బగు నొక్కచోటికే
ధర నుపమానోపమేయధర్మము దిరమై

వరఁగిన ననన్వయం బగు;
నరయంగా దీనిలక్ష్య మాఁపాదింతున్. 29

వ్యాఖ్య :- ఒకే వస్తువును ఉపమానముగాను, ఉపమేయముగాను చెప్పినచో అనన్వయాలంకారమగును.

క. నీదయకు నీదు జో డగు
నీదయ; నీజయముసాటి నీజయ; మిలలో
నీదానమునకు నెన యగు
నీదానము; నీకు సాటి నీవె నృసింహా. 30

వ్యాఖ్య :- నీ దయ నీ దయ వంటిది, నీజయము, నీజయము వంటిది, నీదానము నీదానము వంటిది. నీకుసాటి నీవే అని భావము. ఇందు ఒకే వస్తువు ఉపమానముగాను, ఉపమేయముగాను వర్ణించుట వలన అనన్వయాలంకారము.

ఉపమేయోపమ: —

క. నిపుణస్థితి నుపమేయం
బుపమానముఁ బోల మఱియు నుపమానం బా
యుపమేయముఁ బోలఁగుఁ దగు
నుపమేయోపమ యనంగ నొగి; నెట్లన్నన్. 31

క. శరణాగతభరణంబున
నరసింహునిసాటి వచ్చు నరనాథుఁ డీ
నరసింహుఁ, డితని కెన యా
నరసింహుఁడె కాక యితరవరులకు వశమే. 32

వ్యాఖ్య :- ఉపమేయము ఉపమానముగాను, ఉపమానము, ఉపమేయము, పోలునట్లుగాను చెప్పుట ఉపమేయోపమ అగును.

శరణాగత రక్షణమున నరపరాజుకి నృసింహుడు సాటి, నృసింహునికి, నరసింహుడు సాటి అనుట వలన ఉపమేయోపమ అయినది.

## స్మరణము:—

క. ధర నొకవస్తువుఁ గనుఁగొని
వరుసం దత్సదృశమైన వస్తువు దలఁపన్
స్మరణం బని పాటింతురు
రరయ నలంకారవేత్త; లది యెట్లన్నన్. 33

క. ఇల యంత్రమత్స్యమేయను
విలు పూనిన శ్రీనృసింహవిభుఁ గాంచి జనుల్
తలఁపుదురు ద్రుపదకన్యా
కలితకరగ్రహణనిమిత కాముకుఁ బార్థున్. 34

వ్యాఖ్య :- ఒక వస్తువును చూచినచో మఱొక వస్తువు స్ఫురణకు వచ్చినచో స్మరణాలంకారము అగును.

మత్స్య యంత్రము వేయుటకై విల్లు ఎత్తిన నరసభూపాలుని చూచి, అర్జునునిగా తలంతురు అనుట వలన స్మరణాలంకారము అయినది.

## రూపకము:—

మ. అల సందేహముమాడ్కిఁ గాక యుపమేయం బెన్న
నచ్ఛన్నమై, యలఘూత్ప్రేక్షయు నా నభిన్నమతిజంబై
యుండ కారోప మింపలరంగ బ్రకృతోపయోగిపరిణా
మారోపతుల్యంబుగా, కల యారోపిత మిందు రంజనము
సేయన్ రూపకంబై తగున్. 35

వ్యాఖ్య :- ఒక వస్తువునందు వేరొకవస్తువు యొక్క ధర్మమును ఆరోపించుట ఆరోపము. సందేహాలంకారమునందు ఉపమేయము తిరోహితము. ఉత్ప్రేక్షయందుఅధ్యవసాయిగర్భము, పరిణామము నందు ఆరోపము ప్రకృతోపయోగితముగానుండు. రూపకమున ఆరోపము రంజకత్వము కలుగును.

క. అరయు రసజ్ఞులమతమున
నరు దగు నీరూపకంబు సావయవంబున్
నిరవయవంబును నరుసం
బరంపరిత మనఁగఁ ద్రివిధభావము నొందున్. 36

వ్యాఖ్య :- ఈ రూపకము సావయవము, నిరవయవము, పరంపరితము అని మూడు విధములు

చ. అరయ సమస్తవస్తువిషయంబును నేకతలప్రవర్తియై
యరుదుగఁ బొల్చు సావయవ; మవ్వలఁ గేవలమాలికాఖ్య
మౌ,నిరవయవంబు; శ్లిష్టమును నేర్పునశ్లేషవిహీనమౌ పరం
పరితము; తత్ప్రభేదములఁ బాయక కేవలమాలికాఖ్యమౌ 37

క. కావున రూపక మష్టవి
భావమౌ మగు; లక్షణంబు లల లక్ష్యంబుల్
వావిరి నొసరు వీనికి
భావజధనురసమరసవిభాసితఫణితిన్. 38

వ్యాఖ్య :- సావయవ రూపకము, సమస్తవస్తు రూపకము, ఏకతల వివర్త రూపకమనియు, నిరవయవము కేవల రూపకము, మాలా రూపకమనియు, పరంపరితము, కేవల శ్లిష పరంపరితము, కేవలా శ్లిష్ట పరంపరితము, శ్లిష్టమాలా పరంపరితము, అశ్లిష్టమాలా పరంపరితము అని మొత్తము ఎనిమిది విధములు.

క. అవయవియు నవయవంబులు
వివరింప సమస్తవస్తువిషయంబిలలో;
నవయవియవయవగమ్యం
బగునది యేకతలవర్తి యగు; నెట్లన్నన్. 39

వ్యాఖ్య :- అవయవియు, దాని అవయవములను సమగ్రముగా

రూపింపబడినచో సమస్త వస్తు సావయవ రూపకమగును. అవయవ నిరూపణచే అవయవియు గమ్యమానమగుచో ఏక దేశ వివర్తి రూపకమగును.

సమస్తవస్తువిషయసావయవరూపకము :—

మహాస్రగ్ధర

హిమశైలద్వీపదీప్తం; బిసమణిమహితం! బిందుశంఖాభిరామం;
బమరాంభోమత్స్యయుక్తం! బహుప లహరికం;బభ్రశైవాల
జాలం, బమితాశాకుంభినక్రం; బజహాదుడుకణం; బాత్తసంధ్యాప్రవాళం, బమరుక్ శ్రీనారసింహోద్యతవిశదయశో
హారిదుగ్ధాబ్ధి వేడ్కన్. 40

వ్యాఖ్య :- ఇందు నరసరాజు కీర్తి పాల సముద్రమని (అవయవి) దానికి అవసరములగు అవయవములు వర్ణింపబడినవి. కావున ఇది సమస్తవస్తువిషయమగు సావయవ రూపకము అగును.

ఏకదేశవివర్తిసావయవరూపకము :—

క. ధర నొఱ యను వల్మీకము
నరభసగతి వెడలి నీదుచఃలాసి మదో
ద్ధురచరదరిధరణీధురం
ధరజీవానిలము(గ్రోలు నరసింహనృపా. 41

వ్యాఖ్య :- ఇందు "ఒఱ" మొదలగు అవయవముల, రూపణము వలన, అవయవియగు ఖడ్గమునందు సర్పత్వ రూపణము గోచరించుచున్నది.

క. అవయవిమాత్రంబున నే
కవిమతి విశ్రాంతమైనఁ గన నిరవయవం;
బవని నిది కేవలంబును
ద్వివిధత మాలికయు నయ్యె; విను మెట్లన్నన్. 42

వ్యాఖ్య :- అవయవికి మాత్రమే రూపణం ముండిన నిరవయవము అనబడును. నిరవయవము కేవలం, మాలిక అని రెండు విధములుగా వుండును.

కేవలనిరవయవరూపకము :—

క. ఇల నీదుకీర్తిచంద్రిక
యలఘుతరస్ఫూర్తి నలినజాండకరండం,
బులు నిండి వెల్లివిరిసె
న్నలనహుషసమానశీల! పరసనృపాలా. 43

వ్యాఖ్య :- ఇందు నరసరాజు కీర్తి చంద్రిక ఒక్కటే వర్ణింపబడి నది. కీర్తియందు చంద్రిక ఆరోపింపబడుటవలన కేవల నిరవయవము.

మాలానిరవయవరూపకము :—

క. హారశిఖరిదరుల భాషా
తరుణీకుచగిరుల నమరతరులం జెలఁగు
ఝురులై సరులై విరులై
వరనుతముగ నీదుకీర్తి నరసింహనృపా 44

వ్యాఖ్య :- నరసరాజు కీర్తి కైలాస గుహలయందు ప్రవాహరూప మున, సరస్వతియందు ముత్యాల సరములలై కల్ప వృక్షములయందు పుష్పములవలె ప్రకాశించుచున్నది. ఇందు అవయవియగు కీర్తిని, ఝరీ రూపముగాను, సరులుగాను, విరులుగాను, వర్ణించుటవలన మాలానిరవ యవ రూపకమయినది.

క. రూపక కారణమై తగు
రూపకము పరంపరితము రూపింపఁగ, నిం
దేపగు నాల్గు విభేదము
లాపాదించెద నుదంచితాయతఫణితిన్. 45

వ్యాఖ్య :- ఒక రూపకమునకు ఇంకొక రూపకము కారణమైనచో పరంపరిత రూపకము అది శ్లిష్టనిబంధనము అశ్లిష్ట నిబంధనము అని రెండు విధములు. రూపణము శ్లేషమూలకమైన శ్లిష్టనిబంధనము, అట్లు కానిచో అశ్లిష్టనిబంధనము, మఱల కేవల, మాలా భేదములచే రెండు విధములు - మొత్తము పరంపరిత రూపకాలంకారము నాలుగు విధములు,

శ్లిష్టకేవలపరంపరితరూపకము :—

క. నిరతంబు రాజహంసలఁ
బరువెత్తఁగఁ జేయు నౌర! పటుచటులభవ
త్కరకరవాలకరాళ
స్ఫురితాంభోదము నృసింహ భూపాలమణీ. 46

వ్యాఖ్య : నరసరాజు చేతిలోని ఖడ్గమను మేఘము, రాజశ్రేష్ఠ లను రాజహంసలను పరుగెత్తించుచున్నది. ఇందు రాజహంసలు శ్లిష్ట రూపకము. దీనివలన "కరవాల కరాళస్ఫురితాంభోదము" అనునది రూప కము. ఇది నిరవయవము. కావున నిరవయవ శ్లిష్టపరంపరితము.

శ్లిష్టమాలాపరంపరిత రూపకము :—

క. కువలయవికసనహిమకరుఁ,
డవిరళదానాంబుదిగ్గజాగ్రణి, పద్మో
త్సవసౌభాగ్యదివాకరుఁ
డవనిని నరసింహుఁ; డితని కన్యులు సరియే 47

వ్యాఖ్య :- ఇందు నరసింహుడు కువలయ వికసన హిమకరుడు, దానాంబు దిగ్గజాగ్రణి, పద్మోత్సవ సౌభాగ్య దివాకరుడు" అని మూడు విధములుగా వర్ణింపబడినది. హిమకరుడు అను రూపకమునకు కువల యమను కువలయము అను శ్లిష్టరూపకము. నరసభూపాలుడు "దిగ్గ జాగ్రణి" అను రూపకమునకు "దానాంబువులు అనుదానాంబువులు" అను నది శ్లిష్టరూపకము, "నరసభూపాలుడు దివాకరుడు" అను రూపకమునకు

కారణము "పద్మోత్సవమను పద్మోత్సవము" ఈ విధముగా అనేక రూప కములు ప్రయోగించుటవలన శ్లిష్టమాలా పరంపరితము అయినది.

అశ్లిష్టకేవలపరంపరితరూపకము :—

క. శాతరతర విమతధ్వజి
నీతటకాంతార తతికి నీ చేతిమహా
హేతి దవజ్వలనోజ్జ్వల
హేతి సుమీ యోబధారుణేశ్వరునరసా. 48

వ్యాఖ్య :- శత్రుసేన అను అరణ్యమునకు నీచేత ఖడ్గము దావాగ్ని శిఖవంటిది ఇందు ఖడ్గమగ్ని శిఖ రూపకమునకు "సేనాకాంతారము" కారణమయినది, ఇందు శ్లేషలేదు. కావున అశ్లిష్ట కేవల పరంపరిత రూపకము అయినది.

అశ్లిష్టమాలాపరంపరితరూపకము :—

మ. వనితానేత్రచకోరచంద్రికః యశోవల్లీవసంతోదయం;
బనిదంపూర్వకథాసుధాబ్ధి; భుజగర్వాదిత్యపూర్వాచలం;
బనఘోద్యద్గుణరత్నరోహణము నీయాకార; మెవ్వారికిన్
వినుతింప న్వశమే? నృసింహ కరుణావిన్యాసధన్యాత్మకా. 49

వ్యాఖ్య :- నరసరాజు రూపము వనితల నేత్రములను చకోరములకు వెన్నెల, యశస్సను తీగకు వసంతఋతువు. చరిత్రమను అమృతమునకు సముద్రము, భుజదర్పమను సూర్యునికి తూర్పుకొండ. ఇందు ఆకారమను చంద్రిక రూపకమునకు "నేత్రచకోరము" అను రూపకము హేతువగుచున్నది. ఇట్లే మిగిలినవి ఊహ్యములు. ఈ విధముగా మాలా పరంపరితముగా రూపకములు ప్రయోగించుట వలన అశ్లిష్టమాలా పరంపరితరూపకము అయినది.

## పరిణామము:—

క. ధరలో నుపమేయమునను
నరుదుగ నారోప్యమాణ మగు నుపమానం
బరయఁ బ్రకృతోపయోగా
కరముగఁ బరిణామ మయ్యెఁ; గను మెల్లన్నన్. 50

క. నైలింపసతులకౌఁగిట
దేలుటకై దివికి నేఁగు దృప్తారులకున్
నీలాలనిచ్చె నాయెను
నీలాలిత హేతి యోబన్నృపనరసింహా. 51

వ్యాఖ్య :- ఉపమేయమునందు ఆరోపింపబడిన ఉపమానము ప్రకృతము ఉపయోగించినచో పరిణామాలంకారమగును.

దేవతా స్త్రీలను అనుభవించుటకు స్వర్గమునకు వెళ్ళుచున్న నీ శత్రురాజులకు నీ చేతి ఖడ్గము నిచ్చెన ఆగుచున్నది. ఇందు ఉపమేయ మగు ఖడ్గము నిచ్చెనగా ఆరోపింపబడి ప్రకృతోపయోగియగుచున్నది కాన పరిణామాలంకారము.

## సందేహము:—

తే. విషయి విషయంబుఁ గవిమతి విహితసామ్య
దీప్తసందేహ మొంద సందేహ; మదియు
గవియ శుద్ధంబు, నిశ్చయగర్భితంబు
నిశ్చయాంతంబు నగు; దీని నిశ్చయింతు. 52

వ్యాఖ్య :- ఉపమానోపమేయములు కవి ప్రతిభచే సాదృశ్యమై సందేహింపఁబడినచో సందేహాలంకారమగును. శుద్ధము, నిశ్చయ గర్భము, నిశ్చయాంతము అని మూడు విధములు.

### శుద్ధసందేహము:—

ఉ. ఇంద్రుఁడొ? యాయుపేంద్రుఁడొ? బలీంద్రుఁడొ? పార్వణ
చంద్రుఁడొ? హరిశ్చంద్రుఁడొ? రామచంద్రుఁడొ? రసాధ
రణప్రవణాత్ముఁడైన నా, గేంద్రుఁడొ? యానగేంద్రుఁడొ?
మృగేంద్రుఁడొ? యంచుఁ దలంతు రార్యులీ, సాంద్రభుజ
ప్రతాపవరణసాహసు నోబయనారసింహునిన్. 53

వ్యాఖ్య :- ఇందు నరసరాజును చూచిన రసజ్ఞులు, అతడు ఇంద్రుడో, చంద్రుడో, నిశ్చయించుకొనలేకపోవుచున్నారు. కావున ఇది శుద్ధ సందేహము.

### నిశ్చయగర్భసందేహము:—

మ. హరుఁడో యాఘురుఁడైన హాళిధృతతో యంబెద్ది? దైతే
యసం,హరుఁడో యీనృహరిఁ డైనవవ్విహాగనాహం బెద్ది?
వాణీమనో,హరుఁడో యివ్విభుఁడైన పారసనివాసాధ్యా
సనం బెద్ది? యం,చు రసజ్ఞుల్ నుతింతు రాత్మ నరసక్షోణీశు
వీక్షించుచున్. 54

వ్యాఖ్య :- ఈ నరసరాజు శివుడైనచో గంగానది ఏది, విష్ణువైనచో గరుడ వాహనమేది అని మొదట. శివుడుగా, విష్ణువుగా, బ్రహ్మగా భావించక పోయినప్పటికి పిదప నిశ్చయమైనది కావున నిశ్చయ గర్భసందేహము అయినది.

### నిశ్చయాంతసందేహము:—

సీ. తలపోయ వల్లిమాల్లి కేళ గల్గె
పలసాలసామానస ...?
భావింప మణిసాలభంజిక కెటు లబ్బె
లాలితాలాపలీలా...?

మూహింప విమలవిద్యుల్లేఖ కేలీల
నొదవె భ్రాంతి భాగ్యయోగగరిమ?
మరయంగ మదనమంత్రాధిదేవతకు నే
గతిఁ గల్గె సంగసంగ్రవసంగ?
తే. యనుచు శబరులు సందియంబు బంది యంది
తెలియుదురు; త్రోవ నీధాటి కలికి తలఁకి
యహితవనితలు వనవాటి వడలుచునికి
నరసి తాటోవ! యోబయవరసభూప. 55

వ్యాఖ్య :- నీ శత్రురాజుల భార్యలను శబరులు చూచి, లతలు గాను, సాలభంజికలుగాను, విద్యుల్లతలుగాను, మదన మంత్రాది దేవతలుగాను భావించిరి కాని, యానము, ఆలాపము, భూమి యందుండుట, దేహముతో నుండుట అను కారణము వలన "సీతే" అని నిశ్చయము పొందుట వలన నిశ్చయాంత సందేహమయినది.

భ్రాంతిమంతము:—

క. అల యుపమేయము ఛన్నత
నలరఁగ నారోప్యమాణ మగు నుపమానం
బిలఁ నెఱుకపడఁగ భ్రాంతిమ
దలంకరణ మయ్యె? దీని నాపాదింతున్. 56

వ్యాఖ్య :- కవి కృత సాదృశ్యము వలన ఉపమేయము దాగి యుండి, ఉపమానము యొక్క అనుభవము గోచరించినచో భ్రాంతిమదలంకారము అగును.

శా. చూడం జూడ స్మరసింహకీర్తిచయ మీక్షోణీనభోమధ్యమం
దేడం జూచినఁ దాన యై నెగడఁగా నీక్షించిమిన్నేట నీ

రాడంబోయెసి చేసితాపసులు నే తా! స్రమోల
సిద్ధించెఁగా
యాడంబోయిన తీర్థమంచు మదిలో హర్షించుర శ్రాంత
మున్.

వ్యాఖ్య :- నరసరాజు కీర్తిని చూచి ఆకాశగంగయని భ్రమించి సప్తర్షులు స్నానముచేయ పోవుచుండిరి. ఇందు కీర్తి ఉపమేయము, ఆకాశగంగ ఉపమానము. హర్షము ఉపమానానుభవము.

అపహ్నవము:—

క. ఉపమేయము గాదది యిది
యుపమానమె యనఁగ నెంతయు నపహ్నవమౌ!
నపుడవి ప్రాగారోపము
నపహ్నవారోపమును, ఛలాదియు నయ్యెన్. 58

వ్యాఖ్య :- ఉపమేయము కాదు ఉపమానమే అని చెప్పినచో అపహ్నవాలంకారము అగును ఇందు ప్రాగారోపము, అపహ్నుతారోపము. ఛలాది శబ్ద ప్రయోగము అని అపహ్నుతి మూడు విధములు. ఆరోపించి, అపహ్నవించుం ప్రాగారోపము, అపహ్నవించి అరోపించుట అపహ్నవారోపము ఆకృతి, ఛల, మిష, కైతవాది పదప్రయోగములు చేయుట అని మూడు విధములు.

త్రివిధాపహ్నవములు :—

మ. గురుచక్రప్రభగాని శౌర్యసుషమాంకురంబు గాఁ దిది ముఖా
స్వరకీర్తిద్యుతివంక్తి గాదుఁ బిచాంచత్పాంచజన్యప్రభా
భర మౌఁ గా; నటుగాన విశ్వభరణప్రారంభముం గోరియా
నరసేంద్రాకృతి నుద్భవించెఁ గమలానాథుండు విశ్వంభరన్

వ్యాఖ్య :- శౌర్యసుషమాంకురమును చూచి, చక్రప్రభ అని ఆరోపించబడినది. ఇందు మొదట చక్రప్రభ ఆరోపించబడి, పిదప శౌర్య

సుషమాంకురము అపహ్నవముచేఁ బడినది. కావున ఇది ప్రాగారోపము.

"ఇందు భాస్వర కీర్తిద్యుతి పంక్తిగాదు నిబిడాంచత్పాంచజన్య ప్రభ" అనుచో ముందుగా "కీర్తిద్యుతి గాదు, అని ముందుగా అపహ్నవము చెప్పి, పిదప "పాంచజన్యము" అని ఆరోపమును చెప్పెను. కావున ఇది అపహ్నవారోపము.

"నరసేంద్రాకృతి" అనుచోట "ఆకృతి" పదముచే నరసేంద్రుడు కాడని ప్రతిపాదించుటచే ఛలాది అయినది.

## ఉల్లేఖము :—

క. అలరఁగ గ్రహీతృభేదం
బుల నొకటియే పెక్కురూపముల నెడ నెడలం
దలపోయఁగ నుల్లేఖం
బలంకరణరాజ మయ్యె! యది యెట్లన్నన్. 60

వ్యాఖ్య : గ్రహీతృ భేదమునబట్టి ఒకే వస్తువు అనేక రూపములలో గ్రహించినచో నుల్లేఖాలంకారము అగును.

క. బాణుఁ డని బుధులు, మురజి
ద్బాణుం డని విమతభూమిపాలురు, సుమనో
బాణుఁ డని సతులు తలఁతురు
రేణాంకసమాను నోబళేంద్రు నృసింహున్. 61

వ్యాఖ్య : నరసరాజును, కవికలిగా; శివునిగాఁ (మురజిద్బాణుడు) మన్మథునిగా, చంద్రునిగా భావించినట్లు వర్ణించుట వలన నుల్లేఖాలంకారం అయినది.

## ఉత్ప్రేక్ష :—

క. ఉపమేయమునకుఁ గలిగిన
యుపమానగుణక్రియాదియోగముచే నా

యుపమానమె యని తలఁచిన
నది యవు డుత్ప్రేక్ష యయ్యె; నదియును ధరణిన్. 62

వ్యాఖ్య :- ఉపమానము యొక్క గుణ, క్రియాది సంబంధమువే ఉపమేయము ఉపమానముగా ఊహింపబడినచో అది ఉత్ప్రేక్ష అనబడును.

క. క్రమమున వాచ్యయును, ప్రతీ
యమానయును నగుచు ద్వివిధ యగు; వాచక శ
బ్దము గలుగ వాచ్య యనఁదగు
నమరఁగ లేనియెడల గమ్య యనఁదగు వరుసన్. 63

సీ. అలరెడు నీరెంటియందు జాతి గుణక్రి
యాద్రవ్యముల వాచ్య యబ్ధిసంఖ్య;
యవి నాల్గు వరుస భావాభావములఁ జెంద
నిల వసుసంఖ్య; యాయెనిమిదియును
నిరువది నాలుగా హేతు, ఫల, స్వరూ
పముల వేర్వేఱఁ ద్రిభంగిఁ జెంద;
నందు నెన్మిది, యెన్మిదగు హేతువు, ఫలంబు
నలరు వాచ్య; గుణ, క్రియానిమిత్త

వ్యాఖ్య:- ఉత్ప్రేక్ష వాచ్యము, గమ్యము అని ద్వివిధము. మానము ధ్రువము, ప్రాయము, అనన్, శకించు, కాఁబోలు, ఊహించు, భావించు, అనుమానించు మొదలగు వితర్క పదములతో ప్రయోగించినచో వాచ్యోత్ప్రేక్ష అనియు, అట్టి పదములు లేనిది గమ్యోత్ప్రేక్ష అనియు రెండు విధములు.

తే. ములఁ బదాఱు బదాఱు నౌ; నలస్వరూప
గతనిమిత్తంబులకు వాచ్య, గమ్యగతులు

గానఁ బదియాఱు నగు వాచ్యగస్వరూప!
మరయు గమ్యస్వరూప మష్టాఖ్య మయ్యె 64

వ్యాఖ్య :- ఈ వాచ్య, గమ్య భేదములు జాతి, గుణ క్రియా భేదములచే నాలుగు విధములు. ఈ నాలుగు విధములు భావము, అభావము. భేదముచే రెండేసి భేదములు. ఈ ఎనిమిది విధములు హేతు, ఫల, వస్తు భేదములచే ఇరువది నాలుగు భేదములగును. పై ఎనిమిది విధములు తిరిగి గుణ నిమిత్త, క్రియానిమిత్త భేదములచే పదాఱు విధములగును.

స్వరూపోత్ప్రేక్షలు ఎనిమిదియు వాచ్య, గమ్య, భేదములచే రెండు విధములు అగును. నిమిత్తము వాచ్యమయినప్పుడు గుణ, క్రియానిమిత్త, భేదములచే పదాఱు విధములగును. నిమిత్తము గమ్యమయినప్పుడు ఎనిమిది విధములే ఉండును. ఇటుల వాచ్యోత్ప్రేక్ష ఏబదియాఱు విధములగును.

క. అల హేతు, ఫలనిమిత్తం
బులకుఁ గమ్యత్వమైన భువి హేతుఫలం
బులు లేకరుచిర మగు నని
యలవడ గమ్యత్వ మిందు నగదిత మయ్యెన్. 65

వ్యాఖ్య :- హేతూత్ప్రేక్షయందు ఫలము నిమిత్తము. ఫలోత్ప్రేక్ష యందు హేతువు నిమిత్తము. ఆ రెండింటియందును ఫల, హేతువులు ఉపాత్తము కాని యెడల "అరుచిరముగా" నుండును. కావున ఫల, హేతురూపనిమిత్తోపాదానము ఆవశ్యకము.

క. కావున నేఁబదియాఱగు
నా వాచ్యోత్ప్రేక్ష; గమ్య యటువలెనే భే
దావహ మగుచు నిమిత్త
ద్వైవిధ్యము నందు గమ్యతాస్థితి లేమిన్. 66

క. హేతు, స్వరూప ఫలములు
నాతతగతి నెన్మి దెన్మి దయి యవియు నిమి

త్యాతివ్యాప్తిం బడాలుగ
నేతతి గమ్యయును నల్వదెనిమిది యయ్యెన్. 67

వ్యాఖ్య :- వాచ్యోత్ప్రేక్ష పెంబదియాఱు విధములు. గమ్యోత్ప్రేక్ష నలుబదెనిమిది భేదములు మాత్రము గలవు. జాతి, గుణ, క్రియా, ద్రవ్య భేదములచే వాచ్యోత్ప్రేక్ష నాలుగు విధములు, అవి తిరిగి భావా, భావములచే ఎనిమిది విధములు. తిరిగి హేతు, ఫల, స్వరూప భేదములచే ఇరువది నాలుగు భేదములు. అవి గుణ, క్రియా నిమిత్త భేదములచే నలువదెనిమిది భేదములు, వాచ్య,గమ్యోత్ప్రేక్షలు, మొత్తము తొంబదియాఱు భేదములు.

వ. ఇందు నేంబదియాఱుభేదంబులంబోల్చు వాచ్యోత్ప్రేక్షకుం గొన్ని నామధేయంబు లెఱింగించెద. ఉపాత్తగుణనిమిత్త జాతిభావస్వరూపోత్ప్రేక్షయు, నుపాత్త క్రియానిమిత్తజాతి భావస్వరూపోత్ప్రేక్షయు, నుపాత్త గుణనిమిత్తజాత్యభావ స్వరూపోత్ప్రేక్షయు; నుపాత్త క్రియానిమిత్త జాత్యభావ స్వరూపోత్ప్రేక్షయు, అనుపాత్తనిమిత్త జాతిభావస్వరూపో త్ప్రేక్షయుః ననుపాత్తనిమిత్తజాత్య భావస్వరూ పోత్ప్రే క్షయు, నుపాత్త గుణనిమిత్తజాతి భావ హేతూత్ప్రేక్షయు, నుపాత్తగుణనిమిత్తజాత్యభావహేతూత్ప్రేక్షయు, నుపాత్త గుణనిమిత్త జాతి భావఫలోత్ప్రేక్షయు,నుపాత్త గుణనిమిత్త జాత్యభావఫలోత్ప్రేక్షయు, నుపాత్తక్రియానిమిత్త జాతి భావ హేతూత్ప్రేక్షయు నుపాత్త క్రియానిమిత్త జాత్యభావ హేతూత్ప్రేక్షయు, నుపాత్త క్రియానిమిత్త జాతిభావఫలో త్ప్రేక్షయు, నుపాత్త క్రియానిమిత్త జాత్యభావఫలోత్ప్రే క్షయు ననం బతుర్దశభేదంబులం బోల్చు జాత్యుత్ప్రేక్ష. ఇట్లు గుణోత్ప్రేక్షయుం, గ్రియోత్ప్రేక్షయు, ద్రవ్యో

త్ప్రేక్షయుఁ బరస్పరచతుర్దశ భేదంబులం బొంద వాచ్యో
త్ప్రేక్ష యేఁబదియాఱగు; జాతి యనఁగ సముదాయంబును
క్రియ యనఁగ కృత్యంబును, గుణం బనఁగ రూపాదియు,
ద్రవ్యం బనఁగ నొకవస్తువు నగు; నేతదధికాధ్యవసాయ
మూలంబు లగు నేఁబదియాఱు భేదంబులకును దాహరణంబు
లొనరించినఁ జాల యగు నను భయంబున దిఙ్మాత్రంబుగ
లక్ష్యంబులు నిరూపించెద; నెట్లనిన. 68

ఉపాత్త గుణ నిమిత్తజాతిభావస్వరూపోత్ప్రేక్ష:—

క. భవదీయ బాహుపీఠిం
దవిలిన భూదేవి యుచితధనలాభమహో
త్సవకృతకుంకుమరుచియై
భవ మన నీశౌర్యశోభ వరఁగు నృసింహా! 69

వ్యాఖ్య :— నరపరాజు బాహుపీఠమున నిలచిన భూదేవి, తనకు తగిన భర్త లభించుటచే చేయుచున్న ఉత్సవములోని కుంకుమ కాంతి శోభయో అనునట్లు నీ శౌర్యశోభ ప్రకాశించుచున్నది అని భావము.

ఇందు శౌర్యశోభా ఉపమేయము. కుంకుమ కాంతి ఉపమానము. "రుచి" పదము జాతివాచకము. భావరూపము, "అనన్" ఉత్ప్రేక్షావాచకము. కావున ఇందు జాతిభావ స్వరూపము, ఉపాత్త గుణనిమిత్తము ఆయినది.

ఉపాత్తక్రియానిమిత్త జాతిభావస్వరూపోత్ప్రేక్ష:—

క. నిరుపమరణదీక్షావ్రత
విరచిత మగు విజయలక్ష్మి వేణియుఁ బోలెం
బరఁగెఁ గరాళభవత్కర
కరవాలమతల్లి యోబభూప నరసింహా! 70

వ్యాఖ్య :- నరసరాజు చేతిలోని కత్తి విజయలక్ష్మి, యుద్ధమను వ్రతమును పూని, జడను ధరించెనో అనునట్లున్నది.

ఇందు ఉపమేయము ఖడ్గము, ఉపమానము వేణి. ఇది జాతి వాచకము, భావరూపము. దీక్షావ్రతము క్రియారూపము నిమిత్తము. కావున ఉపాత్త క్రియానిమిత్తజాతి భావ స్వరూపోత్ప్రేక్ష అయినది.

అనుపాత్తనిమిత్త జాతి భావస్వరూపోత్ప్రేక్ష:—

క. నీచరణకమలనఖరుచి
వీచికలు సతారివీరవిభవము మగుడం
బ్రోచు నవీనాచీనసుధా
వీచికలనఁ బొల్చు, నోబళిభునరసింహా. 71

వ్యాఖ్య :- నరసరాజు కాలిగోళ్ళకాంతి తరంగములు శత్రువీరులను రక్షించు అమృత తరంగములవలె ఉన్నవి.

నఖరుచివీచికలు, ఉపమేయము, సుధావీచికలు ఉపమానము. ఇది జాతి వాచకము, భావరూపము. ఇందు నిమిత్తము చెప్పబడలేదు కావున అనుపాత్త నిమిత్తజాతి భావ స్వరూపోత్ప్రేక్ష అయినది.

అనుపాత్తనిమిత్తజాత్యభావస్వరూపోత్ప్రేక్ష:—

క. ఇల యసముద్రమువలె నీ
బలధూళి యొనర్చె సమదకరిమదధివథూ
విలసితబాష్పోదకముల
జలనిధికోటికము ఘటించు జగతి నృసింహా! 72

వ్యాఖ్య :- నరసరాజు సైన్య ధూళి భూమి మీద సముద్రము లేనిదానిగాచేసి, తిరిగి శత్రురాజుల భార్యల బాష్పోదకములచే అనేక సముద్రములను సమకూర్చుచున్నది.

"ఇల" ఉపమేయము, అసముద్రము ఉపమానము అసముద్రము అభావరూపము, గుణక్రియారూపము, గుణక్రియారూప నిమిత్తము చెప్ప

బడలేదు. కావున అనుప్రాప్తి నిమిత్త జాత్యభావ స్వరూపోత్ప్రేక్ష అయినది.

జాతిహేతూత్ప్రేక్ష:-

క. పొందిన నృసింహానృపుసనం
క్రందనుసత్కీర్తిచేతఁ గడఁగి త్రిలోకీ
మందస్మితంబుచేఁ బలె
జెందొవచెలియంకరుచి పిశేష మడంగెన్. 73

వ్యాఖ్య :- నృసింహాని కీర్తి త్రిలోక మందస్మితమువలె చంద్రుని కళంకమును పోగొట్టెను.

ఇందు హేతూత్ప్రేక్ష కలదు. హేతువుకాని దానిని హేతువుగా భావించుట హేతూత్ప్రేక్ష. నరసరాజు కీర్తి వలన చంద్రుని కళంకము పోగొట్టబడినప్పటికి హేతువు కాని "త్రిలోకీ మందస్మితమును" హేతువుగా భావించుట వలన హేతూత్ప్రేక్ష అయినది ఇందు "స్మితము" జాతి వాచకము, కావున జాతిహేతూత్ప్రేక్ష అయినది.

జాత్యభావహేతూత్ప్రేక్ష:—

క. రేల రవిలేమి నిరులాఁ
త్రైలోక్యం బఖియుఁ బోలె ధాత సృజించెన్
లాలితనిరుపమతేజో
నాళీకవనాప్తుఁడైన నరసింహేంద్రున్. 74

వ్యాఖ్య :- రాత్రులందు సూర్యుడు లేకపోవుట వలన ముల్లోకములు అంధకారమగునని బ్రహ్మ సూర్యతేజస్సమానుడగు నరసరాజుని సృజించెను. ఇందు నరసరాజు జన్మించుటకు హేతువుగాని రాత్రులందు సూర్యుడు లేకపోవుటకు హేతువుగా భావించుట వలన హేతూత్ప్రేక్ష అయినది.

రవి జాతివాచకము. "రవి శోభ" అనుట వలన జాత్యభావము. జాత్యభావమును హేతువుగా చెప్పుటవలన జాత్యభావ హేతూత్ప్రేక్ష అయినది.

జాతిఫలోత్ప్రేక్ష:—

క. ప్రమదమునఁ దెలుఁగు జయరమ
కమలకు రంగస్థలంబు గావలసి సుమీ!
క్రమమున నరసింహేంద్రుని
సమధికభుజమధ్య మతివిశాలం బయ్యెన్. 75

వ్యాఖ్య :- జయలక్ష్మికి రంగస్థలము కావలసి కాబోలు, నరసరాజు భుజ మధ్యమున విశాలముగా ఉండెను.

ఇందు భుజ మధ్యమున విశాలముగా ఉండుట ఫలము. ఈ ఫలము కాని దానిని ఫలముగా ఉత్ప్రేక్షించబడినది. రంగస్థలము జాతివాచకము. ఈ రంగస్థలమే ఫలముగా ఉత్ప్రేక్షించుట వలన జాతిభావ ఫలోత్ప్రేక్ష అయినది.

జాత్యభావఫలోత్ప్రేక్ష:—

క. తగవరులు జగతి మగువలఁ
దెగటార్పరు గాన నీదు దృప్తారాతుల్
మగఁటిమి డిగవలసి సుమీ
గత భీరువు లగుట యోబధరణీపునందనా! 76

వ్యాఖ్య :- ఉత్తమవీరులు స్త్రీలను సంహరింపరు. కావున నీ శత్రువులు తమ మొగతనము విడువుకొనుటకై భీరువులగుచున్నారు. ఇందు భీరువులగుటకు ఫలము మొగతనము విడువుకొనుట హేతువుగా ఉత్ప్రేక్షించబడినది. ఇందు "మగఁటిమి డిగవలసి" జాత్యభావము. ఇదియే ఇచట ఫలము, కావున జాత్యభావ ఫలోత్ప్రేక్ష అయినది.

క్రియాస్వరూపోత్ప్రేక్ష:—

చ. అనఘ! నృసింహ! నీఘనజయానకజాతభయానకాధిక, ధ్వ
నులు గుహాగృహాగ్రముల వ్రాలఁ బ్రతిధ్వనిమేదురంబులై
తవరె దిగంతశైలములు తమ్మెదురొంకను వైరికోటికిన్
నిను శరణంబు వేఁడుమని నేర్పిన బుద్ధులు నేర్పకైవడిన్.

వ్యాఖ్య :- ఓ నృసింహ! నీ దుందుభుల ధ్వనులు గృహాలయందు ప్రతి ధ్వనించి, అచట దాక్కొనుటకు వచ్చుచున్న శత్రువులను నిన్నే శరణు వేడమని బోధించుచున్నట్లుగా ఉన్నది. "ఇందు దిగంత శైలము" ఉపమేయము. "బుద్ధులు నేర్పు కైవడిన్" క్రియా స్వరూప ఉత్ప్రేక్ష. నిమిత్తము ధ్వని కావున క్రియాస్వరూప ఉత్ప్రేక్ష అయినది.

క్రియాభావస్వరూపోత్ప్రేక్ష:—

చ. భవదరిభూమిపాలకులపాలిక చెంచెత కాత్మదుర్దశల్
వివరముగా వచింప వనవీధి దయామతిఁ బల్కనీనిచు
ట్లవిరళమందమారుతచలాచలచారుపలాశహస్తముల్
తవిలి విదుర్చు; శౌర్యగుణధామ! నృసింహనృపాలశేఖరా!

వ్యాఖ్య :- నీ శత్రు కాంతలు అరణ్యములో చెంచెతలకు తన దుర్దశను వివిపించుచుండగా "పలుకనీయనట్లుగా" (ఓదార్చుటకె) అను నట్లుగా చిగురాకులు విదిలించుచుండెను.

వనవీధి ఉపమేయము "పల్కనీయనట్లు" క్రియా అభావరూప ఉత్ప్రేక్ష, కావున క్రియాభావస్వరూపోత్ప్రేక్ష అయినది.

క్రియాహేతూత్ప్రేక్ష:—

చ. మొగముముడించెఁగచ్ఛపము; మోమరవాంచె భుజంగపుంగ
డగము చలింపఁగా వెలిచె;నాదివరాహము మోరత్రోపునం

దెగువఁ బయోధిఁ జొచ్చె;సుపతీమకరాంక! నృసింహభూప! నీ
జగదభివంద్యభూభరణశక్తికృతాభిభవంబుచేతనే. 79

వ్యాఖ్య :- నీ భూభరణ శక్తి వలన కలిగిన పరాభవముచే ఆది కూర్మము మొగము ముడుచు కొనెను. శేషుడు మొగము వంచెను. పర్వతములు కదల లేకపోయెను. వరాహము సముద్రములో మునిగెను.

ఇందు కూర్మాదులు ముఖమును వంచుకొనుటకు హేతువుకాని పరాభవ క్రియ హేతువుగా చూపబడినది.

క్రియాభావహేతూత్ప్రేక్ష:—

చ. నరస నృసింహ! నీయశము, జంద్రుని, ద్రాసునధాత తూఁచినన్
సరభసవృత్తి నెత్తుడిగి సామ్యనియాఢి వహింపలేమినో
యరయ గురుత్వహేతువని నాంకపరంతుకలోహటంకసం
కరమును జేరెఁ జంద్రుఁడు, జనంబు మృగంబని చూచు చుండఁగన్. 80

వ్యాఖ్య :- నీ కీర్తిని చంద్రుని తులలో తూచగా, చంద్రుడు తన బరువు పెంచుకొనుటకై లోహపు గుండెను ధరించెను. అదియే మృగమని అందరు భావించుచున్నారు.

ఇందు "సామ్య నియాఢి వహింప లేమిచో" అనునది క్రియాభావము. దీనిని హేతువుగా ఉత్ప్రేక్షించుటవలన క్రియాభావ హేతూత్ప్రేక్ష అయినది.

క్రియాఫలోత్ప్రేక్ష :—

చ. నరనుతశౌర్యవైభవనరాధ! నృసింహధరాధినాథ! నీ
వరజయభేరిభాంకృతిరవంబు దివిం బరిపూర్ణమయ్యె; నా

సురగణికావరంపరకు(జోద్యముగా ననురూపనాయక
స్థిరపరిరంభసంభ్రమవిశేషము దెల్పఁగ నేఁగుకై వడిన్. 81

వ్యాఖ్య :- నీ జయభేరి ధ్వని, దేవతా స్త్రీలకు అనురూపనాయక విశేషములు తెల్పుటకై వెళ్ళుచున్నదో అనునట్లు ఉన్నది.

ఇందు "అనురూపనాయక స్థిర పరిరంభ సంభ్రమ విశేషముఁగ దెల్పఁగ నేగుకై వడిన్" అను క్రియాఫలమునే ఉత్ప్రేక్షగా ఊహించుట వలన క్రియాఫలోత్ప్రేక్ష అయినది.

క్రియాభావఫలోత్ప్రేక్ష :—

ఉ. కందర్పుఁగొండపై, నివము గ్రమ్మెడిమా త్రికనిర్గ రీతటీ
చందనవాటిలోఁ, గనకసైకతసాంద్రగుహాగృహావళిం
జెంది ఫణీంద్ర కన్యలు నృసింహనృపాలు యశోమరందని
ష్యందముఁ గ్రోలుచుండురువిషాగ్ని సహింపఁగ లేమికింబలెన్

వ్యాఖ్య :- మలయ పర్వతమునందలి నాగకన్యలు, చందన వనములోని విషాగ్నులను భరించలేక కాబోలు నీ కీర్తి మకరందమును గ్రోలుచుందురు. ఇందు "యశోమరంద" పానమునకు హేతువు కాని "విషాగ్ని సహింపలేమి" కారణముగా వూహించబడినది. "సహింపలేమి" క్రియా, భావముకాన క్రియాభావఫలోత్ప్రేక్ష అయినది.

గుణస్వరూపోత్ప్రేక్ష :—

క. నరసింహు భాగ్యసూచక
సురుచిరదృక్కోణశోణశోభ చెలంగెన్
శరణాగతభరణాయుత
కరుడుగ సాకార యగు దయారస మనఁగన్. 83

వ్యాఖ్య :- నరసరాజు దృక్కాంతి రూపము వహించిన దయారసమో అనునట్లు ప్రకాశించుచున్నది. ఇందు దృక్కోణ శోభ ఉపమేయము, సాకారమగు దయారసమను గుణము ఉపమానముగా ఉత్ప్రేక్షించబడినది. కావున గుణ స్వరూపోత్ప్రేక్ష అయినది.

గుణభావస్వరూపోత్ప్రేక్ష:—

క. బల, శశి, హర, భామలకును
బోలుపుగ మితిలేనిమూడ్కి మొలబంధమై లో
మ్ముల బంధమై, మెడబంధమై
తలమునుకలు నయ్యె నరసధరణిపుకీర్తుల్. 84

వ్యాఖ్య :- నరసరాజు కీర్తి బలరామ, శశి, హర, సరస్వతుల కళంకములను కప్పుచున్నది. యిందు కీర్తులు ఉపమేయము. అవి "మితి లేనివి" అని గుణాభావరూపముగా ఉత్ప్రేక్షించుట వలన గుణాభావస్వరూపోత్ప్రేక్ష అయినది.

గుణహేతూత్ప్రేక్ష :—

మ. అగయాక్ శ్రీనరసింహుకీర్తిచయము ముద్యన్మృఖ్యవర్ణోదయా
కరసామ్యంబున ధాతపైఁ గినిసియే కాంబోలుఁదత్సైంధవో
త్కరసౌభాగ్యముఁ దన్మహానవరుచిం గారించి భాషావర
స్థిరరూపం బయి తా సృజించె నరులన్ శ్రీకంఠసంకాశులన్

వ్యాఖ్య :- నరసరాజు కీర్తి తనతో సామ్యము పొందిన బ్రహ్మయందు కోపగించి కాబోలు శివుని వంటి తెల్లని మనుష్యులను రూపొందించెను. ఇందు "కినియుట" అను గుణము హేతువుగా ఉత్ప్రేక్షించుట వలన గుణహేతూత్ప్రేక్ష అయినది.

గుణభావహేతూత్ప్రేక్ష :—

క. హరిగరిమఁ దెగడి, సత్పథ
పరిచయలంఘన మొనర్చి భ్రమియించుఁ జుమీ
నరసింహభూమిపాలుని
యరుదగు సత్కీర్తి యవినయంబునఁ బోలెన్. 86

వ్యాఖ్య :- నరసరాజు కీర్తి అవినయముచేకాబోలు, విష్ణువును

తే. నగుచు భవదసివిదళితయువనన్నపతతు
లహరహము రాయిడీ యొనర్ప నమరపురము
వాసవుఁడు లేక కైవడి వఱలుచుండు
నరసు కాటోప! యోబయనరసభూప! 90

వ్యాఖ్య :- నీచే సంహరింపబడిన తురుష్కవీరులు స్వర్గమునకు పోయి చిందరవందర చేయగా స్వర్గము ఇంద్రుడు లేనిది అయినట్లుగా ఉన్నది. ఇందు "స్వర్గ అవానవపము" అనునది ద్రవ్యాభావము. "రాయిడి" నిమిత్తము ద్రవ్యాభావ స్వరూపమును ఉత్ప్రేక్షించుట వలన ద్రవ్యాభావ స్వరూపోత్ప్రేక్ష అయినది

ద్రవ్యహేతూత్ప్రేక్ష:—

క. నరసింహ యోబభూవరు
నరసింహ! భవద్భుజాగ్రపటదసిచే భూ
వరిచిత రాహువుచే బలె
నరితేజోభానుబింబ మున్మహ్యాత మయ్యెన్. 91

వ్యాఖ్య :- ఓ నరసింహా! నీ చేతి యందలి కత్తి భూమికి దిగిన రాహువువలె శత్రురాజుల తేజోరూపమగు సూర్యుని మ్రింగివేయుచున్నది. ఇందు రాహువును హేతువుగా ఉత్ప్రేక్షించబడినది. తేజోపహరణము నిమిత్తము, రాహువు ద్రవ్య వాచకము. ద్రవ్యమును హేతువుగా ఉత్ప్రేక్షించుటవలన ద్రవ్యహేతూత్ప్రేక్ష అయినది.

ద్రవ్యాభావహేతూత్ప్రేక్ష:—

చ. స్థిరబల! యోబభూవరునృసింహ! భవన్నవకీర్తిభూనభోంం
తరముల నిండఁ దద్రుచిపితానములోన విలీనమా సుధా
కరవిధి లేమిచే బలెఁ బ్రకాంతనిరంతరతాపకాకతూం
తరసుఖవాస మందె సురదానవభంజనుఁ డెల్లకాలమున్. 92

వ్యాఖ్య :- నరసరాజు కీర్తి భూనభోంతరములు వ్యాప్తి చెందుట వలన సుధాసముద్రము కప్పివేయబడుటవలన, విష్ణువు, నీ హృదయమున నివసించుచుండెను. ఇందు "సుధాశయనిధికేమి" ద్రవ్యాభావము, దీనిని హేతువుగా ఉత్ప్రేక్షించుట వలన ద్రవ్యాభావహేతూత్ప్రేక్ష అయినది.

ద్రవ్యఫలోత్ప్రేక్ష:—

ఉ. రాజపురందరుండ వయి రంజులు నీ కుచితంబు గాఁగ నీ
రాజితకీర్తి యభ్రగజరాజయి యున్కిఁ గాదె తారకా
రాజశరాంబుశీకరపరంపరలుం దెలిమబ్బుజల్లులుం
దేజముతో ధరించె సుదతీమకరాంక! నృసింహభూవరా! 93

వ్యాఖ్య :- నరసరాజు రాజేంద్రుడగుటవలన అతని కీర్తి ఐరావతము కాదలచి, చుక్కలను, తెలిమబ్బులను, నీటిజల్లును ధరించుచున్నది. ఇందు అభ్రగజరాజము ద్రవ్యము నీటి తుంపరులు, మబ్బులు ఫలములు. ఇందు ద్రవ్యమునకు ఫలము కాని దానిని ఫలముగా ఉత్ప్రేక్షించుటవలన ద్రవ్యఫలోత్ప్రేక్ష అయినది.

ద్రవ్యాభావఫలోత్ప్రేక్ష:—

చ. తనరు ననంఖ్యవాజిగజదారుణమై తగు నాదు మ్రోల నేఁ
డనిమిది సైంధవేభముల నిడుగఁ దాల్చుట యెట్లటంచు నా
కినుక నభంబు లేకునికికిన్ బలె శ్రీనరసింహు జైత్రవా
హిని యనిలోన నింగి కెగయుచు [illegible]రేణుపుంజముల్.

వ్యాఖ్య :- నరసరాజు సైన్యముచే ఎగగొట్టబడుచున్న ధూళి, సూర్యాశ్వములు, అష్టదిగ్గజములు కలిగిన ఆకాశము నాకు సమానము కాదని, ఆకాశము లేకుండగా చేయుటకు కాబోలు ధూళి నింగికెగయుచున్నది. ఇందు "నభంబు లేకుండుట" ద్రవ్యాభావము దుమ్మునెగజిమ్ముట ఫలము ఇందు ద్రవ్యాభావమును ఫలముగా ఉత్ప్రేక్షించుట వలన ద్రవ్యాభావఫలోత్ప్రేక్ష అయినది.

క. ధర వాచ్యోత్ప్రేక్ష కుదా
హరణము లివి కొన్ని; కడము యన్యకృతులయం
దరయఁగఁ దగు; గమ్యోత్ప్రే
క్ష రచింపఁగ లేదు సెప్ప చాలమి నిందున్. 95

వ్యాఖ్య :- వాచ్యోత్ప్రేక్షకు మిగిలిన ఉదాహరణములు కావ్యము లందు చూడవలెను. గమ్యోత్ప్రేక్షకు ఉదాహరణము తెలుపలేదు.

అతిశయోక్తి:-

క. ఉపమేయము నింత దడవక
యుపమానము నుడువ నతిశయోక్తి; కవిమహా
నిపుణోక్తిమూలమై
నపరిమితప్రౌఢి నదియు నైదువిధములై. 96

వ్యాఖ్య :- ఉపమేయమును చెప్పక ఉపమానము మాత్రమే చెప్ప నచో అతిశయోక్తి అగును ఇది ఐదు విధములు.

తే. వరఁగ సంబంధమున్న దన బంధ మనఁగ
మఱి యసంబంధమందు సంబంధ మనఁగ
భేదమందు నభేద, మభేదభేద
భావమును, కార్య హేతు విపర్యయ మన. 97

వ్యాఖ్య :- సంబంధమున్నను లేనట్లు చెప్పుట, సంబంధము లేకున్నను ఉన్నట్లు చెప్పుట, భేదమున్నను లేనట్లు చెప్పుట భేదములేకున్నను ఉన్నట్లు చెప్పుట, కార్య కారణ భావములను విపర్యయముగా చెప్పుట అను నవి అతిశయోక్తి యందలి భేదములు.

సంబంధాసంబంధాతిశయోక్తి:—

మ. అలఘుప్రౌఢిమ నీవుదానవిధవం బాలించి యాలించి ని
చ్చలు దానస్ఫురణంబుబడంగె సురభూజశ్రేణికిం; గల్గినా

బలిభిద్వారణగండకాషకలన ప్రత్యగ్రలగ్నాధికో
జ్జ్వలదానం బొకవేళ గల్గు, నరసక్ష్మాపాలచూడామణీ!.98

వ్యాఖ్య :- ఓ నరసక్ష్మా పాలచూడామణీ! నీదాన వైభవమును విని, విని కల్పవృక్షములు దానగుణమును విడిచిపెట్టినవి. ఒకవేళ కొద్దిగా ఉన్నను, ఐరావతము తన గండ స్థలమును రాచుకొనుటచే అందుకొన్న (దానము)మదము కలుగుచున్నది. ఇందు కల్పవృక్షములకు దానగుణము ఉన్నను లేనట్లు వర్ణించుట వలన సంబంధాసంబంధాతిశయోక్తి అయినది.

అసంబంధసంబంధాతిశయోక్తి:-

ఉ. చందనశైలసానువులఁ జాలఁ జెలంగు భుజంగబాలికా
బృందము శ్రీ నృసింహవిభుఁ బేరొకొని పాడఁ దదీయగాన ని
ష్యందము లాను వేడ్కఁ బెరయంగఁ గురంగతురంగ మేఁగమిన్
మందగతి ప్రసంగములు మానవు దక్షిణగంధవాహముల్ 99

వ్యాఖ్య :- మలయ పర్వతముపై నాగకన్యలు నరసభూపాలుని గూర్చి గానము చేయుచుండగా, ఆ గానము వినుటకై దక్షిణమారుత వాహనమైన కురంగము మెల్లగా నడచుచున్నది. ఇందు కురంగమునకు గానము వినవలెననెడి కోరిక లేకున్నను ఉన్నట్లుగా వర్ణించుటవలన అసంబంధ సంబంధాతిశయోక్తి అయినది.

భేదాభేదాతిశయోక్తి:—

క. అగు నొకటి కర్ణభూషణ
మగు నొక్కటి కర్ణవైరి, హరిచందనపుం
జిగురును, నీచేఁ జిగురుం
బొగ డొందుట కిదియె భేదము నృసింహనృపా! 100

వ్యాఖ్య :- హరిచందన పల్లవములు కర్ణభూషణములు (చెవికి అలంకారములు) హస్త పల్లవములు కర్ణవైరి (కర్ణునకు శత్రువు) ఇందు

"కర్ణ" శబ్దమునకు భేదమున్నను శ్లేషమూలమున భేదము లేనట్లుగా వర్ణించుట వలన భేదా భేదాతిశయోక్తి అయినది.

అభేదభేదాతిశయోక్తి:—

సీ. అమృతమూర్తికి గళంకావాప్తి యెట్లని
మిహికాంశునిఁ గళంకరహితుఁ జేయ
లోకబాంధవున కుగ్రాకార మెట్లని
భానుఁ బార్వణశీతభానుఁ జేయ
మృత్యుంజయుని కేల మెడచుట్టు విస మని
గరళకంఠుని సితకరుఁ జేయఁ
దలపోయ నరుడైన దాత కేమాలిన్య
మనుచితం బని ఘను సములఁ జేయ

తే. మహితభవదీయసత్కీర్తిమధురవిధుర
వక్ర మగు బ్రహ్మసృష్టి నతిక్రమించి
కమలజాండకరండంబు గడచి వెడలె
వైరిగజసింహ! యోబయనారసింహ! 101

వ్యాఖ్య :- అభేదమున్నను భేదము చెప్పిన యెడల, అభేదభేదాతిశయోక్తి అగును. నరసింహుని కీర్తి బ్రహ్మసృష్టి కన్న భిన్నము కాకున్నను భిన్నమయినట్లు వర్ణింపబడినది.

కార్యకారణవిపర్యయరూపాతిశయోక్తి:—

సీ. వెస నీప్రతాపాగ్ని దెసలఁ బర్వక మున్నె
పొగయు శాత్రవరాజపురవరంబు
లల పురంబులధూమ మగ్గలింపక మున్నె
ప్రబలు వైరికళత్రబాష్పవితతు

లల జలంబులు ధాత్రి నవఘళింపక మున్నె
క్రేళ్ళుబ్బు, వారి యకీర్తిపంక
మాపంకసంకరం బంకురింపక మున్నె
పాడము నసత్కీర్తిపుండరీక

తే. మవుర! కవిబుధశుకపికనివహానిరిత
ఫలితసురుచిరసురతరుపటిమఘటన
కలితకరతలకుసుమితకరజనికర
గరిమ మను పోచిరాజోబఘునన్నృసింహా. 102

వ్యాఖ్య :- కారణముకన్న కార్యము ముందు జరిగినట్లు వర్ణించినచో కార్యకారణ విపర్యయ రూపాతిశయోక్తి. ఇందు అగ్ని కారణము, ధూమము కార్యము. అగ్ని వ్యాపింపకుండగనే ధూమము వ్యాపించినట్లు వర్ణించబడినది. ఈ రీతి మిగిలినవి ఊహ్యములు.

సహోక్తి:—

క. నిపుణత ముఖ్యాన్వితమా
నుపమేయంబును సహార్థయోగాన్వితమా
నుపమానంబును బెరసినఁ
బ్రపంచితం బగు సహోక్తి రహిఁ; నెట్లన్నన్. 103

వ్యాఖ్య :- ఉపమేయమునకు ముఖ్యాన్వయమును, ఉపమానమునకు సహార్థసంబంధముతోను అన్వయము కలిగిన యెడల సహోక్తి అగును.

సీ. నానారిభూనాథ సేనాతతులతోన
కటకముల్ దూఱు నీపటహరవము
భీతారిజాతాసువాతావళులతోన
దివి కేఁగు నీచమూభవరజంబు

ధీరాతివీరారిఘోరాంగములతోడ
వడఁకు నీకరతలోజ్జ్వలకృపాణ
మస్త్రాదిశస్త్రవిస్తారములతోడ
వఱలెఁ బెంపుఁ దావకోన్నతశరాసన

తే. మహితనృపరాజ్యలక్ష్మి యుగ్గాక్షితోడ
వేడ్కనిను జెందు సంగ్రామవిజయలక్ష్మి
యనఘతరపోచిరాజవంశాబ్ధిచంద్ర!
వరనుతాటోప! యోబయవరనభూప! 104

వ్యాఖ్య :- ఇందు "పటహరవము" కారణము. సేనాపతులతో కటకము దూసట కార్యము. పటహరవాదులు క్రియలతో ముఖ్యాన్వయము, సేనాపతులు శబ్దము సహార్థ నంబంధముతో అర్థాన్వయము పొందుచున్నది. ఇట్లే మిగిలిన ఊహ్యములు.

వినోక్తి :—

క. సంబంధిఁ బాసి యొకటికొక
సంబంధికిఁ జారుతయు, నచారుతయుం బ్రా
ప్తంబుగఁ బ్రజ్ఞాధికులను
తంబున నది యగు వినోక్తి ధర; నె ట్లన్నన్. 105

వ్యాఖ్య :- సంబంధమున్న దానిని విడిచిపెట్టుటవలన నేకొక దానికి సుందరముగాని, అసుందరముగాని యుండునట్లు వర్ణించినచో వినోక్తి అగును.

చారుతావినోక్తి :—

ఉ. క్రూరత లేని చూపు; నెలకొన్న వికారము లేని రూపు; పహం
కారము లేని యేపు; కలకాలము వేసటలేని ప్రాపు; నం

ప్రేరితయంత్రమీనతను భేకముసక్ సరిలేని తూపు; ని
ద్ధారుణి నీకెపొల్చు గుణధామ! నృసింహనృపాలశేఖరా

వ్యాఖ్య :- ఇందు క్రూరత్వాదులు లేని నృసింహుని రూపమును వర్ణించుట వలన, అతని సుందరత్వము వ్యక్తమగుచున్నది. కావున వినోక్త్యలంకారమగుచున్నది.

అచారుతావినోక్తి :—

క. కవి లేని రాజుకీర్తియు
రవిలేని నభంబు, రూపరసభావములం
జవిలేని భామపొందును
రవలేని విభూషణంబు రహి నరసింహా! 107

వ్యాఖ్య :- ఇందు కవిలేని రాజు కీర్తి మొదలగు అసుందరములను వర్ణించుట వలన వినోక్తి అగుచున్నది.

సమాసోక్తి :—

క. ప్రకృతము విశేషణంబులు
సకలంబును సామ్యధర్మ సహితములై యు
ప్రకృతముఁ దలఁపింపఁగ నది
యు కృతి సమాసోక్తి యయ్యె; నది యెట్లన్నన్. 108

వ్యాఖ్య :- ప్రకృతము వర్ణితమగు వస్తువు యొక్క విశేషణముల సామ్యము వలన అప్రకృతార్థము తలపునకు వచ్చినచో అది సమాసోక్తి అగును.

క. కలకంఠరుతులఁ బిలుచును
ఫలములు చవి చూపుఁ జూపుఁ బదములఁ బెనఁగున్
బలమతి పఱచు భవద్రిపు
లలనాతతిఁ గాంచ వింధ్యలతలు నృసింహా! 109

వ్యాఖ్య :- ఓ నరసింహా! నీ శత్రుకాంతలు అరణ్యముల పరిగిడు నప్పుడూ, అచటి లతలు "కలకంఠరుతులతో ఫలములతో తను అతిథ్యము స్వీకరింపుడని పిలుచుచున్నవి. ఇందు లతలయందు చేతనత్వము ఆరోపింపబడి పుణ్యస్త్రీల ఆతిథ్యము స్ఫురించుచున్నది, కావున సమాసోక్తి అగుచున్నది.

వక్రోక్తి :—

క. వేరొక వివక్షఁ బలికిన
చారూక్తికి శ్లేష కాకుసంబంధముచే
వేరొకయోజన దెచ్చిన
నారయ వక్రోక్తి యయ్యె నది; యెట్లన్నన్. 110

వ్యాఖ్య : ఒక అభిప్రాయముతో పలికిన వాక్యము శ్లేషచే కానీ కాకు స్వరముచేగాని వేఱొక అభిప్రాయము కలిగినచో వక్రోక్తి అగును.

ఉ. ఇంతి! భవన్మనోఽబ్జగతుఁ డెవ్వఁ ? డినుం; డినుఁడైనఁ
బద్మినీ, కాంతుఁడో? రాజశేఖరుఁడు గా నితఁ డాతఁడు
గాఁడు; రుద్రుఁడో?, కాంత! లలాటలోచనుఁడు కాఁడు;
నృసింహుఁడు; మాధవుండో? ని, న్నింతట మెచ్చితిం
జెలి! విశేషుఁడు మాధవుఁడా శుభాకృతిన్. 111

వ్యాఖ్య :- ఇందు చెలికత్తె ప్రశ్నకు నాయిక సమాధానము చెప్పు చున్నది. నీ ప్రియుడు ఎవడు? అన్న చెలికత్తె ప్రశ్నించగా నాయిక "ఇనుడడు" అని పలుకగా చెలికత్తె సూర్యుడు అనుఅర్థమును గ్రహించి "పద్మినీ కాంతుడు" అని పలుకగా శివుడు అని చెలికత్తె "రాజేంద్రుడు" అని నాయిక అర్థమున ప్రయోగించిరి. అదే విధముగా "నృసింహుడు పదమునకు నరసరాజు, విష్ణువు అను అర్థమున ప్రయోగించబడినది. ఆ విధముగా శ్లేషచే వక్రోక్తి సాధించుట వలన శ్లేషచే వక్రోక్తి అయినది.

## స్వభావోక్తి:—

క. సహృదయహృదయంగమమై
మహిం నున్నది యున్న యట్లు మాటలచేటల్
బహుళంబుగాఁ జెప్పిన
మహితోక్తియె జాతి యయ్యె మది; నెట్లన్నన్. 112

వ్యాఖ్య :- సహృదయులకు హృదయానందము కలిగించుచు నున్నది ఉన్నట్లుగా వర్ణించినచో స్వభావోక్తి అగును.

సీ. తలచూపి మోసులై త్రాసులై తళుకెక్కి
నిక్కి నక్కులవలె నెరసి బెరసి
గెఱకట్టి కళుకులై గెరలి, సోకంతలై
వింతలై చెంతల విరివిఁ జెంది
జిగిదొట్టి మిట్టలై బిగువులై బుగడలై
మొగడలై నిగనిగన్నిగల నగడి
కొన లుబ్బి గబ్బులై గుబ్బలై యకరంజి
కుండలై కొండలై దండ నించి
తే. దొరసి యొండొంటి నొఱసి క్రిక్కిఱిసి మెఱసి
యగణితస్ఫూర్తి మొగమున కెగయు నీదు
వలుదవలిచన్నుగుబ్బ లోవలపులాఁడి!
నేఁడు నరసింహుకౌఁగిట నెఱపఁ గలిగె. 113

వ్యాఖ్య :- ఇందు నాయిక స్తనముల క్రమాభివృద్ధి స్వభావసిద్ధముగా వర్ణించబడినది.

## వ్యాజోక్తి:—

క. తేజరిలు వేడ్కతో న
వ్యాజనముద్భూతమైన వస్తువు నెలమిన్

వ్యాజంబు చేసి డాఁచిన
వ్యాజోక్తి యనంగఁబొల్చు నది; యెట్లన్నన్. 114

వ్యాఖ్య :- ప్రకటితమైన వస్తువును, వేరొక కారణముచే కప్పివేసి నచో వ్యాజోక్తి అగుచున్నది.

క. బాలామణి నరసింహన్సృ
పాలాగ్రణిఁ జూచి ప్రమదబాష్పావృతయై
లీలాసౌధసముత్థిత
కాలాగురుధూప మెంత ఘన మని పలుకున్. 115

వ్యాఖ్య :- నాయిక నరసభూపాలుని చూచుటవలన ఆనంద బాష్పములు రాలుచుండగా, ఆ ఆనందము ప్రకటితము కాకుండగా "సౌధమంతయు అగరుధూపము కమ్మివేసినదని" పలుకుచున్నది. తన భాష్పములకు కారణము అగరుధూపమని వ్యాజముచే కప్పుపుచ్చుచున్నది కావున వ్యాజోక్తి అయినది.

మీలనము: —

క. అపసంప్రబలంబగు వ
స్తువుచె వస్త్వంతరంబు సొరిది నడఁగినం
గపులముంతంబున మీలన
మవు నది యన్వర్థ మగుచు; నది యెట్లన్నన్. 116

వ్యాఖ్య :- ప్రబలమగు వస్తువుచే అల్ప వస్తువు కప్పివేయబడి నచో అది మీలనము అగును.

శా. నీధాటీవిచలద్బలోద్భటభటానీకోదయద్భీతిచే
బాధాహేతువనోగ్రజంతుభయముం బాటింపకాత్మన్ రిపు
క్ష్మాధీశాంగన లద్రికందరల నెల్గించుం భుజంగస్ఫటా
సాధూద్యన్మణిపంక్తిఁ గప్పుదురు దోశ్శక్తిన్నృసింహాధిపా

వ్యాఖ్య :- నీ సైన్యము వలన కలిగిన భయము వలన శత్రుకాంతలు క్రూరజంతువుల భయమును మఱచి పర్వత గుహాలలో ప్రవేశించి సర్పముల మీది మణికాంతులను కప్పివేయుచున్నారు. ఇందు సైన్యభయముచే క్రూరమృగాదుల యందలి భయము కప్పివేయ బడినది కావున మీలనము అయినది.

సామాన్యము:—

క. అవిరళగుణసామ్యంబున
నవనిన్ వ స్త్వంతరంబునం దేకంబై
ప్రవిమలవస్తువు మెఱసిన
నవు నది సామాన్య మనఁగ; నది యెట్లన్నన్. 118

వ్యాఖ్య :- వస్తువుల గుణ సామ్యమునుబట్టి ఏకాకారముగా గోచరించినచో సామాన్యాలంకారమగును

క. నీకీర్తికాంతిలోపల
శ్రీకంఠుం డేక మైన, శివుఁ గానక యా
నాకనది జలధి కేఁగుం
బాకారిసమాన! యోబపార్థివునరసా! 119

వ్యాఖ్య :- ఓ నరసరాజా! నీ కీర్తి లోపల పరమేశ్వరుడు అంతర్థానమగుటవలన, గంగానది, పరమేశ్వరుడు కానక సముద్రములో పడుచున్నది. ఇందు పరమేశ్వరుడు, కీర్తికాంతయు శ్వేత గుణసామ్యమున ఏక వస్తువుగా భాసించినట్లు వర్ణించుట వలన సామాన్యాలంకారము అయినది.

తద్గుణాతద్గుణములు:—

క. తనగుణము విడిచి యన్యము
నసఘుగుణముఁ గొనుట తద్గుణాఖ్య; మొసఁగుణం

బనయము హేతువు గలిగియు
నెనయమియ యతద్గుణాఖ్య; మిపి యె ట్లన్నన్, 120

వ్యాఖ్య :- తన గుణమును విడిచి ఇతర వస్తువుయొక్క గుణమును స్వీకరించినచో తద్గుణాలంకారమగును.

తగిన కారణమున్నను ఇతర వస్తువుయొక్క గుణము స్వీకరించనట్లుగా వర్ణించుట అతద్గుణాలంకారమగును.

తద్గుణము :—

ఉ. కావల కేఁగి నీవిమతకాంతరలోచన ప్రాణనాథుఁడుం
దాను భుజింపఁగా ఫలవితానము గోసెద సంచుఁ బోయి నా
నానిరవద్యకోకనదసద్మ నఖాంగుళి పాటలాంశురే
ఖానిబిడంబులైన కసుగాయలె కోయు నృసింహ భూవరా! 121

వ్యాఖ్య :- ఓ మహారాజా! నీ శత్రుకాంతలు అరణ్యములో ఫలములు కోసుకొనుటకు వెళ్ళిన సమయమున తను చేతి కాంతిచే పండబారినట్లు గోచరించిన పచ్చికాయలను కోసుకొనుచున్నారు.

ఇందు కాయలు తమ పచ్చదనమును విడిచిపెట్టి చేతివేళ్ళ ఎఱ్ఱని కాంతిని గ్రహించినట్లుగా వర్ణించుటవలన తద్గుణాలంకారము అయినది.

అతద్గుణము :—

చ. బలరిపుభోగ! యోబనతపాలనృసింహ! భవద్యశంబుచేఁ
దెలుపగునిందు లాంఛనము; దెల్పగుఁ బ్రాక్తనభోగిభోగముల్;
దెలుపగు రుద్రుకంధరము; దెల్పగు భారతికొప్పు; గానిత్వ
త్బలరిపుదుర్యశోరుచివితానము తెల్పయి యుండ దెన్నఁడున్. 122

వ్యాఖ్య : నీ యశస్సుచే లోకములోని వస్తువులన్నియు తెల్లగా మారుచున్నను. నీ శత్రువుల అపకీర్తిమాత్రము తెలుపును పొందుటలేదు. ఇందు అపకీర్తి, కీర్తిగుణమును స్వీకరించుటలేదు అని వర్ణించుట వలన అతద్గుణాలంకారమగుచున్నది.

విరోధాభాసము :—

క. అమరవిరోధం బాభా
సము గాఁగ విరోధ మయ్యె; జగతి నదియునుం
గ్రమమున జాత్యాదివిభే
దముల బహుత్వంబుఁ జెందె తగు; నెట్లన్నన్. 123

వ్యాఖ్య : పైకి విరోధము కనబడుచున్నను, పరమార్థమున విరోధము లేకుండుట విరోధాభాసము. ఇది జాతి, గుణ, క్రియా ద్రవ్య భేదములచే అనేక విధములు.

తే. జాతి జాత్యాదికముతోడ, జగతిఁ గ్రియక్రి
యాదికముతోడ; గుణము గుణాదితోడ
ద్రవ్యమును ద్రవ్యమున విరోధంబుఁ జెందఁ
బడి విరోధంబు లగువీనిఁ బదిలవఱతు. 124

వ్యాఖ్య: జాతి, జాతి గుణద్రవ్యక్రియలతోడను. గుణము, గుణ క్రియా, ద్రవ్యముతోడను, క్రియ, క్రియాద్రవ్యముతోడను, ద్రవ్యము ద్రవ్యము తోడను విరోధము చెందును ఈ విధముగా ఈ అలంకారము పది భేదము లగును.

జాత్యాదివిరోధ, క్రియాదివిరోధములు :—

సీ. ధారాధరం బయ్యుఁ దనరు నీకౌక్షేయ
మనతవాహిని కజీవనద మయ్యె;
కమలాకరం బయ్యు నమరు నీశౌర్యంబు
ఘనరాజహంసభీకరతఁ దాల్చె

నీరంధ్రగతిమహావారణం బయ్యు నీ
సత్కీర్తి హరిఘటాసఖ్య మొందె
నవని బ్రభానిధి యయ్యు నీ నెమ్మేను
జైవాతృకత్వంబు సంఘటించె
తే. ధర్మకర మయ్యుఁ బ్రతిపక్షధర్మభేది
సరసుతవిహార మయ్యుఁ గర్ణప్రమోద
శీల; మురుగోత్రభృతి యయ్యు జిష్ణు వగచుఁ
జెలఁగు నీబాహుయుగము నృసింహ భూప! 125

వ్యాఖ్య :- (1) లోకమున మేఘము జలమునిచ్చు (జీవనదము) చున్నది. నీ కత్తి శత్రువులకు ప్రాణమీయుటలేదు. ఇది జాతిక్రియా విరోధము.

(2) కమలాకరము లోకమున రాజహంసలకు ఆహ్లాదకరము, కాని యిట భీకరమగుచున్నది. కమలాకరము లక్ష్మని చేయుచున్నది. రాజహంసలు, రాజశ్రేష్ఠులు, శత్రురాజులు. ఇది జాతి గుణవిరోధము.

(3) సత్కీర్తి గొప్ప గజమయ్యును (మహావారణము) సింహముల గుంపుతో(హరిఘటము)స్నేహము చేయుచుండెను. మహావారణము పెద్ద అవరణ గలది. చంద్రులకు సాటియైనదని అర్థము. ఇది జాతి ద్వయమునకు విరోధము.

(4) శరీరము ప్రభావిధి అయ్యును, జీవాతృకత్వము సంఘటించెను. ఇందు జాతి ద్రవ్యముతో విరోధము శరీరము కాంతి కలదను అర్థమున విరోధము పరిహరింపదగినది.

(5) నరసరాజు బాహుయుగములు ధర్మకరములు అయ్యెను, ప్రతిపక్షముల ధర్మమును ఛేదించును. శత్రుధర్మము నశింప చేయునవి భావము. ఇందుక్రియాద్వయ విరోధము కలదు,

(6) అర్జునిచే కొనియాడబడిన విహారము కలదైనను, కర్ణ ప్రమోదకరము. నరులచే పొగడబడిన విహారక్రియ కర్ణములకు (చెవులకు) ఆనందము కలిగించును అను అర్థముచే విరోధము పరిహరింపబడుచున్నది, యిందు గుణక్రియావిరోధం కలదు.

(7) నీ బాహు యుగములు గోత్రభృతియగుచు జిష్ణువు అయినది. నీ బాహువు వంశరక్షకరమయి జయశీలమైనదని భావము. ఇందు క్రియా ద్రవ్య విరోధము.

గుణాదివిరోధ, ద్రవ్యవిరోధములు ;—

మ. తలిరుంబోఁడి సరాగ యయ్యు ధవళత్వం బొందు, నుచ్చైః
స్తనా,చలభారాసహ యయ్యుఁదా నచల యౌఁ; బర్వంపఁగా
నార్యమై, చెలువం బందియు నన్యభావ యగు;నీచేతో
జశస్త్రీహతిఁ, నలినాక్షిమణి నేలుమింక నరనేంద్రా!
సాంద్ర తేజోనిధీ 126

వ్యాఖ్య : ఇందు గుణమునకు, గుణ ద్రవ్యములతో గల విరోధము ద్రవ్యమునకు ద్రవ్యముతోగల విరోధము ఉదాహరింపబడినది.

1) ఆమె ఎరుపురంగు కలది ఆయ్యును, ధవళత్వమును పొందుచున్నది. ఆమె అనురాగము కలిగి యుండుటచే ధవళత్వమును పొందుచున్నదని గ్రహించవలెను. యిది గుణమునకు, గుణముతోడి విరోధము.

2) ఆమె స్తనములు (పర్వతములు) భారము సహింపనిదయ్యును, అచలములు ఆ యువతి సాత్విక భావములచే అచలత్వమును పొంది స్తన భారము సహింపరాకున్నదని భావము ఇది గుణ ద్రవ్య విరోధము.

3) పార్వతి సరస్వతి యగును. యిందు ఆద్యురాలయిన ఆమె మన్మథావస్తచే (అన్యభాష) మతిమాటలు కలదని అర్థమును గ్రహించవలయును. యిది ద్రవ్య ద్రవ్య విరోధము.

విశేషము :—

క. ధారణి నాధేయము నా
ధారముగా, నొకటి నేకతరకలితముగా
నారెకు నశక్యకరణం
బారూఢముగా విశేష మగు: నెట్లన్నన్. 127

వ్యాఖ్య :- ఆధారము లేకుండగా ఆధేయమును చెప్పుట, ఒకే వస్తువును అనేక స్థలములలో ఉన్నట్లుగా వర్ణించుట, అశక్యవస్తుకరణము అని విశేషాలంకారము మూడు విధములు.

ఆధారరహితాధేయము :—

చ. దురమున శ్రీనృసింహుఁ డతిదుర్మదవీరవిరోధిపుం క్రిపై
నరభసవృత్తినెత్తలను సాంద్రబదీప్తములయ్యెఁదన్మహా
మరకత, పుష్యరాగ, నవమౌక్తిక, విద్రుమ, నీలకాంతిచే
సురపదవీథిపై జనులచూడ్కి కభిత్తికచిత్రకర్మముల్. 128

వ్యాఖ్య :- నరసరాజు కత్తిని పైకి ఎత్తగా అందలి మరకత, పుష్యరాగాదుల కాంతి ఆకసమున ఆధార రహిత చిత్రమువలె గోచరించుచున్నది. ఇందు చిత్రమునకు ఆధారము లేనట్లు వర్ణించు ఆధేయమును చెప్పుట వలన విశేషాలంకారము అయినది.

ఏకానేకగోచరము:—

క. కలఁడు కలఁ డన్నచోటం
గలుగు నృసింహుఁడవుగానఁ గానల గిరులం
గలలోన బ్రమోలఁ బిమ్మట
నలఘుస్థితి నీవ యగుదు వరికి, నృసింహా! 129

వ్యాఖ్య :- నరసభూపాలుడు శత్రువులకు, అడవులలో, పర్వతములలో, కలలోను కనిపించుచుండెను. అని అనేక స్థలములలో ఉన్నట్లుగా వర్ణించుటవలన విశేషాలంకారము అయినది.

అశక్యకరణము:—

సీ. దారుణాఖండమార్తాండమండలము ను
 ప్పొంగి గుటుక్కన మ్రింగవచ్చు
గంభీరఘుమఘుమారంభసంరంభదు
 గ్ధపయోధి చెంగున దాటవచ్చు
జండిశాజానేయగండప్రకాండముల్
 వీఁకఁ జివాలున వ్రేయవచ్చుఁ
గుటిలోగ్రశతకోటికోటిసంఘాతముల్
 కినిసి ఘుణిల్లునఁ దునుమవచ్చుఁ
తే. గాని పశ్యదలీకభీకరదృగగ్ర
 జాగ్రదుగ్రానలోజ్జ్వలజ్వాల నెనయు
గురుభుజాశౌర్య! నినుఁ జెనకుఁదరమె యరుల
కౌబళేంద్రుని నారసింహాక్షితీంద్ర! 130

వ్యాఖ్య :- సూర్యుని మ్రింగవచ్చును, సముద్రమును దాటవచ్చును, ంహమును కొట్టవచ్చును, వజ్రాయుధమును ఛేదింపవచ్చునుగాని, నిన్ను యింపలేము అని వర్ణించుటవలన అశక్యకరణీయమను విశేషాలంకారము ర్ణితము.

అధికము:—

క. ఆధారం బల్పం బై
యాధేయం బధికమైన, నది యల్పం బై
యాధారంబును నధికం
బై ధర రంజిల్ల నధిక మగు; నెట్లన్నన్. 131

వ్యాఖ్య :- ఆధారము అల్పముగాను, ఆధేయము అధికముగాను న్నయెడల ఆధేయము అల్పముగాను, ఆధారమధికముగాను ఉన్న డల అధికాలంకారమగును.

### అధికాధేయము:—

క. ఘనరోమకూపవాతా
యనముల కణుపంక్తులగు నజాండంబులచేఁ
దనరు హరికుక్షి నడఁగక
యనఘూర్జిత వెడలె నీదుయశము నృసింహా! 132

వ్యాఖ్య :- శ్రీ మహావిష్ణువు యొక్క ఉదరమున నీ కీర్తి యిమడక నాభీకమలరూపమున బయటకు వచ్చెను, ఇందు ఆధారమగు ఉదరము కన్న అధేయమగు కీర్తి అధికముగా వర్ణింపబడినది కావున అధికాధేయము.

### అధికాధారము:—

క. నీదునిరవద్యకీర్తి మ
హోదుగ్ధపయోధిలోన నాదిమరాజ
ప్రాదుర్భూతయశంబులు
ప్రోదిం బుద్బుదములట్లు పొల్చు నృసింహా! 133

వ్యాఖ్య :- నీ కీర్తియను పాల సముద్రమున పూర్వరాజుల కీర్తి అడుగేను. ఆధేయమగు పూర్వరాజుల కీర్తి కన్న ఆధారమగు అధికాధారమను అలంకారమయినది.

### విభావనా, విశేషోక్తులు:—

క. కారణము లేక కార్యము
ప్రారూఢంబైన నది విభావన; పెక్కుల్
కారణము లయ్యుఁ గార్యము
చేరక యుండుట మహిన్ విశేషోక్తి యగున్. 134

వ్యాఖ్య :- కారణము లేక కార్యము కలిగినట్లుగా వర్ణించినచో విభావనాలంకారమగును.

పెక్కు కారణములున్నను కార్యము పుట్టకున్నట్లుగా వర్ణించుట విశేషోక్తి అను అలంకారమగును.

విభావన:-

సీ. నలినారి లేని వెన్నెలలు; రాత్రులు లేని
తారలు; లతలేని కోరకములు
కొలను లేని సితాబ్జములు; స్వాతిచినుకులు
లేని ముత్తెము; తేఱు లేని నురువు
లలరు వెల్తురు లేని వెలిమబ్బులు; హిమాద్రి
లేని మంచులు; వార్ధి లేని సుధలు
గని లేని వజ్రముల్; గంధాద్రి లేని గం
ధములు; నభము లేని తారవితతు
తే. లౌర! నీకీర్తిరుచులు మహానుభావ!
భావజాకార! కారుణ్యభానమాన
మానకురురాజ! రాజన్యమకుటనిహిత
చరణరాజీవ! యోబభూవరునృసింహ! 135

వ్యాఖ్య :- ఇందు తారకలు చంద్రుడు, రాత్రులు లేకపోవుట మొదలగునవి కారణములులేని కార్యములు వర్ణించుటచే విభావనాలంకార మయినది.

విశేషోక్తి:—

క. అని నీచాపఘనాఘన
ఘనము శరోత్కరముఁ గురియఁ గపటాహితరా
డ్వనితలకు నెట్టి చోద్యమొ!
యనువొందవు కంకణంబు లౌబళనరనా! 136

వ్యాఖ్య :- నీ చాపమనెడు వర్షాకాల మేఘములు కురియగా శత్రు కాంతల జలకణములు (గాజులు) కనబడకున్నవి. ఇందు వర్షాకాల మేఘ మను కారణమున్నను జలకణములు (వర్షము, గాజులు) లేనట్లుగా వర్ణించుట వలన విశేషోక్తి అను అలంకారమగుచున్నది.

## అసంగతి:—

క. నేరుపుతోఁ గార్యంబును
గారణమును భిన్న దేశగతములుగా ని
ద్ధారుణిలోన నసంగతి
యై రంజిలు నంద్రు సుకవు లదియెట్లనన్. 137

వ్యాఖ్య:-కార్యకారణములు రెండును భిన్నదేశస్థములుగా వర్ణించుటచే అసంగతి అను అలంకారమగును.

క. అనిలోన నీభుజాగ్రం
బనువమతరవారిధార నందిన నేలా
యనయంబుఁ జాము వగఁతురు
రనతారలు శ్రీనృసింహ! యతిబలసింహా! 138

వ్యాఖ్య :- ఓ రాజా! నీవు కత్తిని పట్టగానే నీ శత్రువులు వణుకుచున్నారు. ఇందు రాజు కత్తిని పట్టగానే అను కార్యము ఒకచోట జరుగగా శత్రువులు వణుకుట అను కార్యము వేఱొకచోట జరిగినట్లు వర్ణించుట వలన అసంగతి అను అలంకారమయినది.

## విచిత్రాన్యోన్యములు:—

క. స్వవిరుద్ధఫలంబునకై
యవిరళయత్నము విచిత్ర; మన్యోన్యము భూ
వ్యవిభూషణభావంబునఁ
దవులుట యన్యోన్య మయ్యె ధర; నెట్లన్నన్. 139

వ్యాఖ్య :- విరుద్ధ ఫలమును కోరి ప్రయత్నించుట విచిత్రాలంకారమగును.

రెండు వస్తువులు భూష్యభూషణ భావము పొందినట్లుగా వర్ణించుట అన్యోన్యాలంకారమగును.

విచిత్రము:—

క. నతిఁ జెందుదు రున్నతికై
ప్రతిపక్షభూపతులు; నీమహాభవనాగ్రబహిః
స్థితిఁ జెందుదురు గృహాంత
స్స్థితికై, నరసింహ! శౌర్యజితనరసింహా! 140

వ్యాఖ్య :- ఇందు విరుద్ధ ఫలయత్నములు వర్ణించబడినవి. కావున విచిత్రాలంకారము.

అన్యోన్యము:—

క. లలన నృసింహానిఁ జెందెడి
తలఁపున మైఁబ్రోడవు లిడఁగఁ దనులత చెలఁగెన్
గలితవిభూషణములచే
లలితవిభూషణము లంగలతచేఁ జెలఁగెన్. 141

వ్యాఖ్య :- నాయిక ధరించిన ఆభరణములచే నాయికకు, ఆమె శరీరశోభవలన ఆభరణములకు శోభ చేకూరినది అని రెండు వస్తువులకు భూష్యభూషణభావము వర్ణించుట వలన అన్యోన్యాలంకారమయినది.

విషమము:—

క. అవిరళవిరుద్ధకార్యో
ద్భవము, ననర్థాంకురాభిపతనవిధానం
బు, విరూపఘటన మనఁగా
నవని విధంబు విషమ; మది యెట్లన్నన్. 142

వ్యాఖ్య :- కారణమువలన విరుద్ధకార్యము పుట్టుట, కారణము వలన కార్యముగాక అనర్థము సంభవించుట, విరుద్ధములగు రెండు వస్తువులను ఒకచో సమకూర్చుట అనునవి విషములో భేదములు.

విరుద్ధకార్యవిషమము:—

క. కాలాహినీల మగు నీ
వాలాహవభూమియందు వఱలుచు రిపుభూ
పాలాననసపై వర్ణ్యవి
భాలాభ మొనర్చు నోబపార్థివవరసా! 143

వ్యాఖ్య :- కాలసర్పమువలె నల్లనైన నీ ఖడ్గము శత్రురాజుల మొగము తెల్లగా మార్చుచున్నది. ఇందు నల్లనికత్తి వలన వెల్లబాటు, కలుగుట అను విరుద్ధ కార్యము కలిగినట్లుగా వర్ణించుట విరుద్ధ కార్యోత్పత్తి.

అనర్థవిషమము :—

చ. అమరుభవత్ప్రతాపతపనాతప మంబరవీథిఁ బర్వఁగా
సమదవిరోధిభూరమణచంద్రముఖీవదనారవిందముల్
క్రమమునహర్షమొందమియుఁకా, దనయంబు దృగంబునిర్ఝరీ
హిమజలదూషితంబులగు నెంతయు శ్రీనరసింహభూవరా 144

వ్యాఖ్య :- నీ ప్రతాప సూర్యాతపమునకు శత్రువుల భార్యల ముఖారవిందములు వికసింపకున్నవి. ఇందు కారణమువలన కార్యము పుట్టుటలేదు

విరూపఘటనవిషమము :—

సీ. హయగజారూఢులై యలరు రాజన్యపుం
గవు లేడ? గవు లేడ? కంబుకంఠి!
ఘనభోగభాగ్యసంగతులైన మంత్రికే
నరు లేడ? నరు లేడ? చంద్రవదన!
సౌధవీథికలలోఁ జరియించు పుష్పకో
మల లేడ? మల లేడ? తలిరుఁబోఁడి!

చీనిచీనాంబరశ్రీఁ జెందు బాలికా
వలు లేడ? వలు లేడ? వామనయన!

తే. యనుచు నీదాడి కోడి కాఱడవిఁ బడిన
వైరిభూపాలకుల దురవస్థఁ జూచి
కాంతతోఁ బల్కు వింధ్యపకణకిరాతుఁ
డరిజయాటోప! తొరగంటినరసభూప! 145

వ్యాఖ్య:- ఇందు రాజులకు, గుహకు వైరూప్యము వర్ణింపబడినది
ఇది విరుద్ధ వస్తువుల సంఘటనము వర్ణింపబడినది.

సమము :—

క. అనురూపము లగు వస్తువు
లనయము నెనయంగ నది సమాలంకృతియై
ఘనత రసజ్ఞులమతమునఁ
దనరుం గావ్యంబులందు ధర; నెట్లన్నన్. 146

వ్యాఖ్య :- అనురూపములగు వస్తువుల సంబంధము వర్ణించుట
సమాలంకారమగును.

చ. అలరు రతిన్ రతీశు, దమయంతి నలున్, నలువొందఁ ముందుగా
నలువ సృజించి యందుకతనన్ దనచే యభుకెల్లఁ దీటి నే
ర్పలవడ నోలతాంగి! నరసాధిపు నిన్నును గూర్చి ప్రేమసం
కలితముగాఁగ దంపతులఁగా నొనరింపఁగఁబోలు; మెచ్చితిన్.

వ్యాఖ్య :- రతీమన్మథులను సృజించి బ్రహ్మ నేర్పరియై నిన్ను
సృజించి దంపతులుగా చేసినాడు.

తుల్యయోగిత :—

క. ప్రకృతంబులకైనను న
ప్రకృతంబులకైనఁ దుల్యభావము కలుగం

ప్రకట మగుఁ దుల్యయోగిత
యకలంకోపమ్యగమ్యమై, యెట్లన్నన్. 148

వ్యాఖ్య :- కేవల ప్రకృతములకు, కేవలఅప్రకృతములకు ఉపమానముచే తుల్యభావము చెప్పినచో తుల్యయోగిత అగును.

ప్రకృతతుల్యయోగిత :—

క. నరసింహరాజశేఖర!
నగనుత మగు నీదువితరణంబును, రణముఁ
జిరతస్వాస్థ్యంబుగఁ బ్ర
మ్మఱ దేహీ యనంగనీక మనుచుం బరులన్ 149

వ్యాఖ్య :- ఇందు నరసింహభూపాలుని వితరణ గుణము, రణమును వర్ణింపబడినది. వితరణము, రణముతో సమానమును ఉపమానము వాచ్యముగాకాక గమ్యముగా భాసిల్లుచున్నది. ఇందు రెండును ప్రకృతములే కావున కేవల ప్రకృతతుల్యయోగితాలంకారమయినది.

అప్రకృతతుల్యయోగిత :—

క. కొండలు, రంభాదులచనుఁ
గొండలు వణికదరుచుండు ఘోరాజుల నీ
చండజయపటహరవము ల
జాండంబులు నిండ, నోబయ్యప్రభుసరసా! 150

వ్యాఖ్య :- నీ జయధ్వనులు బ్రహ్మాండము నిండగా కొండలు, రంభాదుల చనుకొండలు, అదురుచున్నవి. ఇందు అదురుట అనునది ధర్మైక్యము. కొండలకు, చనుగొండలకు ఉపమానము గమ్యము. ఈ రెండును అప్రకృతములు. కావున కేవలాప్రకృతతుల్యయోగితాలంకారమయినది.

దీపకము :—

క. ప్రకృతము, లప్రకృతంబులుఁ
బ్రకటంబుగఁ గూడి తులగభావము చెందఁ

నుకవీంద్రుల మతమున దీ
పక మగు; నది గమ్యసామ్యపర; మెట్లన్నన్. 151

వ్యాఖ్య :— ప్రకృతాప్రకృతములకు రెంటింటికిని జౌపమ్యము గమ్యమయినచో దీపకాలంకారమగును

క. ధారుణి సదాళిసన్నుత
సారస్యం బగుచు విమలజలజము, రాకా
నీరేజవైరిబింబము
నీరమ్యయశంబుఁ బోల్చి నెన్నిక గాంచున్!

వ్యాఖ్య :- తెల్ల తామరయు, పున్నమి చందురుడు, నీ కీర్తియు "సదాళి సన్నుత సారస్యము"ను పొందుచున్నవి ఇందు "సదాళిసన్నుత" సదా+అళిసన్నుతము. తామరపువ్వు. సత్+ఆళిసన్నుతము=నక్షత్రముల పంక్తిచే పొగడబడినది చంద్రబింబము సత్+ఆళి=విద్వత్సమూహముచే పొగడబడిన కీర్తి. ఇందు ప్రకృతము కీర్తి. అప్రకృతము చంద్రబింబము, తెల్లదామరయు. వీనివలన ఉపమానము గమ్యమానమగుచున్నవి.

## ప్రతివస్తూపమ :—

క. వేర్వేఱ వాక్యయుగమునఁ
బర్వీన సాధర్మ్య మమరఁ బ్రఖ్యాతం బై
యుర్విం బ్రతివస్తూపమ
సర్వజ్ఞుల మతము నందుఁ జను; నెట్లన్నన్. 153

వ్యాఖ్య :- వేర్వేఱు వాక్యములందు ప్రత్యేకముగా ఒకే సమాన ధర్మము ప్రతిపాదించినచో ప్రతివస్తూపమాలంకారమగును ఇందు జౌపమ్యము గమ్యమానమై ఉండును.

క. రవి యొకఁడె ధురంధరుఁడై
కవిసి తమోవితతి నడఁచుఁ, గవిదైన్యతమో

నివహంబు నడఁత నీవీ
యవనిని ధూర్వహుఁడ వోబయప్రభునరసా! 154

వ్యాఖ్య :- చీకటిని అణచుటకు సూర్యుడొక్కడే ధురంధరుడు. కవి దైన్యమనెడి చీకట్లను అణచుటకు నీవే ధూర్వహుఁడవు. ఇందు "ధురంధరుడు, ధూర్వహుడు" అను వేర్వేరు పదములు ప్రయోగించబడినవి. ఇవి సాధర్మ్య రూపకము.

దృష్టాంతము :—

క. బింబప్రతిబింబత్వము
నం బరఁగిన వాక్యయుగమునం గల సాధ
ర్మ్యంబు చెలంగిన దృష్టాం
తం బగు నది కృతులయందు: ధర నెల్లన్నన్. 155

వ్యాఖ్య :- రెండు వాక్యములందు సాధర్మ్యము బింబ ప్రతిబింబత్వము యుండినచో దృష్టాంతమగును.

క. అనదసురవినవిశసన
రసవిస్మరసాహసుండు రాముఁడె; ధరలో
ననమసమరతలనమదా
రిసమూహవిభేది వీవె, శ్రీనరసింహా! 156

వ్యాఖ్య :- రాముడు రాక్షస సంహారమున సాహసుడు, యుద్ధములందు శత్రుసమూహ విభేధివి నీవే. యిందు సాధర్మ్యము ఒక్కటే అయినను, భిన్న భిన్నపదములలో చెప్పబడినది, భిన్నధర్మములు బింబ ప్రతిబింబ రూపమున విబద్ధమై ఉన్నవి. యిది సాధర్మ్య దృష్టాంతమునకు ఉదాహరణ.

నిదర్శన :—

క. ధర నన్వయంబు గూడక,
గరిమ సామ్యంబు నెచట గమ్యముఁ జేయం

బరఁగునది నిదర్శన యన
నిరవొందును గృతులయందు; నిది యెట్లన్నన్. 157

వ్యాఖ్య :- ఉపమానోపమేయములకు అన్వయము కూడని ధర్మమునకు సాదృశ్యము నిబంధించినచో నిదర్శనాలంకారమగును.

క. బలవదరిరాజిసేనా
జలధిక జీవనముఁ గ్రోలి జలధరశోభా
విలసనముఁ దాల్చె నీయసి
యలఘురణోత్సాహసరస! యాంబళిసరసా! 158

వ్యాఖ్య :- ఓ రాజా! నీ ఖడ్గము శత్రురాజు సేనాజలధి యందు జీవనములను త్రాగి మేఘశోభను దాల్చెను. ఇందు ఖడ్గము ఉపమేయము, మేఘము ఉపమానము. మేఘ శోభవంటి శోభను వహించెనని బింబ ప్రతిబింబమును ఆక్షేపించుకొనవలెను.

వ్యతిరేకము :—

క. ధర నుపమానముకన్నను
నరుదగు నుపమేయ మధిక మానన సామ్యం
బురుభేద కారణం బై
యిరవుగ వ్యతిరేక మయ్యె; నిది యెట్లన్నన్. 159

వ్యాఖ్య :- ఉపమానము కన్నా ఉపమేయమధికమై సాదృశ్యము గమ్యమానమైనచో వ్యతిరేకము.

సీ. బహుతరాశాభ్రాంతి బయలు ద్రాకక యున్నఁ
గువలయద్వేషంబుఁ గోరకున్న
నీటితమ్ములఁ విరివోటు సేయక యున్న
దోషాభిభూతుఁడై తొలఁగకున్న

జగతి నందఱకును బగ లొనర్పక యున్న
వారుణీసక్తిని బాఱకున్న
ద్విజరాజపరిభవోద్వృత్తి చేకొనకున్న
సరసుల నింకింపఁ జాలకున్న
తే. సాటియగు విశ్వవినుతిశశ్వత్ప్రతాప
వైభవధ్వస్తదుర్వారవైరివీరుఁ
డైన యోబయనరసింహానమితభువన
భవనభృతతేజమున కబ్జబాంధవుండు. 160

వ్యాఖ్య :- ఇందు సూర్యునికన్న నరసభూపాలుని తేజము అధికమని వర్ణించుటవలన, ఉపమానముకన్న ఉపమేయము అధికమగుటవలన వ్యతిరేకాలంకారమయినది.

## శ్లేషము:—

క. ప్రకృతము లప్రకృతంబులు
ప్రకృతాప్రకృతములు శబ్దపాటవమాత్ర
ప్రకటితసామ్యముఁ జెందిన
సకలంకశ్లేష మయ్యె; నదియును వరుసన్. 161

క. నిరతము శ్లిష్టవిశేష్యత
నరుదందును ప్రకృతములును నప్రకృతములున్
ధర నశ్లిష్టవిశేష్యము
లరయం బ్రకృతాప్రకృతము; లవి యెట్లన్నన్. 162

వ్యాఖ్య :- ప్రకృతమునకుగాని, అప్రకృతమునకుగాని, ప్రకృతాప్రకృతములకుగాని యెచట శ్లేషించునో అది శ్లేషాలంకారమగును. ఇందు రెండర్థములు ప్రకృతమయినచో ప్రకృతశ్లేష, రెండర్థములు అప్రకృతమయినచో అప్రకృతశ్లేష, ఒక అర్థము ప్రకృతమును వేరొకటి అప్రకృతము అయినచో ప్రకృతాప్రకృతశ్లేష.

## ప్రకృతశ్లేషము:—

క. పరిణతగుణభరితములై
నిరుపమతరశాస్త్రకలన నిర్మిద్రములై
యిరవగు నీధర్మంబులు
పరనుత! యోబక్షితీంద్రునరసింహనృపా. 163

వ్యాఖ్య :- ఓ నరసరాజా నీ ధర్మములు (విండ్లు) గుణభరితములై శాస్త్రకలన నిర్మిద్రములై ఉన్నవి. శ్లేషార్థమున నీ రాజధర్మములు (రాజ ధర్మములు) గుణభరితములై శాస్త్రకలన నిర్మిద్రములై ఉన్నవి. ఇందు రాజవర్ణన, రాజధర్మములు రెండును ప్రకృతము కావున ప్రకృతశ్లేష అయినది.

## అప్రకృతశ్లేషము:—

క. అసదృశకాష్ఠాశ్లేషో
ల్లసితుల నుగ్రకరయోగలక్షితుల విభా
వసుల నగు నీదు తేజో
విసరము నరసింహ! యోబవిభునరసింహా! 164

వ్యాఖ్య :- నీ తేజము సూర్యుని, అగ్నిని చూచి నవ్వుచున్నవి. కాష్ఠ=దిక్కు, కాష్ఠము=కట్టె, విభావసులు=సూర్యాగ్నులు. ఇందు ప్రకృతము తేజము, సూర్యాగ్నుల వర్ణన అప్రకృతము.

## ప్రకృతాప్రకృతశ్లేషము:—

క. అరిదరకరుఁడై సుమనో
హరభరణధురీణుఁడై యపారితలక్ష్మీ
స్థిరవాసభాసురుండై
నరసింహుఁడు పొల్చు నాజి నరసింహుఁ డనన్. 165

వ్యాఖ్య :- నరసభూపాలుడు, నరసింహునివలె అరిదరకరుడై, సుమనోహర భరణధురీణుడై, అపారిత లక్ష్మి స్థిరవాస భాసురుడై ఉం

డెను. అరి=శత్రువు, చక్రము, దరము=భయము, శంఖము, సుమనోవరులు=దేవతలు, పండితులు, ఇందు నరసభూపాలుఁడు ప్రకృతము. నరసింహుని వర్ణన అప్రకృతము. ఇట విశేషణములే శ్లేషించినవి కావున ప్రకృతాప్రకృతశ్లేష అయినది.

పరికరము:—

క. సాకూతములై సఫలత
చేకొన్న విశేషణములు చెలఁగఁ బరికరం
బై కృతుల వెలయుచుండు మ
హాకవినంస్తుత్య మగుచు, నది, యెల్లన్నన్. 166

వ్యాఖ్య :- విశేషణము సాభిప్రాయముగా ప్రయోగించినచో పరికరాలంకారమగును.

సీ. దర్పితాహితనృపోత్తములు నిన్నెదిరింపఁ
గలరె? ధీరోత్తమగండ బిరుద!
వినుతకీర్తిప్రతాపములు నీచే నమ
కట్టునే? యుభయరగండబిరుద!
అరివధూతాటంకగరిమంబు నీచేతఁ
గలుగునే? గండరగండబిరుద!
పరిపంథిగంధసింధురకుంభ నీప్రోల
నుండునే? గండభేరుండ బిరుద!

తే. అరుణపరిణతధామ! రామాభిరామ!
రామణీయకనిర్జితప్రసవబాణ!
బాణసాహిత్యపరిపాక! పాకవైరి
విభవసౌభాగ్య! యోబభూవిభునృసింహ! 167

వ్యాఖ్య :- ఇందలి సంబోధనలు సాభిప్రాయ గర్భితములు కావున పరికరాలంకారము.

ఆక్షేపము:—

క. ధర నిష్ట మపరమార్థ
స్ఫురణంబుగా దన, ననిష్టమున పరమార్థ
స్ఫురణ విధింపఁగ రెండై
యరయఁగ నాక్షేప మమరు; నది యెట్లన్నన్. 168

వ్యాఖ్య :- విశేషము చెప్పఁబోవు మాటకుగాని, వాక్యమునకుగాని నిషేధాభాసము కూర్చినయెడల ఆక్షేపమనబడును. ఈ ఆక్షేపము ఇష్ట విషేధము, అనిష్ట విషేధము అని రెండు విధములు.

ఇష్టనిషేధాభాసము:—

సీ. మదిలోనఁ బాయకుండుదు నన్నఁ బునరుక్తి
నీసొమ్ము నన్న గాఢైక్యవృత్తి
నినుఁ బాసి నిలువలే నన ననంభావ్యంబు
పతి నీ వనఁగ నభఃప్రసవవాంఛ
అతనుఁడు గారించు నన ననాత్మీకసూక్తి
చలిగాలి వేఁడన్న జనవిరుద్ధ
మెలమి నిచ్చటికి రావలయు నన్న మదోక్తి
చను డెంతు నే నన్నఁ జాపలంబు

తే. వెలయఁ ద్వదధీన యగు నన్న వేఁచు నలక
లాధరుం డన్న భవదుపాలంభనరణి
గాన నేయుక్తులు నెఱుఁగఁ; గరుణఁ జూడు
సరసగుణహార! మోబయనరసధీర. 169

వ్యాఖ్య :- ఇందు "పాయకుండు" మొదలగు పదులు ఇష్టములు కాని వాటివి తాపాధిక్యమగు విశేషమును తెలుపుటకయి అభాసరూపమగు వానిని నిషేధములుగ కూర్చబడినవి.

అనిష్టవిధ్యాభాసము:—

చ. అలుగఁగ నేల? మీరు వసుధాధిపు; లెన్న స్వతంత్రులై మమున్; వల దనమిచ్చు, మీమనసు వచ్చినచోటికి నేఁగుఁ; డేఁగినన్, నెలకొను నీప్రియాంగనకు నీకును మార్గాన లేక యుండ నర్మిలి సుకరంబు గాఁగ నొసరించెదఁ గాక నృసింహ భూవరా! 170

వ్యాఖ్య :- ఇందు నాయిక నాయకునితో పలుకు మాటలు "మీ మనసు నచ్చినచోటికేగుఁడు" అను వాక్యములో విధిరూపమున పలుకు చున్నది. ఈ వాక్యములో పరాంగనవద్దకు పోవలదని భావన కావున ఇది అనిష్ట విధ్యాభాసము.

వ్యాజస్తుతి:—

క. సతతంబు నిందచేతను
స్తుతియుక్, స్తుతిచేత నింద చొప్పడ వ్యాజ
స్తుతియై చెలువగుఁ గృతులం
దతులితకవివినుత మగుచు; నది యెట్లన్నన్. 171

వ్యాఖ్య :- నిందా వ్యాజముచే స్తుతియు, స్తోత్ర వ్యాజముచే నింద యును చేయుట వ్యాజస్తుతి అగును.

నిందాకృత స్తుతి:—

సీ. నెఱి జీవనము లేక నింగిపై భ్రమియించు
మత్స్యంబు నునుము లేమాటవాసి?
త్రిజగతీమాతవాగ్దేవిభండారంబు
చూఱఁగాఁగొనుట యే సుగుణితనము?
వేఁడినవారికి వెండియు నొకమాటు
విత్తమీకుంట యే వితరణంబు?

అల యనాదిప్రవాహము లైన యేళ్ళవం
కలు దిద్దుచే వివేకంబు కలిమి?
తే. వఱలు నీకీర్తి ద్విజరాజవైభవంబు
లపహరింపఁగ నీయాజ్ఞ యలరు టెంత?
పోచిరాజాన్వయాంభోధిపూర్ణచంద్ర!
నరసుతాటోప! తోరగంటిపరసభూప! 172

వ్యాఖ్య :- ఇందు నిందావ్యాజముచే స్తోత్రము చేయబడినది.

స్తుతినింద:—

క. అనమురణరంగముల నీ
యసిసటి నటియింపఁ గని, హరులన్, సిరులన్
వెస నొసఁగు నౌర! యొంటటి
రసికుఁడు నీవైరి, యోబరాజనృసింహా! 173

వ్యాఖ్య :- ఇందు స్తోత్రవ్యాజముచే శత్రునింద చేయబడుచున్నది.

అప్రస్తుతప్రశంస:—

క. క్షితి నప్రస్తుతముఁ బ్ర
స్తుతవస్తుగమ్య మగుచు సొంపొందిన నీ
శ్రుతులఁ దలపోయ నప్ర
స్తుతప్రశంసాఖ్య మయ్యెఁ దది; యొట్లన్నన్. 174

వ్యాఖ్య :- అప్రస్తుతమును వర్ణించుటవలన ప్రస్తుతవస్తువు గోచరించినచో అప్రస్తుతప్రశంసాలంకారమనబడును.

క. వనజలు మొనలెత్తెఁ; దేనెలు
చినికెం; జిగురాకు లంటెఁ; జేవరె ఫలితతుల్
చనుపున నీపూఁడేఁగకు
ఘనమైన నృసింహుపొందు కలుగఁగఁ బోలున్. 175

వ్యాఖ్య :- ఇందు అప్రస్తుతమగు పూఁదీఁగను వర్ణించుట వలన ప్రస్తుతమగు నాయికానాయక వర్ణన గోచరమగుచున్నది.

పర్యాయోక్తి :—

క. ప్రస్తుతకార్యస్తుతిచేఁ
బ్రస్తుత కారణము తోఁప, బర్యాయోక్తం
బస్తోకసుకవికావ్య
ప్రస్తుత మై చెలఁగుచుండు రహిఁ; నెట్లన్నన్. 176

వ్యాఖ్య :- ప్రస్తుత కార్యవర్ణనచే ప్రస్తుత కారణము స్ఫురించిన ప్రర్యాయోక్తిలంకారమగును.

ఉ. చక్కెర పెట్టవే వికచసారసలోచన! మాట నేర్పవే
చొక్కపుగుబ్బలాఁడి! ననుఁ జొప్పడఁ బాణితలంబుఁ జేర్పవే
చెక్కులనిగ్గులాఁడి!యని చిల్కలువల్కు, నృసింహ! పూర్వ
పు, న్మకుక్కవనీవిరోధినృపమందిరచిత్రవధూపరంపరన్ 177

వ్యాఖ్య :- ఇందు నీ శత్రురాజుల భార్యలు రాయిలు వారి భార్యలతో రాజ్యము విడిచిపోయిరి. అను కారణము గమ్యమానమగుచున్నది.

ప్రతీపము :—

క. ఉపమేయమె చాలుఁ ధర
నుపమానం బేల? యనఁగ నొకరుఁ బ్రతీపం
బపరిమితసుకవికృతులం
దపారవిస్ఫూర్తిఁ జెందిఁ; యది యెట్లన్నన్. 178

వ్యాఖ్య :- ఉపమేయమే చాలు ఉపమానము ఎందులకు! అనునట్లుగా వర్ణించినచో ప్రతీపమను అలంకారమగును.

సీ. సత్పథక్రమకళాచాతురి నెఱపదో
కమలాధికామోదకరము కాదొ

వివిధచక్రానంద విభవం బొనర్పదొ
సతతంబు నుదయసంగతము కాదొ
యిల మహాగ్రహరాజజృంభణం బలమదొ
యమితదోషోన్మనహరము కాదొ
మహితగాంగేయధామస్ఫూర్తిc జెలcగదొ
యచ్యుతోగ్రాకారహారి గాదొ

1. నీ ప్రతాపంబు తనవలె నిఖిలతమము
నడcపcగా లేదొ, తా నేల యరుగుదెంచుc,
గుంటిసారథితో నల్ల కుముదవైరి,
నరనుతాటోప! యోబయనరసభూప! 179

వ్యాఖ్య :- ఇందు సూర్యుడు చేయుపనులను, ప్రతాపమే చేయుచుండుట
వలన సూర్యునితో పని యేమని వర్ణించుటవలన ప్రతీపాలంకారము
అయినది.

అనుమానము ;—

భువి సాధనసంపదచే
నవిరళస్ఫూర్తి సాధ్య మనుమేయముగా
వివిధశ్లేష విశేషా
ద్వావియుత మనుమాన మయ్యె; నది యెట్లన్నన్. 180

వ్యాఖ్య :- చమత్కార విశేషముచే సాధనముచే సాధ్యమును
అనుమానించుట అనుమానాలంకారము.

కమలాక్షుc డీమేటి కాcబోలుc; గాకున్నc
గరముల శంఖచక్రములు గలవె?

కమలారి యీరాజు కాఁబోలుఁ; గాకున్న
సకలకలావిలాసములు కలవె?
కమలాప్రుఁడీప్రౌఢ కాఁబోలుఁ, గాకున్న
నధిగతమండలవ్యాప్తి గలదె?
కమలజుండీస్వామి కాఁబోలుఁ, గాకున్నఁ
జతురాననవచఃప్రశస్తి కలదె?

తే. యనుచుఁ గొనియాడుదురు నిన్ను నంగ, వంగ
మాళ, వావంతి, గౌళ, నేపాళ, చోళ,
కుకురు, కురు, పాండ్య, శక ముఖక్షోణిపతులు
నరసుతాటోప! యోబయనరసభూప 18

వ్యాఖ్య :- ఇందు కళంకచక్రాది సాధనముచే కమలాక్షాదులని సాధ్యములుకల్పించిబడినది. ఇది శేషగర్భమగు అనుమానము.

## కావ్యలింగము:—

క. హేతువు వాక్యార్థంబై
యాతతవిస్ఫూర్తితోఁ బదార్థంబును నై
ఖ్యాతిఁ గనఁ గావ్యలింగం
బై తగు సత్కృతులయందు; నది యెట్లన్నన్. 18

వ్యాఖ్య :- కార్య సాధనమునకు కారణమయిన హేతువు పదరూమునగాని, వాక్యరూపమునగాని ప్రయోగించిన కావ్యలింగము.

## వాక్యార్థహేతుకము:—

మ. అరుదై పొల్పగు 'పోచిరాజు నరసింహో'యన్న యష్టాక్ష
వరమంత్రం బిదె యొల్లి కాలమునరుల్ వ్రాకువ్వసిద్ధించుఁబో
కరు, లాందోళిక, లశ్వముల్, విభవముల్, గ్రామంబు, లత్యు

జ్వలాంగ, బరముల్. సొమ్ములు, పల్లకీల్, పరిణయ ప్రారంభ
సంరంభముల్. 183

వ్యాఖ్య :- ఆ నగరమందలి జనులు "పోచిరాజు నరసింహా" అను అష్టాక్షర మంత్రమును జపించుట వలన సుఖముగా జీవించుచున్నారు. ఇందు అష్టాక్షర వరమంత్రం జపియించి కాలము నరుల్ ద్రొక్కున్న అను వాక్యమును ప్రయోగించుట వలన వాక్య పదార్థ హేతువు.

పదార్థహేతుకము:—

క. గురునఖదళిత క్షితిపా
కరిచిత్రితభిత్తికలితఘనమణివీక్షా
పరికోపయుతములై నీ
యరిపురసౌధములం దిసుక మానవె హరులు నృసింహా! 184

వ్యాఖ్య :- నరసరాజు శత్రుభవనములలో గోడలపై చిత్రించబడిన ఏనుగుల కుంభస్థలములనుండి ముత్యములు రాలగా సింహాలన్నియు శాంతించుచున్నవి. ఇందు సింహములు కోపము తగ్గుటకు కారణము "మణివీక్షణము" అను పదార్థము కూర్చుట వలన పదార్థహేతువను కావ్యలింగాలంకారమయినది.

అర్థాంతరన్యాసము:—

క. మహి విశేషంబుచేత సామాన్యమును, ప్రబ
లసత్సామాన్యమున విశేషము సమర్థి
తముగ నర్థాంతరన్యాస మనుచు చుండు
నెలమి రెండు విధంబులై, యొల్లటన్న. 185

వ్యాఖ్య :- విశేషముచేత సామాన్యము, సామాన్యముచేత విశేషము గాని సమర్థించినచో అర్థాంతరన్యాసమగును.

విశేషసమర్థితసామాన్యార్థాంతరన్యాసము:—

క. విమలాత్ముఁ డెచట నుండిన
విమలుం డగు, నెట్లటన్న వినుము సురాగా
రమునఁ జనించియు నీయశ
మమలస్థితి గాదె యొంబయ్యుభువరసా! 186

వ్యాఖ్య :- విమలాత్ముఁడు ఎచట ఉన్నను విమలాత్ముఁడే నీ కీర్తి ఆకాశమున చలించినను విమలమే యనుటవలన "కీర్తి" అను విశేషముచే సామాన్యమును సమర్థించుటవలన అర్థాంతరన్యాసమయినది.

సామాన్యసమర్థితవిశేషార్థాంతరన్యాసము:—

చ. జలనిధిరాజకన్యక నుసన్న మెలంగుచునుండు, వాణియుఁ
మెలఁగును మాటలోన, నెలమిం జెయినన్నఁజరించుఁగీర్తి, నీ
లలితభుజోపగూహనవిలాసము మానదు ధాత్రి, సద్గుణో
జ్జ్వల!నరసింహ! మంత్రబలవంతులకింతులు చిక్కుటబ్రమే? 187

వ్యాఖ్య :- లక్ష్మి, సరస్వతి, కీర్తి, భూదేవులు, నీ వశమై యున్నారు. అనునది విశేషార్థము మంత్రబలవంతులకు స్త్రీలు చిక్కుట అనునది సామాన్యార్థము ఇందు సామాన్యార్థముచే విశేషార్థము సమర్థింపబడినది.

యథాసంఖ్యము:—

క. సమముగ నేవరుసఁ బదా
ర్థము లుద్దిష్టంబు లయ్యెఁ దగ నాపర్యా
యమున ననూద్దిష్టములై
యమర యథాసంఖ్య మయ్యె; నది యెట్లన్నన్. 188

వ్యాఖ్య :- పదార్థములు ఏక్రమమున ఉద్దేశించబడినవో అదే క్రమమున పర్యాయమున ఉద్దేశించినవో యథా సంఖ్యాలంకారమగును.

చ. వరకరుణా, ధరాభరణవైభవ, సద్గుణ, బుద్ధిచాతురీ,

పరమవిభుత్వ, పావనవిభా, బల, ధైర్యవిజృంభణంబులన్
వరుస హరిం, గిరిం, గలశవార్నిధి, గీర్నిధిం శూలిఁ, గీలి, నా
కరిఁ, గిరి గెల్తు వౌర! త్రిజగన్నుత! శ్రీనరసింహభూవరా!

వ్యాఖ్య :- నరసరాజు కరుణయందు హరిని, ధరాధరణమున గిరిని, వైభవ సద్గుణమున కలశవార్నిధిని, పరమ విభుత్వమున శూలిని, పావన విభయందు గీలిని, బలమున కరిని, ధైర్యమున గిరిని గెలిచెదవు. అని ఉద్దిష్టములకు క్రమముగా అనూద్దిష్టములు వర్ణించబడినది.

అర్థాపత్తి: —

క. వరున నొకానొక వస్తువు
గిరికొన వస్త్వంతరంబు కిముతన్యాయ
స్ఫురితంబై చనుదెంచఁగ
ధర నర్థాపత్తి యయ్యెఁ దగ; నెట్లన్నన్. 190

వ్యాఖ్య :- ఒక అంశమును చెప్పినప్పుడు వేరు చెప్పవలసిన పని లేదు (కిముతన్యాయము) అను అర్థము సిద్ధించునట్లుగా వర్ణించుటవలన అర్థాపత్తి అను అలంకారమగును.

సీ. అమరశైలము చిన్నకుంతగాఁ దలపోసి,
ఈశాచలము దారమెత్తుఁ జేసి,
వెలయు మంధాద్రి వేళ్ళతోఁ జెకలించి
మైనాక మబ్ధిలోఁ గ్రుంగఁజేసి
అనుపమావంధ్య వింధ్యస్ఫూర్తి నిలఁ గ్రామి
మలయాగ మూర్వికి కెలి యొనర్చి
యల క్రౌంచగిరికి రంధ్రాన్వేష మొనరించి
వలిగుబ్బలికి వింత వగలు గూర్చి
తే. యడరు నీ ధైర్యమనిపచో నవరగిరులు
సాటిరా వని మఱివేఱ చాటనేల ?

వ్యాఖ్య :- ఇందలి నాయకుని వాక్యములచే "నరసభూపాలుని శత్రురాజులు తమ భార్యలను ఎట్లు ఊరడించెనో అను ప్రశ్న ఊహింపబడినది.

ప్రశ్నోత్తరమాలికోత్తరము :—

ఉ. ఎవ్వఁడు దేవతాగురుఁ? డహీనశయానుఁ డవక్రవిక్రముం
డెవ్వఁడు? రామభద్రుఁడు; మహీవలయైకధురాధురంధరుం
డెవ్వఁడు భోగిభర్త; జగదేకవిజృంభితదానదీక్షితుం
డెవ్వఁడు? శోచిరాజునరసేంద్రుఁడె వార్ధిపరీతమేదినిన్. 196

వ్యాఖ్య :- ఇందు ప్రశ్న, సమాధానములు మాలారూపమున వర్ణించుట వలన అర్థాపత్తి అలంకారమైనది.

వికల్పము :—

క. సమబలయుతవస్తువులకు
నమితవికల్పన మొనర్ప ననఘాలంకా
రము తద్జ్ఞులమతమున నది
యమరు వికల్పం బనంగ; నది యెట్లన్నన్. 197

వ్యాఖ్య :- తుల్యబలముగల వస్తువులకు వికల్పము వర్ణింపబడినచో వికల్పాలంకారమగును. ఈ రెండువస్తువులకు ఔపమ్యమూలకమగు విచ్ఛిత్తి కలిగియుండవలయును.

సీ. 'అలఘుకాంచనమయస్థలివాసము మేలా?
కాంచనస్థలవాసకలన మేలా?
పుండరీకంబుల దండ నుండుట మేలా?
పుండరీకంబుల దండ మేలా?
మహనీయవాహినీమధ్యసంస్థితి మేలా?
వాహినీశ్వరమధ్యవసతి మేలా?

మహిషసహవాసవిహారణంబులు మేలో?
మహిషీసహవాసమహిమ మేలో?
తే. శైలకటకాశ్రయంబులు మేలో! యతని
యంఘ్రికటకాశ్రయము మేలో! యధిపులార!'
యనుచు నీశాత్రవులమంత్రు లనువయింతు
రరిజయాటోప! తోరగంటినరనభూప! 198

వ్యాఖ్య :- ఇందు వికల్పము గోచరించుచున్నది. శబ్దసాధర్మ్య మూలకమగు ఔపమ్యముచేత, సుందరత్వము గోచరించుచున్నది. కాంచనము=బంగారము, ఉమ్మెత్తచెట్టు పుండరీకము= తామర, పులి,వాహిని =సేన, నది=మహిషి, రాణి, గేదె అని వికల్పార్థమును గ్రహింపవలయును.

## సముచ్చయము :—

క. మిగుల గుణక్రియ లెక్కడ
యుగపత్ప్రాప్తంబులుగ సముచ్చయము కృతిఁ
బొగడఁ దగుఁ ద్వివిధంబై
యగణితకవివినుత మగుచు; నదియెట్లన్నన్. 199

వ్యాఖ్య :- గుణములు, క్రియలు ఒకేసారి సంభవించినట్లు వర్ణింపబడినచో సముచ్చయము అను అలంకారమగును.

## గుణసముచ్చయము :—

క. నరసింహశౌర్యశోభా
స్ఫురణంబున జగము లెల్ల శోణము లయ్యెన్

బరరాజవదనవితతులు
హారిసితనిభంబు లయ్యె ననవరతంబున్. 200

వ్యాఖ్య :- ఇందు ఎరుపు నలుపు గుణములు ఒకేసారి కలిగినట్లు వర్ణింపబడినవి. కావున గుణ సముచ్చయము అయినది.

క్రియాసముచ్చయము :—

చ. అలకలు ముట్టి ముట్టి, జఘనాంబరమం త్రిక్రిం గిట్టి కిట్టి గు
బ్బలు రతిం బట్టిపట్టి, కరపల్లవముల్ నులిపెట్టి పెట్టియుం
జెలువగుతారహారములు చిక్కులు పెట్టు; నృసింహ! నీద్వివ
ల్లలన వనాలి కేంగ. విటలక్షణ లక్ష్యములై మహీజముల్.

వ్యాఖ్య :- ఇందు క్రియలకు యోగపద్మము చెప్పబడినది.

ద్వితీయసముచ్చయము :—

క. పాయక ఖలేకపోత
న్యాయమున ననేకకారణము లొకకార్యం
బేయెడ సాధింపంగ నుత
మై యపరసముచ్చయాఖ్య మగు; నెట్లన్నన్. 202

వ్యాఖ్య:- ఒక కార్యమును సాధించుటకు పెక్కు కారణము లున్నట్లు వర్ణించినచో సముచ్చయము అను అలంకార భేదము అగును.

క. శూరతయును, ధీరతయు, ను
దారతయు, గభీరతయును, ధార్మికతయు నీ
కారణజన్మస్ఫురదవ
తారము సూచించె నోబళధరణీపురసా! 203

వ్యాఖ్య :- ఇందు అవతారము కారణము. దీనికి శూరతా, ధీరతా ఉదారతా, గభీరతా అను పెక్కు కారణములు వర్ణించబడినవి.

## సమాధి:—

క. కారణ మొకటి కార్యము
ధారుణి సాధింపఁ గాకతాళీయమునఁ
గారణము వేఱొకటి రా
నారూఢి సమాధి యయ్యె; నది యొప్పుగన్. 204

వ్యాఖ్య:- ఒక కార్యమును సాధించుటకు ఒక కారణము ఉండగా కాకతాళీ యన్యాయాను సారముగా మరొక కారణముచే ఈ కార్యము సాధింపబడినట్లుగా వర్ణించుట సమాధి అను అలంకారమగును.

చ. అని మొనశ్రీనృసింహవసుధాధిపుతీవ్రచమూసమూహముం
గనుఁగొని యద్భుతం బొదవ ఖానవజీరులు వ్రేళ్ళనోళ్ళఁ జొం
పొనుపఁగఁ గాకతాళనయకోటిఁ దదీయ నఖాంగుళీవివే
కనములు ప్రాణరక్షణవిచారధురీణము లయ్యె వారికిన్. 05

వ్యాఖ్య :- నరసభూపాలుని సైన్యమునుచూసి శత్రురాజులు ఆశ్చర్యముతో నోటిపై వేళ్ళుపెట్టు కొనిరి, కాకతాళీయముగా ప్రాణ రక్షణకయి అట్లు చేయుచుండిరని భావించిరి.

## భావికము:—

క. క్షితిలోన నతీత మనా
గతముల ప్రత్యక్షమువలెఁ గన్పట్టుట య
ద్భుతనిరూపసూక్తిగ్రథనం
బతిశయముగ భావికాఖ్య మగు; నెల్లనన్. 206

వ్యాఖ్య :- కవి తన వర్ణనా చాతుర్యముచే జరిగిపోయిన దానిని సాటిలేని దానిని ప్రత్యక్షముగా వర్ణించుట భావికము అను అలంకారమగును.

మ. వరవల్గావిభవంబు దష్టభుజగ వ్రాతంబుగా సింగిణుల్
గురుపక్షద్వితయంబు గాఁగ నరసక్ష్మోణీశ్వరారూఢమా
తురగోత్తంసము,నిందిరావ్యాదయనాథుంబాల్చు,ప్రత్యక్షబం
ధురభక్షీంద్రునిలీలఁ జూచు నహితస్తోమంబు భీమంబుగన్.

వ్యాఖ్య :- నరసభూపాలుడు అధిష్ఠించిన గుఱ్ఱము సర్పములను నోటదాల్చి, రెక్కలను ధరించిన గరుత్మంతునివలె శత్రువులు ప్రత్యక్షముగా చూచుచుందురు. ఇది భూతభావికము వర్ణించబడినది.

ప్రత్యనీకము;—

క. వగవాఁడు సమర్థుఁడుగా
మగఁటిమి పెన నతనిమీఁద మార్కొన కిల నా
వగవానిహితుల నొంచుట
యగుఁ గృతులం బ్రత్యనీక; మది యొట్లన్నన్. 208

వ్యాఖ్య :- బలవంతుడగు శత్రువును ఎదిరించలేక అతని మిత్రుని బాధించినట్లు వర్ణించినచో ప్రత్యనీకాలంకారమనబడును.

క. నీదురవగాహశౌర్యము
భేదింపఁగ లేక విమతపృథివీశుఁ డనిన్
భేదించు నృసింహ భవ
న్మోదురభయదప్రతాపమిత్రునిమిత్రున్. 209

వ్యాఖ్య :- నీ శత్రురాజులు నీ శౌర్యమును భేదించలేక మిత్రుడగు మిత్రుని (సూర్యుని) భేదించుచున్నాడు. ఇది శ్లేషతో సంయోగము చెందినది.

వ్యాఘాతము:—

క. ఒకఁ డొకటిచేత నొకపని
నకలంకతఁ జేయ, దాని నా హేతువుచే

నొకఁడు మఱి వేఱె చేయఁగఁ
బ్రకటవ్యాఘాత మెన్నఁబడు; నట్లన్నన్. 210

వ్యాఖ్య :- ఒకడు సాధించిన సాధనమే వేరొకని చేతిలో విరుధ కార్యము సాధించినట్లు వర్ణించినచో వ్యాఘాతమను అలంకారమగును.

క. రాజీవబాంధవుఁడు నిజ
తేజమున నొనర్చుఁ ద్రిజగతీతాపము, న
వ్యాజవిరాజితతేజో
రాజిన్ హరియింతు వోబరాజునృసింహా! 211

వ్యాఖ్య :- సూర్యుఁడు తన తేజస్సుచే ముల్లోకములను తపింప చేయుచుండగా, నీ తేజస్సుచే లోకములోని తాపమును హరించుచున్నావు.

సూర్యుడు ఏ సాధనముచే కార్యమును సాధించుచున్నాడో అదే సాధనముచే కార్యమును సాధించినట్లు వర్ణించుటవలన ప్రత్యనీకాలంకారమగును.

## పర్యాయము:—

క. ఏకాధేయం బరయ న
నేకాధారంబులందు నిరవై క్రమముం
జేకొనఁ బర్యాయంబు మ
హాకవిసంస్తుత్య మయ్యె; నది యెట్లన్నన్, 212

వ్యాఖ్య :- ఒకే వస్తువు అనేకాధారములందు కాలభేదమున్నట్లు వర్ణించుట పర్యాయాలంకారమనబడును.

సీ. కందర్పహరునందుఁ గనువిచ్చుఁగా నేర్చి
శరవణోద్భవునందు శక్తి యెఱిఁగి

రాముసం దచలాంబరముఁ గట్టఁగా నేర్చి
జలధిలంఘనమందు జంగ యెఱిఁగి
ఘటజుసం దుభయపక్షములఁ బోర్లఁగ నేర్చి
వెన ద్రోణియొద్దఁ బాలు వేఁడ నెఱిఁగి
మొగి వృకోదరునందు ముష్టి పూనఁగ నేర్చి
విజయునియొక్కఁ గర్ణవేధ యెఱిఁగి
తే. యనుదినంబును నభివృద్ధిఁ దనరు శౌర్య
శిశువు భవదీయకోః స్తంభజృంభమాణ
ఖురళిఁ గాక్షేయవాలనస్ఫురణ మెఱిఁగె
వైరిగజసింహ! యోబయనారసింహ! 213

వ్యాఖ్య :- ఇందు శౌర్య శిశువునకు అనేకములగు ఆధారమున్నట్లుగా వర్ణించుటవలన పర్యాయము అను అలంకారమనబడును.

సూక్ష్మము :—

క. ఈక్షితిఁ దలపోయునసం
లక్షితసూక్ష్మార్థకౌశలప్రకటనపై
చక్షణ్యము సూక్ష్మం బగు
నక్షీణకవిప్రశస్త; మది యెట్లన్నన్. 214

వ్యాఖ్య :- సామాన్యులకు తెలియని సూక్ష్మార్థమును ఆకారేంగితములచే ప్రకాశింపచేయుట "సూక్ష్మము" అను అలంకారమగును.

ఉ. ప్రాణమువంటి నాకు నిజభావము దాఁపఁగఁ జెల్లునమ్మ! నీ
ప్రాణవిభుం బ్రభూతగుణబంధుకుఁ దెల్పఁగదమ్మ! యంచువి
న్నాణముగా సఖీజనాలు వల్లడలం గదియంగ సైకత
శ్రోణియురంబుమీఁద నఖసూచిక నేర్చెనృసింహభూవరా!

వ్యాఖ్య :- "ఊరంబుమీఁది నఖసూచికను" చూపుట వలన నాయిక తనప్రియుడు నరసింహరాజు అని తెలుపుచున్నది. ఇందు "ఆకారేంగితముచే" సూక్ష్మార్థమును వ్యక్తము చేయుట వలన "సూక్ష్మము" అను అలంకారము అగుచున్నది.

ఉదాత్తము :—

క. విశ్వోన్నతమై చెలఁగెడు
నైశ్వర్యము గలుగువస్తు వభినుతిచేయన్
శాశ్వతి మగుచు నుదాత్తము
విశ్వంభరలోనఁ బొల్చు; విను మెల్లన్నన్. 310

వ్యాఖ్య :- ఒక వస్తువును ఐశ్వర్యయుతముగా వర్ణించినచో.... ఉదాత్తమను అలంకారమగును.

మ. నృపు లర్పించినఁజేడెలూడ్చి పెలికిన్ నేర్పొప్పఁగా గుప్పఁగా
నెపుడుం జల్లినముగ్గుము త్తెములు, ధాత్రీశాంగదస్వర్ణచూ
ర్ణపుఁబ్రోవుల్ దగునిగ్నృపాంగణములం దాధాత్రిధాత్రీధరా
ధిపముల్ స్వవ్యయభీతనిన్ గొలుచురీతిన్ శ్రీనృసింహాధిపా!

వ్యాఖ్య :- ముత్యము, బంగారము నరసరాజును ఆశ్రయించి యున్నట్లుగా వర్ణించుటవలన ఉదాత్తమను అలంకారము.

పరివృత్తి :—

గీ. సమమిచ్చి సమము గొనఁగ, న
ల్పము నిచ్చి యనల్పముఁ గొనఁ, భావింప నన
ల్పము నిచ్చి యల్పముం గొన
నమరుం బరివృత్తి త్రివిధమై; యెల్లన్నన్. 312

వ్యాఖ్య :- సమానమైనది ఇచ్చి సమానమైనది గ్రహించుట, అధికమైనది ఇచ్చి, అల్పమైనది గ్రహించినట్లు వర్ణించుట, అల్పమైనది ఇచ్చి

అధికమైనది గ్రహించునట్లు వర్ణించుట అను మూడు విధములుగా పరివృత్తి అను అలంకారము.

సమపరివృత్తి :—

క. శ్రుతి, హృదయ, రత్నభూషా
కృతులు కృతుల్ నీకు నొసంగి కృతులు నృసింహ
క్షితివర! నీచేఁ గాంతురు
శ్రుతిహృదయాభరణములు విశోభితలీలన్, 219

వ్యాఖ్య :- ఇందు కవులు శృతి హృదయ రత్న భూషాకృతులగు కుతులను ఇచ్చి శృతి హృదయరత్న భూషలు గ్రహించుచున్నారు. ఆని సమమైనది ఇచ్చి సమమైనది గ్రహించబడినది. శృతి=చెలి; హృదయము= మనస్సు, కృతులు=నేర్పరులు.

అధికదానా ల్పాదానా పరివృత్తి :—

క. నరసింహ! నీదు వైరులు
కరి, సింహ, లులాయ, భల్ల గవయా, హివరం
పరకుఁ దమగృహము లొసఁగుచు
వరుస భజింతురు తదీయవశమందిరమున్. 220

వ్యాఖ్య :- నరసరాజు శత్రువులు తమ గృహములను ఏనుగులకు సింహములకు యిచ్చి, వాటి గుహలను వీరుగ్రహించుచున్నారు. యిందు ఆధికమయిన తమ గృహములను యిచ్చి, అల్పమయిన తమ గుహలను స్వీకరించినట్లుగా వర్ణించుటవలన "అధిక దానాల్పదానపరివృత్తి" అలంకారమయినది.

అల్పదానాధికాదానపరివృత్తి :—

క. నరతనువు నీకరాసికి
నరి యొసఁగి నృసింహభూప! యనుపమరంభా

పరిరంభగుంభసంభ్రమ
భరితామరతాశుభప్రభావముఁ జెందున్. 221

వ్యాఖ్య :- నీ శత్రువులు నీ కత్తికి తమ శరీరమును అర్పించి స్వర్గమునురంభాదుల పరిష్వంగమున దేవత్వమును పొందుచున్నారు. ఇందు అల్పమయిన శరీరమును యిచ్చి అధికమైన దేవత్వము పొందినట్లుగా వర్ణించుటవలన అల్పదానాధికాదాన పరివృత్తి అను అలంకారమయినది.

కారణమాల :—

క. ఇల నుత్తరోత్తరములకుఁ
బొలుపొందఁగఁ బూర్వపూర్వములు హేతువులై
యలరఁగఁ గారణమాలిక
యలంకరణరాజ మయ్యె; నది యెట్లన్నన్. 222

వ్యాఖ్య :- ఇందు పూర్వముత్తరోత్తరంబు కారణమయినచో కారణమాలాలంకారమగును. అనగా మొదటి కారణము రెండవ దానికి, దానికి మూడవది, ఈ విధముగా విశేషణ మగుచుండును.

మ. హరిపాదాంబుజపూజనాభిరతిచే నైశ్వర్య, మైశ్వర్యచా
తురిచే సజ్జనరక్షణంబు, సుజనస్తోమావనస్ఫూర్తిచేఁ
జిరపుణ్యంబులు, పుణ్యవాసనలచేఁ జెన్నొందుసత్కీర్తియున్
నరసింహాధిప! నీకె పొల్చు బుధసంతానైకచింతామణీ. 223

వ్యాఖ్య :- ఇందు హరిభక్తి శ్రీశ్వర్యమునకు, ఐశ్వర్యము సజ్జనరక్షణకు, సజ్జన రక్షణ పుణ్యమునకు, పుణ్యము కీర్తికి కారణము అని వర్ణించుట వలన కారణమాలాలంకారమయినది.

ఏకావళి:—

క. ధరఁ బూర్వపూర్వమున కు
త్తరోత్తరము క్రమనమగ్రత విశేషణమై

పరఁగిన నేకావళి యన
నరుదగు సత్కృతులయందు; నది యొల్లన్నన్. 224

వ్యాఖ్య పూర్వ, పూర్వమునకు ఉత్తరోత్తరము విధిమాపమున విశేషణముగా నిబంధించినచో ఏకావళి

క. అవనిధవాస్థానంబులు
కవియుతములు; కవులు రచితకావ్యులు; కావ్య
వ్యవహారము లమితభవ
న్నవనవగుణభూషితములు నరసింహానృపా! 225

వ్యాఖ్య :- ఇందు రాజాస్థానములకు కవులును, కవులకు కావ్యములును, వానికి నరసరాజు గుణములు విశేషములుగా వర్ణించుటవలన ఏకావళి అను అలంకారమయినది.

మాలాదీపకము:—

క. మహిఁ బూర్వపూర్వమునకున్
రహి మీఱఁగ నుత్తరోత్తరము రమ్యగుణా
వహముగ మాలాదీపక
మహీనవిఖ్యాతిఁ జెందు; నది యొల్లన్నన్. 226

వ్యాఖ్య :- పూర్వపూర్వనకు ఉత్తరోత్తరము ఉత్కృష్టముగా ఉన్నట్లు వర్ణించినట్లయిన మాలాదీపకమగును.

క. గురుచాపముచే శరతతి,
శరతతిచే శత్రుశిరము, శత్రుశిరముచే
ధర, ధరచే నీబాహువు
పరిలబ్ధం బయ్యె నోబసార్థి పునరసా! 227

వ్యాఖ్య :- చాపముచే శరతతి, శరతతిచే శత్రుశిరస్సు, శిరస్సుచే ధర, ధరచే నీ బాహువు ఉత్కృష్టములయ్యెను. ఇందు ఉత్తరోత్తరము ఉత్కృష్టముగా వర్ణించుటవలన మాలాదీపకము అను అలంకారము.

సారము:—

క. నిరవధిక ముత్తరోత్తర
నిరతోత్కర్షంబు దెలుప నిఖిలకృతులయం
దరుదై తగు సారాలం
కరణము కవివినుత మగుచుఁ గదు; నెల్లన్నన్. 228

వ్యాఖ్య :- పూర్వము పూర్వము కంటెను, ఉత్తరోత్తరము ఉత్కృష్టమయిన సారాలంకార మగును.

సీ. స్థావరజంగమాధారముల్ త్రిజగంబు
లల జగంబు లజాండములఁ జెలంగు
నాయజాండము లుండు హరిరోమకూపమం
దాశౌరియును భోగిపై శయించు
నాభోగి జలధిలోఁ ణావాస మొందు, నా
కదలి కుంభజుచులుకంబుఁ జెందు
నాకుంభజుఁడు నింగి నేకఖద్యోతాభుఁ
డానింగికబరియై యతిశయిల్లు
తే. నీయశోలక్ష్మి, కక్షీణనీతిచతుర!
చతురుదధి మేఖలావృతక్షితిధురీణ
చటులభుజదండ! దండితోత్కటమదారి
వీరపరివార! రాబభూవిభునృసింహ! 229

వ్యాఖ్య :- ఇందు స్థావర, జంగమ, లోక, బ్రహ్మాండ, హరి రోమ కూప, భోగి, జలధి, చులుక, కుంభజ, కీర్తులు ఒకదానికంటె ఒకటి ఉత్కృష్టములని వర్ణింపబడినవి కావున సారాలంకారము.

క. రసవత్ప్రేయము, లూర్జ
స్విసమాహితములును నిచట వివరింపఁగ నే
దసమరసప్రకరణమున
రసభావాద్యుపనిబద్ధరసములు గానన్. 230

వ్యాఖ్య :- రసభావాద్యలంకారములు లక్షణము రసప్రకరణము లోని రసభావాదులను బట్టి తెలియును. రసము, మరియొక దానికి అంగమైన రసవదలంకారమగును. భావము మరియొక దానికి అంగమైన ప్రేయోలంకారము, రసాభాస, భావాభాసము మొదలగు అలంకారములగును. అన్యాంగములైనచో ఊర్జస్వి భావశాంతి అలంకారములగును.

ఉ. సొమ్ములెః సొమ్ములుం గలయ సొంపులు వుట్టెడురీతిఁ
గావ్యజా
లమ్ములయం దలంకృతు లలంకృతులం గలయంగ శోభమై
నిమ్మహిఁ బొల్చుఁ దద్ఘటన మెచ్చక తోఁ దిలతండులా ప్తిరూ
పమ్మనఁ బాలునీరనయు భాతిఁ దగుఁ ద్వివిధత్వ మొందుచున్
క. తిలతండులరూపమ్మన
నలరుఁ సంసృష్టి; సంకరాఖ్యము పాల్నీ
రీలు నేకమైనకై వడిఁ
దెలుపుం; దత్సంకరంబు త్రివిధము కృతులన్. 282

వ్యాఖ్య :- లోకమున అలంకారముల సంయోగమున సౌందర్యం కలుగునట్లుగా రూపకాది అలంకారములు సంయోగము వలన సౌందర్యం కలుగును. ఈ సంయోగము తిలతండులాన్యాయమువలె నుండును. మరి యొకటి పాలు నీరువలె కలసి సంకరాలంకారమగును.

తే. ఎలమి నంగాంగిభావంబు, నేకవాచ
కానుబంధంబు, సందేహ మనఁగ; నిట్లు
పొలుచు సంసృష్టి. సంకరములకు వరుస
లక్ష్యముల నేర్పరించెద లలితఫణితి. 283

వ్యాఖ్య :- ఈ సంకరము అంగాంగి భావసంకరము, ఏకవాచ కాను ప్రవేశసంకరము, సందేహసంకరము మూడు విధములు.

సంసృష్టి :—

క. హారిజబలాకులగిరికుచ
వరచందనరజములగు భవత్కీర్తికుచుల్

నిరవద్యసుధాంభోధి
స్ఫురణంబు వహించె నోబభూవరునరసా! 234

క. 'హరిదబలా చందనమయి
యురుదగు' నను రూపకంబు నమృతాంభోధి
స్ఫురణంబుఁ దాల్చె ననియెడి
సరసనిదర్శనయుఁ బొల్చు సంసృష్టియనన్. 235

వ్యాఖ్య :- ఇందు "హరిదబలా" అనుచో రూపకాలంకారము "సుధాంబోధి స్ఫురణము" అనుచో నిదర్శనాలంకారము కాన అర్థాలంకార సంసృష్టి అయినది.

అంగాంగిభావసంకరము :—

క. అసిజిహ్వోభయదం బై
యనమమహాబలవిశేషహారియు నై, యి
వ్వసుధ భవద్భుజదండము
పొసఁగుఁ ఫణిమాడ్కి నోబభూవరునరసా! 236

క. 'అసిజిహ్వక' యను రూపక
మనమమహాబలవిశేషహారిశ్లేషం
బెనఁగు ఫణిమాడ్కి భుజ మను
దెన నంగాంగిత్వ మొందెఁ దెలియ నుపమతోన్. 237

వ్యాఖ్య :- ఇందు "ఫణిమాడ్కి" అనుచో ఉపమాలంకారము, "అసిజిహ్వ" అనుచో రూపకము "మాహాబల" అనుచో శ్లేషయు గలవు. ఇందుగల అలంకారములు సమకాయ సంకరము కలదు.

ఏకవాచకానుప్రవేశసంకరము :—

క. విశ్వామిత్రమదాసహ
శాశ్వతసౌభాగ్య మగుచు సతతోన్నత మై
విశ్వనుత! శ్రీనృసింహమ
హీశ్వర! నీయసి వసిష్ఠునీడనఁ బొల్చున్. 238

క. 'నీవాలు వసిష్ఠునివలె
నేవేళఁ జెలంగు' నన్న నేకపదవిశే
షావిర్భూతము లగుచుఁ
శ్రీ వెలయుఁ శ్లేష, ముపమ చెలఁగును నిచటన్. 239

వ్యాఖ్య :- ఇందు నరసరాజు కర్తి విశ్వామిత్రునిమదము అణచెడి వసిష్ఠుని వలెనున్నాడు. "విశ్వామిత్ర" పదమునందు శ్లేషయూ "వసిష్ఠునీడునఁబోల్చు" అనుచో ఉపమాలంకారము అయినది. ఇందు "వసిష్ఠ" శబ్దముచే రెండలంకారముల సాంకర్యము కలిగినది.

సందేహసంకరము :—

క. పాకారితురగ, రాకా
రోకారికళానుకారి, కోమలరుచిరై
యేకాలము రంజిల్లును
నీకీర్తిమురాళి యోబనృపనరసింహా! 240

క. ఇలఁ 'గీర్తి హంసి' యనుచో
సలలితగతి హంసివంటి సత్కీర్తి యొ కా
కిల కీర్తి యనెడు హంసియొ
తెలియ దుపమ, రూపకంబు తేటఁగ నిచటన్. 241

క. ఈరీతిం గొని యలం
కారము తేర్పఱిచినాఁడఁ; గడమ తడవనే
నేరక వర్జించుట గా;
దారయ విస్తారభీతి నాపాదింపన్. 242

వ్యాఖ్య :- ఇందు "నీ కీర్తిహంసి" అనుచో హంసవంటిసత్కీర్తి అని ఉపమాలంకారమో, కీర్తి అనెడు హంసి అని రూపకాలంకారమో స్పష్టముగా తెలియకుండుటచే సందేహ సంకరము అను అలంకారము అయినది.

శా. పక్షామండుపపండు పాభయదదోర్మాహాత్మ్య! ధాటీ మహా
టుక్షార ప్రతిరుద్ధభూభువన! హింసా రాజ్యసంస్థాపనా!
ప్రాక్షదోన్నతకులోత్థితధ్వజపట! ప్రాయఃప్రసర్పద్యశః
ప్రక్షీర్వీకృతశర్వకంకణవసుస్యాజాలకోలాహలా! 243

క. సాహిత్యభోజ! భూజన
సౌహిత్యనిదాన! దానసంతాన! మహా
బాహాపదానవాహా
రోహణరేవంత! లలితరూపజయంతా 244

వర్గపంచకరహితసుగంధివృత్తము:—

హార, హీర, సారసారి, హారశైల, వానవో
ర్వీరుహా, హిహార, శేష వేషహాసలాలస
శ్రీరసోరుయాశసాంశుశీల వైరివీరసం
హార! సారశౌర్యసూర్య హార్యవార్యసాహసా. 245

గద్యము. ఇది శ్రీహనుమత్ప్రసాదలబ్ధకవితాసారసారస్వతాలంకారనిరంకుశప్రతిభాబంధుర ప్రబంధపరిసరచనాధురంధర ప్రబంధాంక వేంకటరాయభూషణ సుపుత్త్రి తిమ్మరాజపౌత్త్రి సకలభాషావిశేష నిరుపమావధానశారదామూర్తి మూర్తి ప్రణీతం బైన నరసభూపాలీయం బనఁద్రాజనామధేయాంకితంబై పొల్చు కావ్యాలంకారసంగ్రహం బను మహాప్రబంధంబునం దర్థాలంకారవిభాగంబును, సంకర సంసృష్టి నిర్ణయంబు నన్నది సర్వంబును బంచమాశ్వాసము సంపూర్ణము.

—:సమాప్తం:—


అనుబంధం—1
నగసరాజు వంశవృక్షము
తిరుమలరాజు
తిమ్మరాజు
పానెమ్మయందు
రామరాజు
పైచమాంబికయందు
తిమ్మరాజు
భా. కొండమ
ఓబరాజు
వరదరాజు
భా. ఓబళమ్మ
ఓబళరాజు
రామరాజు
పెద్ద వేంకటరాజు
భా. తిమ్మాంబ
తిమ్మరాజు
చినతిమ్మరాజు
లక్ష్మాంబయందు
ఓబళరాజు
తిప్పరాజు
పానెమరాజు
వెంకటరాజు
వల్లభరాజు
భార్య - ప్రోలదేవి
తిమ్మరాజు
భార్య, గంగమాంబ
ఓబళరాజు
మూర్తిరాజు
సింగరాజు
భా. లక్ష్మసూరాంబి
నరసరాజు
(కృతిభర్త)
భా. తిరుమలమ్మ
శ్రీరంగరాజు

# అనుబంధము_2

## నాయక భేదములు

నాయిక (౧౬)

- స్వీయ
  - ముగ్ధ (౧)
  - మధ్య
    - ధీర
      - జ్యేష్ఠ
      - క
    - అధీర
      - జ్యేష్ఠ
      - క
    - ధీరాధీర
      - జ్యేష్ఠ
      - క
  - ప్రౌఢ
    - ధీర
      - జ్యేష్ఠ
      - క
    - అధీర
      - జ్యేష్ఠ
      - క
    - ధీరాధీర
      - జ్యేష్ఠ
      - క
    - (౧౨)
- పరకీయ
  - పరోఢ
  - కన్యక (౨)
- సామాన్య (౧)

క = కనిష్ఠ

౧+౨+౧౨+౧ = ౧౬

ధ్వని

(4) అవివక్షితవాచ్యము — వివక్షితాన్యపరవాచ్యము

అర్థాంతరసంక్రమితము అత్యంతతిరస్కృతము — సంలక్ష్యక్రమవ్యంగ్యము అసంలక్ష్యక్రమవ్యంగ్యము

వాక్యగతము పదగతము వాక్యగతము పదగతము — వర్ణగత పదైకదేశగత పదగత వాక్యగత రచనాగత ప్రబంధగత (6)

(4) శబ్దశక్తిమూలము — అర్థశక్తిమూలము (36) — ఉభయశక్తిమూలము (1)

వస్తుధ్వని — అలంకారధ్వని

వాక్యగతము పదగతము — వాక్యగతము పదగతము

స్వతఃసంభవి — కవిప్రౌఢోక్తిసిద్ధము — కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధము

వస్తుధ్వని అలంకారధ్వని — వస్తుధ్వని అలంకారధ్వని — వస్తుధ్వని అలంకారధ్వని

వస్తు అలం — వస్తు అలం — వస్తు అలం — వస్తు అలం — వస్తు అలం — వస్తు అలం

ప్ర వా ప — ప్ర వా ప — ప్ర వా ప — ప్ర వా ప — ప్ర వా ప — ప్ర వా ప — ప్ర వా ప — ప్ర వా ప — ప్ర వా ప — ప్ర వా ప — ప్ర వా ప — ప్ర వా ప

అనుబంధము - 4



వాచ్యోత్ప్రేక్ష-భేదములు

# వాచ్యోత్ప్రేక్ష-భేదములు




హే. హేతువు.

ఫ. ఫలము.

స్వ. స్వరూపము.

గు. గుణనిమిత్తము

క్రి. క్రియానిమిత్తము.

వా. వాచ్యనిమిత్తము.

గ. గమ్యనిమిత్తము.

# అనుబంధము-5

## గమ్యోత్ప్రేక్ష—భేదములు




హే. హేతువు.

స్వ. స్వరూపము.

క్రి. క్రియానిమిత్తము.

ఫ. ఫలము.

గు. గుణనిమిత్తము.

4-44-8131 / P AM — Acc No. 21019